# వనిత

ఏప్రిల్ '80

వెల: 2 రూపాయలు



'అందాలరాణి'గా
ఎన్నికైన
జేన్ లోబో

కొత్తశీర్షిక
'మీ రచయిత్రితో మీరు'
వాసిరెడ్డి సీతాదేవి
సమాధానాలు

'ఏప్రిల్‌ఫూల్'
ఎలా వచ్చింది?
ఎందుకొచ్చింది?

జైన దేవాలయాలు

ఏప్రిల్ . 80

దాసరి నారాయణరావు

డా॥ అక్కినేని నాగేశ్వరరావు సమర్పించు




ఎ.ఎ. కంబైన్స్

Scan
Bindu

# బుచ్చిబాబు

ఈస్ట్‌మన్‌కలర్









అన్నపూర్ణ

నిర్మాతలు వెంకట్ అక్కినేని
*నాగార్జున అక్కినేని

# వనిత

స్త్రీ జన మాస పత్రిక

సంపుటి : 5 సంచిక : 10

ఏప్రిల్ : 1980

విడి ప్రతి : రెండు రూపాయిలు

సం॥ర చందా : ఇరవైనాలుగు రూపాయిలు

శ్రీలంక : రూ. 2.00 (ఇండియా)

మలేసియా : 90 సెంట్స్

చిరునామా :

చందమామ బిల్డింగ్స్

మద్రాసు-600 026


## పర్వదినాలు పట్టుగొమ్మలు!

ఏటేటా వచ్చే అసంఖ్యాకమైన పండుగలను మనం కేవలం ఆడంబరంగా, ఆనందంగా జరుపుకోవటంతో సరిపెట్టుకొంటే చాలదు. ఆయా పర్వదినాల సందర్భంలో ఆ సాంప్రదాయాలు, ఆచారాలు ఎందుకు ఏర్పడినవి? (ఉదాహరణకు:— సంక్రాంతికి గొబ్బిళ్లు, భోగిమంటలు, ఉగాదికి ఉగాది పచ్చడి, దీపావళికి బాణసంచా కాల్పులు ఇత్యాది ఆచారాలు) ఆ ఆచారాల వెనుక అంతర్గతంగా వున్న వైజ్ఞానిక విశేషములు, గాథలు, ఆరోగ్య సూత్రాలు మున్నగునవన్నీ తార్కిక దృష్టితో తెలుసుకుని పర్వదినములు జరుపుకొన్నప్పుడే పర్వాచరణము సార్థకత కాగలదు. మన పర్వదినాలు, పండుగలు కేవలం శుష్క సంప్రదాయాలు కావనీ, అందులో పూర్వీకులచే నిర్దేశితమైన విజ్ఞాన విషయాలెన్నో వున్నవనీ గ్రహించగలగాలి. ఇలాంటి విషయావగాహనకు మార్చి 'వనిత' లో ప్రచురించబడిన "ఉగాది పర్వప్రాశస్త్యము, మరియు ఉగాది ఆచారంలో వున్న ఆరోగ్యసూత్రాలు" వంటి వ్యాసాలు ఎంతో తోడ్పడగలవు. పండుగలనేవి కేవలం ఆనందోత్సాహాలకే సంకేతాలు - మూఢ నమ్మకాలకు ప్రతి రూపాలనే భావనలను పారదోలాలి. పర్వదినాలలో వుండే జాతీయతా భావాన్ని, సత్సందేశ, ప్రయోజనాత్మక దృక్పథాలను బహిర్గతపరచి పదుగురి దృష్టికి తేగలగాలి. 'భారతీయ సంస్కృతికి పట్టుగొమ్మలు పర్వదినాలు' కనుక ఆయా పర్వదినాలకు సంబంధించిన ఆధ్యాత్మిక, వైజ్ఞానిక, నైతిక విశిష్టతలను, విలువలను పాఠకులకు తెలియ చెప్పటం భారతీయ సంస్కృతికి అత్యున్నతి చేకూర్చుటమే కాగలదు!

**జి. మమత** — వెల్లూరు



'అభిప్రాయాలు' పేజీలలో
ప్రచురింపబడే ప్రతి లేఖకూ
పారితోషికం పది రూపాయలు

## సూర్యగ్రహణం-మూఢ నమ్మకం

ఫిబ్రవరి 16 ఎప్పుడు వస్తుందా అని వేలాదిమంది ప్రజలు ఎదురు చూశారు. అన్నిరోజుల్లా ఆ రోజూ సూర్యోదయం అయింది. రాను రాను వీధులలోని జనం పల్చబడ్డారు. పల్లెల దగ్గర నుండి పట్టణాలతోసహా పౌరజీవనం స్తంభించింది. మొత్తం వీధులన్నీ నిర్మానుష్యమై ప్రజలు ఇళ్ల తలుపులు గది కిటికీలు కూడా మూసేశారు. ఏమైనా సూర్య కిరణాలు లోపల కొస్తాయేమో అని కిటికీల తెరలు కూడా దించారు. సహజంగా జరిగే ప్రకృతి చర్యకు ఇంత భయాందోళన కలిగించాయి పేపరు, ఆకాశవాణి. మన ప్రభుత్వం సెలవు కూడా ప్రకటించింది! పైగా గంట గంటకూ హెచ్చరికలు! వెయ్యిమంది శాస్త్రజ్ఞులు ఈ గ్రహణాన్ని చూడాలని విదేశాల నుండి మన దేశం తరలి వస్తే మనం వరండాలో నించొని చూసే ధైర్యం లేక ఇండ్లలో తలుపులేసుకు కూర్చోవడం చాలా హాస్యాస్పదం. నాకు 10 ఏళ్ళ పాప వుంది. అప్పుడు ఒకసారి 69 లో నార్త్ ఇండియాలో పాక్షిక గ్రహణం వచ్చింది. అప్పుడు మేము పటాన్ కోటలో వున్నాము. నేను 6 నెలల గర్భిణిగా వుండి కూలింగ్‌గ్లాస్‌తో సూర్యగ్రహణం చూశాను. కూరగాయలు కోశాను. భోంచేశాను. కాని మా పాప చాలా ఆరోగ్యంగా ఏ గ్రహణం 'మొర్రి' లేకుండా పుట్టింది. చెప్పొచ్చేదేమంటే మనం సైంటిఫిక్‌గా ఎన్నో సాధించిన కాలంలో వుండి యిలా మూఢనమ్మకాలంతో సూర్యగ్రహణాన్ని చూడలేకపోవడం చాలా శోచనీయం. స్త్రీలు ఎంతో చదువుకుంటున్న ఈ దశాబ్దంలో ఈ మూఢ నమ్మకాలకీ, ప్రకృతి సిద్ధంగా జరిగే వాటికీ భయపడడం మర్చిపోవాలి!

**యమ్. అరుణ** — తాడేపల్లిగూడెం

## అందమైన భార్య - గుండెజబ్బు!

ఆ మధ్యన బొంబాయిలో గుండెజబ్బులపై ఆరవ ఏసియా—పసిఫిక్ సమావేశం (కాంగ్రెస్) జరిగింది. ఆ కాన్ఫరెన్స్‌లో గుండెజబ్బులు, వాటికి కారణాలు మొదలైనవి చర్చించబడ్డాయి. ప్రతీమాటులాగే ఆహారం ఒక కారణమన్నారు. గాని తమాషా ఏమిటంటే ఈ మాటు ఓ రెండు అందమైనవి కూడా ఆ కారణాల జాబితాలో చేరేయి. అవి ఏమిటంటారా? ఒకటి అందమైన భార్య రెండవది కమ్మని వంటకాలు వండిపెట్టే వంటవాడు. డాక్టర్ల అభిప్రాయాలు ఈ విధంగా ఉన్నాయి. అందమైన భార్య మగవాళ్ళ విషయంలో, వారి శరీరంలోని అధిక రక్తప్రసరణకి కారణం అవొచ్చు. దీనివలన సన్నని రక్తనాళాలలో అధిక రక్త ప్రసరణవలన గుండెకాయకి ఎక్కువ భారం కలగవచ్చు. మీపై అలిగి, మీ అందమైన భార్య పుట్టింటికి వెళ్తే ఆందోళన ఎక్కువై బి. పి లేదా రక్తప్రసరణ ఎక్కువవుతుంది. దీనివలన కూడా గుండెజబ్బులు రావొచ్చుట! ఆ సమావేశంలోని డాక్టర్లు, అందమైన భార్య, కమ్మని వంటకాలు తయారు చేసే వంటవాడు హైపర్ టెన్షన్‌కి కారణం అని అన్నారు. ఇక అందమైన భార్యే మంచి వంటలక్క కూడా అయితే ఎంత ప్రమాదమో!

**పి. శాంత** — న్యూఢిల్లీ

## స్త్రీలూ ఆలోచించాలి!

స్త్రీ జీవితాన్ని రాచి రంపాన పెడ్తున్నది పురుషులేనని ఎన్నో కథల్లోనూ, వ్యాసాల్లోనూ చాలా భాగం చూస్తున్నాం. కాని మనవాళ్ళు స్త్రీకి జరిగే అన్యాయాన్నే ఉన్నదాన్ని ఉన్నట్టుగా కొంతమంది గోరంతలు కొండంతలు చేస్తూ కొంతమంది రాస్తున్నారే తప్ప పురుషుడు పడ్తున్న పాట్లను వ్రాసేవారు అరుదుగా కన్పిస్తున్నారు. ఒక సంఘటన




జరిగిందంటే దానికి ఇరుపక్షాల ప్రభావమూ ఉంటుంది కదా! అయితే మన సమాజంలో స్త్రీకే అన్యాయం జరుగుతున్నదంటే ఆ విషయంతో నేను ఏకీభవించను. మంచి హృదయాలున్న పురుషుల హృదయాలలో అగ్నివేసి ఆ అగ్నిని రాజ వేస్తున్న 'వనిత' లెందరో స్త్రీ జాతికే కళంకంగా ఉన్నారన్న సత్యాన్ని గమనించాలి. ఒక పురుషుడు స్త్రీని బాధిస్తున్నాడంటే అది కొంత వరకూ ఆమె అసమర్థతే అని చెప్పకతప్పదు. వారి మనస్తత్వాన్ని మార్చే విధంగా దారిలోకి తీసుకు రావడానికి ప్రయత్నించకుండా దాన్ని గూర్చి నలుగురితో చెప్పుకొని ఆ పురుషుడి హృదయాన్ని మరీ కఠినంగా చేస్తున్నారు. దాంతో అతడు మరీ విజృంభించే అవకాశాలు ఉన్నాయి. ఇలా అని నేను పురుషుడ్ని సమర్థించడం లేదు కాని స్త్రీ జాతివల్ల కూడా జరుగుతున్న తప్పుల్ని గమనించమని మనవి చేస్తున్నాను.

వై. మోహిని　　　　చిట్టివలస

### మూఢాచారాలు!

సంఘంలో కొన్ని మూఢనమ్మకాలు నశించినా మూఢాచారాలు ఇంకా కొనసాగుతూనే ఉన్నాయి. ఈ విషయాల్లో ఆడవాళ్ళదే పైచెయ్యికావడం నిజంగా సిగ్గుపడాల్సిన విషయం. ఈ మధ్య జరిగిన ఒక సంఘటన చెబుతాను. "ఆమెకు పెళ్ళయింది. పెళ్ళయిన సంవత్సరానికే భర్త ఆక్సిడెంట్‌లో మరణించాడు. తర్వాత ఆమె తల్లిదండ్రులు రెండో పెళ్ళివానికి ఆమెనిచ్చి పెళ్ళి చేశారు. వారిద్దరి మధ్యా కాపురం బాగానే సాగుతోంది. ఆ ఊరిలో దేవునిగుడిలో ఉత్సవాల సమయంలో పీటల మీద కూర్చోవాలని నిర్ణయించుకున్నారు. కాని ఆమె ఒకప్పుడు 'విధవ అనే కారణంతో ఆమె అత్తగారు గాని, బంధువులుగాని అలా పీటలపై కూర్చోవడానికి ఒప్పుకోలేదు. అది ఉమ్మడిసంసారం కావడంతో ఎలా అయితేనేం వారి నా ప్రయత్నం నుండి బలవంతంగా విరమింపజేశారు. అయితేఆమెను పేరంటాళ్ళకు, తక్కిన శుభకార్యాలకూ అందరూ పిలుస్తారు. ఆమే వెళుతుంది. అలా అయినప్పుడు మరి దేవాలయం దగ్గరకు వచ్చేసరికి ఈ కట్టుబా టెందుకూ? అది దేవునిగుడి కనుక అపవిత్రం అయిపోతుందట. ఆమె ఒకప్పుడు విధవ అయినంత మాత్రాన పీటలమీద కూర్చోగూడదా? [అసలు విధవ అయినంతమాత్రాన పీటలమీద కూర్చోగూడదని ఏమిటి] ఒకవేళ ఆమె పట్టుపట్టి కూర్చున్నా "గుడికి మేమెవరం రాము" అని ఆమె అత్త గారూ, ఆడబిడ్డలూ అనడం సబబేనా?

వి. జయవేణి　　　　వడాలి

### రేడియో - పిల్లలు!

విజయవాడ ఆకాశవాణి కేంద్రం పిల్లల కార్యక్రమాన్ని శని, ఆదివారాలలో ఉ. 8-35 గం॥కు ప్రసారం చేస్తున్నది. ఇందులో ఆదివారం కార్యక్రమాన్ని పిల్లలందరూ వినే అవకాశమున్నది. కాని శనివారం కార్యక్రమాన్ని పిల్లలు పాఠశాలలకు వెళ్ళే ప్రయత్నంలో ఉంటూ వినలేకపోతున్నారు. ఈ అంశాన్ని ఆ కేంద్రం గమనించకపోవడం శోచనీయం. ఇక హైదరాబాదు ఆకాశవాణి కేంద్రం పిల్లల కార్యక్రమాన్ని శనివారంలో మ. 2-30 గం॥కు, ఆదివారంలో మ. 2-10 గం॥కు ప్రసారం చేస్తున్నది. ఈ సమయంలో చాలామంది పిల్లలు నిద్రపోవడం వల్ల ఈ కార్యక్రమాలను వినలేకపోతున్నారు. ఈ సమయం తప్పితే హైదరాబాదు కేంద్రానికి వేరే అనుకూలమైన సమయమేలేదా? ఈ కేంద్రం శనివారం సా. 5-00 గం॥కు ఆదివారం ఉ. 10-00 గం॥కు పిల్లల కార్యక్రమాన్ని ప్రసారం చేసే అవకాశముంది. అలా చేస్తే పిల్లలందరూ తప్పక ఆ కార్యక్రమాల్ని హాయిగా విని ఆనందించగలుగుతారు. ఈ విషయాన్ని గుర్తించి హైదరాబాదు, విజయవాడ ఆకాశవాణి కేంద్రాలు పిల్లల కార్యక్రమాలను పిల్లలందరూ వినడానికి అనుకూలమైన వేళలకు మార్పు చేయడం మంచిది. ప్రస్తుతం విజయవాడ కేంద్రం పిల్లల కార్యక్రమాన్ని విశాఖపట్టణం కేంద్రమూ, హైదరాబాదు కేంద్రం పిల్లల కార్యక్రమాన్ని కడప కేంద్రమూ రిలే చేస్తున్నాయి. అలా రిలే చేయడం మాని పిల్లలకు స్వయంగా కార్యక్రమాలు ప్రవేశపెట్టకపోవడం విచారకరం. అలా చేసి వుంటే కడప, విశాఖపట్టణం ప్రాంతాల పిల్లలకు ఆ కార్యక్రమాల్లో పాల్గొనే అవకాశం దక్కుతుంది!

యస్. రాజకుమారి　　　　హొసూరు



## మీ రచయిత్రితో మీరు

వచ్చే సంచికలో ప్రసిద్ధ రచయిత్రి డా. సి. ఆనందారామం పాఠకుల ప్రశ్నలకు సమాధానాలు ఇస్తారు జూన్ సంచికలో

ప్రసిద్ధ నవల, కథా రచయిత్రి

### శ్రీమతి డి. కామేశ్వరి

పాఠకుల ప్రశ్నలకు సమాధానాలు ఇస్తారని తెలియజేయడానికి సంతోషిస్తున్నాము. పాఠకులు ఆమె కథల మీద గాని, నవల మీద గాని, వ్యక్తిగతంగా గాని ఇతరత్రా గాని ఎలాంటి ప్రశ్నలయినా అడగవచ్చు. ప్రశ్నలు కార్డు మీదనే రాయాలి. ఒక కార్డులో ఒక్క ప్రశ్నే వుండాలి. పైన పంపిన వారి పేరు, చిరునామా వుండాలి. ప్రశ్నలు 'మీ రచయిత్రితో మీరు' అని రాసి, 'వనిత' చిరునామాకు ఏప్రిల్ 15వ తేదీలోగా చేరేలా పంపాలి. ఈ ప్రశ్నలకు సమాధానాలుజూన్ సంచికలో వస్తాయి.

మంచి ప్రశ్నగా భావింపబడిన ప్రశ్న పంపినవారికి

పాతిక రూపాయలు బహుమానం!!

డిశంబర్-79 వనితలో బామ్మగారు 'ఏమ్రా' 'అవునా' అని ఆమె సంబోధించడం సభ్యతగా" లేదంటూ మద్రాసునుండి ఆర్. వి. కామేశ్వరిగారు రాశారు. కాని ఆ పదాల్లో ఏమంత అసభ్యత అనిపించిందో వారికే తెలియాలి. నా దృష్టిలో మాత్రం బామ్మగారలా సంబోధించడం పాతకాలపు వారిని జ్ఞప్తికి తెప్పిస్తున్నారు. పైగా ముచ్చటగానూ, మర్యాదగానూ వుందా సంబోదన.

—వి. సరోజారామకృష్ణ, బొంబాయి

డాక్టర్‌గారితో సంప్రదింపులే కాని అందులో సలహాలు కనిపించడంలేదు. అతి చిన్న జబ్బుకి మీరు సలహా యెందుకు అడుగుతారు అన్నట్టుగా వున్నాయి సమాధానాలు. అప్పుడప్పుడు, అక్కడక్కడ మందులు కూడా వివరిస్తే బాగుంటుంది.

—గురువెళ్ళ ప్రమీలాలక్ష్మిబాయ్, ఖర్గపూర్

'కొత్త రోజులు' కథానిక చాలా బాగుంది. నిజంగా ఉద్యోగం చేసే వనితలు పడే పాట్లను చక్కగా వివరించారు. వైద్య విశేషాలలో వక్షోజాలకు ధరించే బ్రాలను గురించి బాగుగా తెలిపినారు. బల్లివలన కలిగే అపోహలను తొలగించారు.

—కె. భారతీదేవి, మహబూబ్‌నగర్

వేదుల శకుంతలగారి 'కొత్త రోజులు' కథ చాల బాగున్నది. వేదుల శకుంతలగారికి, మా అభినందనలు.

—షామిరా, షాకిరా, మల్లిక, హిందూపూర్

మార్చిలో ప్రచురించిన "గీతోపదేశం" చాలా బాగుంది. ప్రచురించిన మీకు, దీనిని గురించి చాలా విపులంగా వ్రాసిన వారికి, ధన్యవాదములు.

—శ్రీమతి రావు, గుంటూరు

"ఉగాది ఆచారాల్లో ఆరోగ్య రహస్యాలు" బాగున్నది. సీరియల్స్ ఆనందదాయకంగా ఉన్నవి. మీరు ప్రతి నెలా ఒక సినీ నటిని కూడా పరిచయం చేస్తే బాగుంటుంది.

—సుమిత్రాశెట్టి, మహబూబ్‌నగర్

'పుట్టిన రోజులు' శీర్షిక ఈ సంచికతోనైనా ముగించి మరొక క్రొత్త శీర్షిక ఏదైనా వేస్తే బాగుంటుంది.

—ఎస్. కామేశ్వరి, కొత్తపేట

"సంగతులూ - సమాచారాలు" శీర్షికకు రెండు పేజీలు కేటాయించడం సమంజసంగా లేదు. బల్లి విషపూరితం కాదు అనడం ఆశ్చర్యకరంగా ఉంది!

—ఆర్. వి. కామేశ్వరి, మద్రాసు




మార్చి నెల వనితకు 'గీతోపదేశం' ఎనలేని అందాన్ని ఇచ్చింది. ఎన్నో రోజులుగా గ్రామఫోను రికార్డుపై వేయడానికి మంచి చిత్రం కోసం చూస్తున్న నాకు ఈ చిత్రం లభించింది. చక్కటి చిత్రాన్ని అందించిన మీకు, శ్రీమతి అల్లాడి రోహిణిగార్కి నా అభినందనలు.

—పి. రోజారమణి, దంగేరు

మార్చి 80 "వనిత" వంగ వధువు ముఖ చిత్రంతో అత్యంత అందంగా ఆకర్షణీయంగా వుంది. ఈ సంచికలో అందించిన వంగ దేశీయుల వివాహ విధానం గురించి తెలిపిన సంక్షిప్త వ్యాసం అత్యద్భుతంగా వుంది.

—కె. జి. సరళకుమారి, కుప్పం

మార్చి సంచికలో ప్రచురించిన 'గ్రామీణ గృహిణులకు కల్పతరువ గోబార్‌గ్యాస్ వ్యాసం బాగుంది. కాని పిడకలు అమ్ముకుని జీవించే కింది తరగతి వాళ్లని ఇది దెబ్బ తీస్తుంది. మరి వారి మాటేమిటి?

—లక్ష్మి, కందిమళ్ల

వేదుల శంకుతల వ్రాసిన కొత్త రోజులు కధ బాగుంది. ఈ నెల కలువరేకుల ముగ్గు చాలా బాగున్నది.

—పి. ముత్యాలవేణి, గుండూరు (కర్నాటక)

ఈ నెల "బామ్మగారి పేజి" చదువుకున్నాక జలుబును నివారించే విధానాలు తెల్సుకోగలిగాము. బామ్మగారి కబుర్లు ఎంతసేపైనా చదవాలనిపించేలా ఉన్నాయి. జలుబును నివారించే ఉపాయాలు మనకు చెప్తున్న బామ్మగారికే చివరికి తుమ్ములు రావటం గమ్మత్తుగా, హాస్యంగా అనిపించింది. ఇలాంటి మంచి శీర్షికలతోనే వనిత ఎప్పుడూ వెలువరించబడాలని ఆశిస్తున్నాము.

—సత్యవాడ సోదరీమణులు, విశాఖపట్నం

మీరు మార్చి నెల వనితలో వేసిన "గీతోపదేశం" క్రాస్‌స్టిచ్ 'భగవద్గీత' డిజైన్ చాలా బాగుంది.

—ఉమకుమారి, కాకినాడ

'వనిత'లో రచయిత్రులు మాత్రమే పాల్గొనాలనీ, రచయితలకు అవకాశం లేదనిగదా మీరు నిబంధనలు తెలిపియున్నారు. మరి మార్చి వనితలో 'ఉగాది ఆచారాలలో ఆరోగ్య రహస్యాలు' అనే వ్యాసం రచించిన డాక్టర్ లక్ష్మి ఎన్. ఎమ్. శ్రీరామ్ (లక్ష్మి నారాయణమూర్తి శ్రీరామ)గారి విషయంలో మీ నిబంధన సడలించారా? లేక నిబంధనలు మార్చినారా? 'వనిత'లో రచయిత రచన ప్రచురించబడ్డం ఇదే ప్రథమం అనుకొంటాను.

—టి. బృంద, నెల్లూరు

ఫిబ్రవరి - 80 సంచికలో ప్రచురించిన 'వనిత మాటల కొలువు - 54' సమాధానాలలో 1 నిలువుకి మీరు యిచ్చిన సమాధానం 'అనుశృతి.' కానీ అది సరికాదు. 'అనుశ్రుతి' అని వుండాలి. 'శబ్దార్థ చంద్రిక', 'శబ్దరత్నాకరము'లలో గూడా 'అనుశ్రుతి' అనే వుంది. 'అనుశృతి' అన్న పదమే లేదు.

—అలపర్తి లక్ష్మితులసి, గుంటూరు

[మీరు చెప్పినది రైటే. సమాధానంలో పొరపాటున 'శృ'గా అది అచ్చయింది అంతే! –వ.సం]

## వనిత మాటల కొలువు-56

సరైన సమాధానం :

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 కా | కి | 15 నా | డ | ■ | 2 పు | త్రా | 16 రు |
| న | ■ | యు | ■ | 3 వే | లు | ■ | నీ |
| ■ | 4 అ | న | 17 కా | ■ | ■ | 5 లః | తే |
| 6 తు | ము | ■ | 7 వ | ల | 18 స | ■ | ■ |
| 8 పె | ద్ద | పు | లి | ■ | 9 మి | టా | 20 రి |
| ల్లి | ■ | రి | ■ | 10 బా | ద | ■ | స |
| 11 రు | 21 పే | ■ | 12 పూ | స | ■ | 22 సా | ■ |
| 13 కూ | ట | మి | ■ | 14 ట | రం | ము | పే |

పై సమాధానంతో సరిపోయే సమాధానం పంపిన వారు పదమూడు మంది. వారు :

1. జి. సుమిత్ర, కడప 2. జి. సరోజినీదేవి, అనంతపురం 3. ఆర్. దీప, కోరగుంటపల్లి 4. సి. పద్మజ, హైద్రాబాదు 5. జి. సత్యవతి, హైద్రాబాదు 6. ఆర్. పద్మా శ్రీనివాసన్, హైద్రాబాదు 7. డి. వసుంధర, కావలి 8. యం. బి. శ్రీనివాసలక్ష్మి, కావలి 9. టి. హైమవతీదేవి, శివరామపురం 10. పి. వెంకట మారుతాంబ, మచిలీపట్నం 11. బి. పద్మామోహన్, గూటి 12. కె. అచ్యుతవల్లి, నాగపూర్ 13. ఎస్. సత్యవతి, విజయవాడ.

బహుమతి మొత్తం రూ 150 లను వీరికి సమానంగా పంచి అందజేస్తున్నాము.



అట్ట మీద కనిపిస్తున్న అందమైన అమ్మాయి పేరు జేన్ లోబో. ఇటీవల బెంగళూరులో జరిగిన అందాల పోటీలలో అందాల రాణిగా ఎన్నికై 'అంబి క్వీన్' కిరీటాన్ని అందుకున్న వనిత-జేన్.

జేన్ లోబో జన్మస్థలం మంగళూరు. ఉద్యోగరీత్యా ప్రస్తుతం బెంగళూరులో వుంటోంది. ఆమె తండ్రి మైకేల్ లోబో ఇండియన్ ఎయిర్ లైన్స్‌లో ఉన్నత పదవిలో వున్నారు. తల్లి జూలియన్. అన్నదమ్ములు నలుగురూ ఉద్యోగస్తులే. జేన్ ఉద్యోగంలో చేరడానికి ముందు తల్లిదండ్రులు తమ అభ్యంతరాన్ని తెలియజేశారు. 'ఇందరు ఉద్యోగం చేస్తూంటే మళ్ళా నువ్వెందుకు?' అన్నారు. కాని జేన్ అభిప్రాయం అందుకు భిన్నంగా వుంది. "బి. ఏ. చదివి ఇంట్లో కూర్చుని నేనేం చెయ్యాలి? అయినా ప్రతి ఒక్కరూ ఎవరి కాళ్ళ మీద వారు నిలబడగలిగే ధైర్యం, వ్యక్తిత్వం, స్వాభిమానం ఏర్పరచుకోవాలి. అందుకు ఉద్యోగం అన్నది కొంత అవకాశం కల్పిస్తుంది" అన్నది జేన్. ఆ సమాధానంతోనే తల్లిదండ్రుల్ని ఒప్పించి మొదట బెంగళూరులోని ఒక విదేశీ విమాన సంస్థలో ఉద్యోగంలో చేరింది. ప్రస్తుతం బెంగళూరులోనే ఒక ప్రముఖ వజ్రాల వ్యాపార సంస్థలో ఒక ముఖ్యాధికారికి కార్యదర్శిగా వుంటోంది.

కళాశాలలో చదువుతూ వుండగానే జేన్ ఎన్. సి. సి. లోనూ, ఫ్లైయింగ్, రైఫిల్ షూటింగ్‌లలోనూ శిక్షణ పొందింది. లండన్ స్కూల్ సర్టిఫికేటుతో సెక్రటేరియల్ కోర్సులోనూ ఉత్తీర్ణురాలైంది. ప్రస్తుతం ప్రైవేటుగా ఎం. ఏ. చదవాలన్నది ఆమె ఆశయం.

ఆంగ్ల సాహిత్యంలో పట్టభద్రురాలైన జేన్‌కు సాహిత్యం పట్ల మంచి అభిరుచి వుంది. చక్కటి హాస్యకథలు, నవలలు

# 'అందాలరాణి' జేన్‌లోబో



చదవడం ఆమె అలవాట్లలో ఒకటి. చిత్రలేఖనం, పాశ్చాత్య సంగీతం అంటే ఆమెకు మక్కువ ఎక్కువ.

జేన్‌కు బ్యాడ్మింటన్, రన్నింగ్, సైక్లింగ్, స్విమ్మింగ్ మొదలైన ఆటలలో కూడా ప్రావీణ్యత వుంది.

ఆమె అందాల పోటీలలో పాల్గొనడమన్నది అనుకోకుండా జరిగింది. ఆ పోటీలలో పాల్గొన్న ఒక స్నేహితురాలిని చూడడానికి జేన్ వెళ్ళినప్పుడు అక్కడి నిర్వాహకులు 'మీరు కూడా ఇందులో పాల్గొనండి' అని అన్నారట. అలా పాల్గొన్న జేన్ బొంబాయిలోనూ, బెంగళూరులోనూ జరిగిన ఆ పోటీలలో పాల్గొని బెంగళూరులో 'అందాలరాణి' బిరుదు దక్కించుకుంది. అఖిల భారత స్థాయిలో బొంబాయిలో జరిగిన ఆ పోటీలలో ఆమెకు ద్వితీయ స్థానం లభించింది.

జేన్ లోబో కొన్ని వ్యాపార ప్రకటనలకు మోడల్‌గా కూడా వున్నది. "అయితే ఈ మోడలింగ్ నా మనస్సుకు నచ్చినప్పుడే చేస్తాను. మోడలింగ్ అన్నది చూసేవారికి ఆహ్లాదం కలిగించాలి. సభ్యత హద్దులలో వుంటేనే నేను అటువంటివాటికి అంగీకరిస్తాను. నేను భారతీయ వనితని—అనే సత్యాన్ని ఎన్నడూ విస్మరించను. అందుకే అంగాంగ ప్రదర్శనలు చేయాల్సి వచ్చే మోడలింగ్‌కి మాత్రం నేను ఒప్పుకోను" అంటుంది జేన్.

"సమయ సందర్భాలకు తగ్గట్టుగా దుస్తులు ధరించడం తెలుసుకుంటే ఉద్యోగం చేసే వనితలకు ఆ విధమైన సమస్యలు వుండవు. అందుకే ఉద్యోగానికి తగ్గట్టుగా నప్పే దుస్తులు ధరించాలి. నేను విదేశీ విమాన సంస్థలో ఉద్యోగినిగా వున్నప్పుడు అక్కడి వాతావరణానికి తగ్గట్టుగా ఆధునికమైన దుస్తులు ధరించే దాన్ని. ప్రస్తుతం నగలు, వజ్రాలు విక్రయించే సంస్థలో ఉద్యోగం చేస్తున్నాను. ఇక్కడకు వచ్చేవారికి మన సంస్కృతీ, సంప్రదాయాలు నచ్చుతాయి. అందుకనే అందుకుతగ్గట్టుగా దుస్తులు ధరిస్తున్నాను" అనే జేన్‌కు సినిమాలలో నటించడంకన్న సినిమాలు చూడడంలోనే ఆసక్తి మెండు. కొందరు నిర్మాతలు ఆమెని తమ చిత్రాలలో నటించమని అడిగినప్పుడు—ఆమె నిరాకరించింది.

"చలన చిత్రాలలోని గ్లామర్ క్షణభంగురం. ప్రేక్షకులకు సినిమా ప్రపంచం ఎంతో ఆకర్షణీయంగా కనిపించినా అందులోని కష్టసుఖాలు ఆ ప్రపంచంలోనివారికే తెలుస్తాయి. అయినా పదిమందినీ ఆశ్రయించి వారు చెప్పిందానికల్లా రాజీపడి జీవించడం నాకు ఇష్టం లేదు. అలా రాణించడం పట్ల నాకు నమ్మకమూ లేదు." అంటుంది జాన్ లోబో. □

ముఖచిత్రం : శ్రీనివాసమూర్తి

తొమ్మిది దశాబ్దాలకాలం తెల్లవారి బానిసత్వంలో గడిపిన జింబాబ్వేలో ప్రస్తుతం నూతనశకం ప్రారంభమయింది. రొడీషియా పేరును జింబాబ్వేగా మార్చుకున్న ఈ దేశం ఆఫ్రికా ఖండంలో వుంది. గడచిన ఏడెనిమిది సంవత్సరాలుగా గెరిల్లా పోరాటం జరిపిన జింబాబ్వేలో గత నెలలో జరిగిన తొలి ఎన్నికలలో ప్రజాస్వామ్య ప్రభుత్వం ఏర్పడింది.

జింబాబ్వే జనాభాలో తొంభైయేడు శాతం నల్లజాతివారే. అయినా ప్రభుత్వం శ్వేతజాతీయులది. అందువల్ల చాలా కాలంగా స్వాతంత్ర్య పోరాటం జరుగుతూనే వుంది. పదిహేను సంవత్సరాల క్రితం అల్ప సంఖ్యాకులైన శ్వేతజాతి నాయకుడు ఇయాన్‌స్మిత్ తనకు తానుగా స్వాతంత్ర్యం ప్రకటించుకున్నాడు. ఈయన ప్రభుత్వానికి బ్రిటన్ ఆమోదం ఇవ్వలేదు. అయినా అతని మీద ప్రభుత్వం మీదా వారు ఎలాంటి సైనిక చర్యా తీసుకోలేదు. ఆయన తనకు వ్యతిరేకంగా చెలరేగిన ప్రజా పోరాటాలను ఇనుపహస్తంతో అణచివేయడానికి శతవిధాలా ప్రయత్నించాడు. అయినా జింబాబ్వే దేశభక్తుల స్వాతంత్ర్య జ్వాల ఆరిపోలేదు. దానికి తోడు అప్పుడప్పుడే వలసపాలన నుంచి విముక్తి పొందిన జాంబియా, టాంజానియా మొదలైన దేశాల నుంచి పోరాటయోధులకు సహాయ సహకారాలు లభించాయి. వారి మద్దతుతో- రాబర్ట్ ముగాబే – జోషువా ఎన్‌కోమోల నాయకత్వంలో గెరిల్లా పోరాటం మరింత తీవ్ర రూపం దాల్చింది.

'విభజించి పాలించు' అన్న అధికార కుయుక్తితో ఇయాన్‌స్మిత్ నల్లజాతివారికి పదవి ఎరచూపి తనవైపు త్రిప్పుకున్నాడు. పేరుకు ఎన్నికలు జరిపి అధికారం వారి హస్తగతం చేస్తున్నట్టు నాటకం ఆడాడు. గత సంవత్సరం ఏప్రిల్‌లో జరిగిన ఆ ఎన్నికలలో గెలుపొందిన బిషప్‌ముజూరేవా మే నెలలో ప్రధాని అయ్యారు. కాని ప్రజల ప్రతినిధిగా గుర్తింపు పొందలేదు. అందువల్ల పరిస్థితి విషమించక ముందే జాగ్రత్త పడిన బ్రిటన్–అన్ని పక్షాల ప్రతినిధులను లండన్‌లో సమావేశపరచి చర్చలు జరిపింది. ఓ ఒప్పందం కూడా కుదిరింది. ఆ ఒప్పందం పర్యవసానమే ఇటీవల జరిగిన ఎన్నికలు.




ఈ ఎన్నికలలో మొత్తం వంద పార్లమెంటు స్థానాలలో ఎనభై స్థానాలు నల్లజాతివారికి కేటాయించబడ్డాయి. ఎన్నికలకు ముందు అక్కడక్కడ చెదురు మదురుగా కొంత ఉద్రిక్త వాతావరణం ఏర్పడినప్పటికీ – ప్రశాంతమైన వాతావరణంలోనే ఎన్నికలు జరిగాయని వార్తలు వెలువడ్డాయి.

నల్లజాతివారికి కేటాయించబడిన ఎనభై స్థానాలలో ఏభైయేడు స్థానాలలో రాబర్ట్‌ముగాబే నాయకత్వం వహిస్తున్న జానూ పార్టీ గెలుపొందింది. పేట్రియాటిక్ ఫ్రంట్‌కు చెందిన జోషువా ఎన్‌కోమో పార్టీని కూడా కలుపుకున్నట్లయితే— మొత్తం ఓట్లలో 87 శాతం; తమకు కేటాయించిన స్థానాలలో 96 శాతం అవుతుంది. జింబాబ్వేయునైటెడ్ ఫ్రంట్‌కున్న అసాధారణమైన ప్రజాబలానికి ఇది నిదర్శనం.

తరాల అజ్ఞానం వల్ల, తొంభై సంవత్సరాల బానిసత్వంవల్ల తమకు సొంతమైన భూమిని, ఇతర సంపదలను పరుల పాలు చేసి కడుపుకోసం తాము కష్టం చేసుకుంటూన్న నల్లజాతివారు పరిష్కరించుకోవలసిన సమస్యలు చాలా వున్నాయి. ముందు చూపు, సమయస్ఫూర్తి, సామర్ధ్యాలకు పేరు పొందిన ముగాబే – ఎన్‌కోమోల నాయకత్వంలో ఈ సమస్యల పరిష్కారం అసాధ్యమేమీ కాదు. అధికమైన ఖనిజ సంపదగల జింబాబ్వే మునుముందు అన్ని రంగాలలో అభివృద్ధి సాధించగలదని సభ్య ప్రపంచం విశ్వసిస్తోంది.

జింబాబ్వేలో అల్ప సంఖ్యాకులయిన శ్వేతజాతీయుల పట్ల ఉదార స్వభావంతో మెలగగలమనీ; విదేశ వ్యవహారాలలో అలీన విధానాన్ని అవలంబించగలమనీ రాబర్ట్ ముగాబే ప్రకటించడం ప్రపంచంలోని ప్రజాస్వామ్య కాముకులందరికీ ముదావహమైన విషయం!

*

దేశానికి దేశానికి మధ్య ఎల్లలు మనంగా ఏర్పరచుకున్నవి. అందువల్ల ఇరుగు పొరుగు దేశాల మధ్య అడపాదడపా సరిహద్దు సమస్యలే కాకుండా నదీజలాల పంపకం విషయంలో కూడా సమస్యలు తలెత్తుతూ వుంటాయి.

మన దేశానికి మన పొరుగు దేశమైన బంగ్లాదేశ్‌కి గంగానదీ జలాల పంపక విషయంలో ఏర్పడిన చిక్కు ఓ పట్టాన పరిష్కృతం కావడం లేదు.

1977 సం॥ ఉభయ దేశాల ప్రతినిధుల మధ్య తాత్కాలికమైన ఓ ఒప్పందం కుదిరింది. గంగానదీ జలాలను అధికం చేయడానికి దీర్ఘ కాలిక పథకాలు రూపొందించాలన్నది ఆ ఒప్పందంలోని ప్రధాన అంశం. ఈ పథకాలు కార్యరూపం దాల్చేవరకు– ఇరుదేశాల మధ్య సుహృద్భావం దృష్ట్యా – తనకు రావలసిన న్యాయమైన వాటాలో కొంతవరకు తగ్గించుకోడానికి కూడా అప్పటి భారత ప్రభుత్వం అంగీకరించింది. ఈ ఒప్పందం గడువు మూడేళ్లు. ఈ గడువు కొద్దినెలలలో ముగియబోతోంది. అయినా ఏ ఒక్క పథకమూ కాగితం మీది నుంచి బయటికి రాలేదు.

ఈ విషయాలను పరిశీలించి చర్చించడానికి ఉభయదేశాల ప్రతినిధులు రెండువారాల క్రితం పద్దెనిమిదోసారిగా ఢిల్లీలో సమావేశమయ్యారు.

హిమాలయాలలో నేపాల్ ప్రాంతంలో గంగ ఉపనదులు పుట్టి ప్రవహిస్తున్నాయి. ఈ ఉపనదులకు ఆనకట్టలు కట్టి నీటిని నిలువ చేసి వేసవిలో ఉపయోగించుకోవాలని అందుకు ఉభయదేశాలూ నేపాల్‌తో సంప్రదింపులు జరపాలనీ బంగ్లాదేశ్ సూచించింది. ఈ పథకానికి కోట్లకొలది రూపాయలు ఖర్చవుతుంది. నేపాల్ ఇందుకు సమ్మతిస్తుందా అన్నది అనుమానమే. పైగా దీనిని అంతర్జాతీయ సమస్యగా చేయడం భారత దేశానికి ఇష్టం లేదు. అందువల్ల బంగ్లాదేశ్ సూచనను నిరాకరించింది.

బ్రహ్మపుత్ర నదిలో ఏటా వరదలవల్ల తూర్పు ప్రాంతంలో విపరీతమైన నష్టాలు ఏర్పడుతున్నాయి. అందువల్ల బ్రహ్మపుత్ర నుంచి కాలువలు త్రవ్వి గంగానదికి నీటిని మళ్ళించడం వల్ల వరదల బాధ తప్పుతుంది. నీళ్ల సమస్యా తీరుతుంది. ఇది ఉభయ తారకం అని భారత ప్రభుత్వ ప్రతినిధులు ఎంత నచ్చజెప్పినా బంగ్లాదేశ్ సుతరాము అంగీకరించలేదు. అందువల్ల 1977 సం॥ చేసుకున్న ఒప్పందాన్ని పునఃపరిశీలించడం తప్పనిసరి ఔతోంది. □

## రూ. 100 లు బహుమతి పొందిన ఈ నెల వంటకం

### షామి

కావలసిన పదార్థాలు : 4 పెద్ద సైజు అరటి కాయలు; 100 గ్రా॥ వేయించిన సెనగపప్పు; 50 గ్రా॥ సెనగపిండి; 8 పచ్చిమిరపకాయలు; 10 పాయలు వెల్లుల్లి; 300 గ్రా॥ నూనె; 2 స్పూన్లు జీలకర్ర; 1 కట్ట కొత్తిమిర; చిన్న ముక్క అల్లం; 1 టీ స్పూన్ గరంమసాలా పౌడర్; కావలసినంత ఉప్పు, కొద్దిగా పసుపుపొడి.

తయారు చేసే విధానం : మొదట అరటికాయలను మధ్యకి నిలువుగా కోసుకోవాలి. అంటే ఒక అరటికాయను రెండుగా చేసుకుని తొక్క తీయకుండా అలాగే ఉడికించాలి. ఐదు నిమిషాలలో వుడికిపోతుంది. ఉడికిన తర్వాత దించి తొక్క తీసి ఒక పెద్ద సైజు పళ్ళెంలో పెట్టుకోవాలి.

ఆ తర్వాత పచ్చిమిరప, వెల్లుల్లి, జీలకర్ర, కొత్తిమిర, అల్లం, వేయించిన సెనగపప్పు, ఉప్పు కలిపి ముద్దగా నూరాలి. నూరేప్పుడు కొద్దిగా నీళ్లు చిలకరించాలి. నూరిన ముద్ద మెత్తగా గట్టిగా వుండాలి. రోటి నుంచి ఈ మసాలా మిశ్రమం తీసిన తర్వాత కొద్దిగా నీళ్లుపోసి రోటిని కడిగి ఆ నీళ్లను ఓ ప్రక్క వుంచుకోవాలి.

ఆ పైన పళ్లెంలో వున్న అరటి ముక్కల్ని మెత్తగా పిసికి గుజ్జుగా చెయ్యాలి. ఆ గుజ్జుకు మసాలా ముద్దను చేర్చాలి. అందులో సెనగపిండి, పసుపు, గరంమసాలా పౌడర్ వేసి కలుపుకోవాలి. ఆ మిశ్రమానికి కొద్దిగా నీరు కావాలి. అందుకు మసాలా నూరినప్పుడు వున్న నీళ్ళను కొద్దిగా వాడాలి. ఆ తర్వాత స్టవ్ మీద బాణలి పెట్టి నూనె పోసి వేడయ్యాక – కలిపి వుంచిన పిండిని చిన్న సైజు వుండలు చేసి ఇష్టమైన ఆకారం బిళ్లలుగా చేసి నూనెలో వెయ్యాలి. ఎర్రగా వేగనిచ్చి తియ్యాలి. వేడివేడిగా తింటే ఎంతో రుచిగా వుండే ఈ వంటకం వారం రోజులవరకూ నిలవ వుంటుంది.

—పి. ఇందిరాదేవి, బెల్గాం



కన్సొలేషన్ బహుమతి రూ. 25 లు పొందిన వంటకం

### కాలీఫ్లవర్ స్వీట్ స్క్వేర్స్

కావలసిన పదార్థాలు : 1 తెల్లని గట్టి కాలీ ఫ్లవర్; 500 గ్రా॥ పంచదార; 1 కప్పు కోవా (పంచదార లేనిది); $\frac{1}{4}$ కప్పు సెనగపిండి; 1 కప్పు మినపపప్పు; 10 గ్రా॥ జీడిపప్పు; 25 గ్రా॥ కిస్మిస్; ఎసెన్స్; వేయించడానికి తగినంత నూనె.

తయారు చేసే విధానం: మొదట మినపపప్పును నానబెట్టి మెత్తగా రుబ్బి వుంచుకోవాలి. కాలీఫ్లవర్ కాడలు తీసేసి పువ్వును సన్నగా తరుక్కుని ఒక కప్పులో కొలిచి పెట్టుకోవాలి. జీడిపప్పును మెత్తగా నూరుకోవాలి. సెనగపిండితో తరిగిన పువ్వు, జీడిపప్పుపొడి, కోవా, కిస్మిస్, కొద్దిగా నీళ్లుపోసి బాగా కలపాలి. ఈ మిశ్రమం మరీ గట్టిగానో లేదా పలచగానో లేకుండా కలిపి ఒక వెడల్పాటి పళ్ళెంలో పోసి అరఅంగుళం మందంగా వుండేట్టు చదరాలు కోసి ఆవిర్లో(?) పెట్టుకోవాలి. పంచదార లేతపాకం తీసి దానికి ఎసెన్స్ కలపాలి. నూనె బాణలిలో వేసి కాగాక ఒక్కొక్క చదరాన్ని పూర్తిగా మినపపప్పు పిండిలో కవర్ చేసి నూనెలో వేయించాలి. బ్రౌన్ కలర్ వచ్చాక తీసి పంచదార పాకంలో వేసుకోవాలి.

—ఎన్. అరుణ, కలకత్తా

### జూజిప్స్

కావలసిన పదార్థాలు : 400 గ్రా॥ చక్కెర; 400 గ్రా॥ ముదిరిన బొప్పాయి; తగినంత

మీరు ఎన్నో వంటలు తిని వుంటారు; తయారు చేసి వుంటారు. అలా ఒకరి ద్వారా నేర్చుకున్నవీ, చూసినవీ కాకుండా మీ పాక పరిజ్ఞానంతో మీరు ఏదైనా కొత్త వంటకం కనిపెట్టగలరా? అది స్వీటయినా హాటయినా పర్వాలేదు. అది కొత్తరకంగా వుండాలి; రుచికరంగా వుండాలి; మామూలుగా లభించే దినుసులతో–చెయ్యడానికి బాగా వీలుగా వుండాలి. గమనిక: అది ఆరోగ్యానికి ఉపయోగపడే వంటకం కూడా కాగలిగితే (చౌకలో ప్రోటీన్ ఫుడ్ లాంటిది) పోటీలో అది ప్రత్యేకమైన అర్హతగా పరిగణింపబడుతుంది. 'అటువంటి వంటకాన్ని అందరూ మెచ్చుకుంటారు' అని మీకు అనిపించినప్పుడు, ఆ వంటకాన్ని ఎలా తయారుచెయ్యాలి? ఏమేం పదార్థాలు అందులో వెయ్యాలి? అన్ని వివరాలతో మాకు రాసి పంపండి. మీ వంటకం విలువైనదనీ, కొత్తదనీ బాగుంటుందని అనిపిస్తే ఆ వంటకానికి—

## నూరు రూపాయలు బహుమతి!!

ఇక్కడ ప్రచురిస్తున్న రెండో వంటకం—మా తమిళ పత్రిక "మంగై"లో బహుమతి పొందిన వంటకం. 'వంటల పోటీ'లో రూ. 100 ల బహుమతికి ఎన్నిక అయిన తర్వాత తక్కిన వంటకాల్లో ఒక దాన్ని ఎన్నుకుని దానికి రూ. 25 లు ప్రత్యేక బహుమతిగా ఇవ్వబడుతుంది. తక్కిన వంట కాల్లో బాగున్న వాటిని కూడా, మామూలు "వంటలు" పేజీలో ప్రచురిస్తాము. వాటికి ఒక్కొదానికి రూ. 10 లు పారితోషికంగా పంపుతాము.

ఈ వంటల పోటీని నిర్వహిస్తున్నవారు: ప్రఖ్యాతి చెందిన పాకశాస్త్రజ్ఞురాలు— శ్రీమతి సావిత్రీ వైది

జూన్ నెల పోటీకి వంటకాలు పంపవలసిన ఆఖరు తేదీ: ఏప్రిల్ 15

చిరునామా : వంటల పోటీ, వనిత—చందమామ బిల్డింగ్స్ మద్రాసు 600026

ఎసెన్స్; కలర్.

తయారు చేసే విధానం: బాగా ముదిరిన బొప్పాయిని తీసుకుని తొక్క తీసేసి కోరుకోవాలి. బొప్పాయికోరు 400 గ్రా॥ వుందంటె దానికి సమానంగా చక్కెర తీసుకోవాలి. కోరును రెండు గంటలసేపు నీళ్ళల్లో నానబెట్టిన తర్వాత తీసి పలుచటి గుడ్డలో వేసి నీళ్ళన్నీ పోయేట్టు పిండుకోవాలి. ఆ తర్వాత పొయ్యిమీద బాణలిపెట్టి బొప్పాయి కోరును అందులోవేసి నీళ్ళు బాగా ఇగిరిపోయే వరకు వాడ్చాలి. ఆపైన అందులో రెండు గ్లాసుల నీళ్ళుపోసి వేడి చేయాలి. బొప్పాయికోరు ఉడికిన తర్వాత చక్కెరవేసి కలియబెట్టాలి. గట్టిపడి లేహ్యంలా పక్వానికి వచ్చాక దించుకోవాలి. అవసరమైతే రెండు స్పూన్లు నెయ్యి చేర్చుకోవచ్చు. ఆ తర్వాత కలర్ వేసి వుండలుగా కట్టుకోవాలి. పైన చక్కెర అద్దినట్లయితే తినడానికి ఎంతో మధురంగా వుండే ఈ స్వీట్ ఇంపుగా చాలా అందంగా కూడా వుంటుంది.

—సుగంధి నాగరాజ్

వర్ణచిత్రాలు : సత్యకుమార్



# సంగతులూ

" మీరు మీ ప్రేమ చుట్టూ అసహజ
మైన కోరికలను పెంచుకుంటున్నారా?
మీరు ప్రేమిస్తున్న వ్యక్తి మీ జీవితాన్ని
ప్రభావితం చెయ్యాలనీ, మీకు సర్వస్వం
కావాలనీ ఆశిస్తున్నారా? అలా అయితే
మీరు మీ ప్రేమ నుండి చాలానే ఎదురు
చూస్తున్నారన్నమాట. అలాంటప్పుడు అను
భవం మీద ఎదురుదెబ్బలు తగిలినా తగల
వచ్చు జాగ్రత్త." అని హెచ్చరిస్తున్నారు
అమెరికా డల్లాస్ నగరంలోని మనస్తత్వ
నిపుణురాలు డాక్టర్ డెబొరా ఫిలిప్స్.

" మీరు ప్రేమ అనుకుంటున్నారు కానీ
అది ప్రేమకాదు. ఆధారపడడం! ఆధార
పడడానికీ, సన్నిహిత్వానికి ఎంతో తేడా
వుంది " అంటారామె. ఆమె ఇంకా ఇలా
అంటున్నారు:

" అసలు చాలా మటుకు పెళ్లిళ్లు
ప్రేమంటే ఏమిటో తెలిసి వుండాలనీ,
వధూవరులు ఒకరినుంచి ఒకరు ఏదో ఆశిం
చాలనీ ఒక తప్పుడు అభిప్రాయంతో
జరుగుతున్నాయి. మనలో చాలామంది
వివాహం చేసుకోవడంవల్ల మన అవసరా
లన్నీ తీర్చే వ్యక్తి లభించాడని ఆశపడతాం.
అందువల్ల వివాహమైన తర్వాత చాలా
మంది అలా అన్ని కోరికలూ భర్త తీర్చా
లని ఎదురు చూస్తారు. కాని అది నిజ
జీవితంలో సాధ్యం కాని విషయం. దాంతో
తాము తగినవాణ్ణి ఎన్నుకోలేదని అపోహ
పడతారు. కలహాలు ప్రారంభమవుతాయి.
అసలు అలా తీరాలనుకోవడమే ఒక మిథ్య.
ఆ విధమైన భ్రమలోపడి జీవించడం చాలా
ప్రమాదం. అందుకే ఏదీ ఆశించకుండా
ప్రేమించిన ప్రేమే స్వచ్ఛమైన ప్రేమ. కాని
అది సాధారణంగా పుస్తకాల్లో కనిపించే
ప్రేమ మాత్రమే.

ఇది ప్రేమ కాదు. మరొకరి మీద
ఆధారపడటం మాత్రమే. అలా కాకుండా
స్వచ్ఛమైన ప్రేమ కావాలి అనుకునేవారు
ముందు తమ కాళ్ళ మీద తాము నిలబడడం
నేర్చుకోవాలి " అంటారు డెబొరా ఫిలిప్స్.

విద్యార్థుల లేత హృదయాలలో
తరతమ భావాలు కలుగకుండా
చేయడానికి, వారిలో ఐకమత్యం
క్రమ శిక్షణ పెంపొందించే
ఉద్దేశంతో పాఠశాల విద్యార్థు
లకు యూనిఫారం దుస్తులు
ప్రవేశపెట్టారు. అయితే ఈ
యూనిఫారం విషయంలో పాఠ
శాల అధికారులు మరీ కటువుగా
ప్రవర్తించడం ఒక విద్యార్థిని
నిండు ప్రాణాలు తీసాయి.
బరోడాలో ఒక బాలికల పాఠ
శాలలో పదో తరగతి విద్యా
ర్థిని స్మిత. ఆ రోజు పరీక్ష.
పాఠాలు బట్టీ పట్టడంలో యూని
ఫారం సంగతి మరచిపోయి
మామూలుగా స్కూలుకు
వెళ్లింది. అయితే యూనిఫారం
వేసుకువస్తేనే పరీక్షకు అను
మతిస్తాము లేకుంటే లేదు అని
పాఠశాల అధికారులు ఆమెను
గేటు వద్దే ఆపేశారు. టైమయి
పోయిందన్న ఖంగారుతో ఇక
చేసేది లేక తన క్లాస్‌మేట్
సైకిల్ తీసుకుని తొందర
తొందరగా ఇంటికి బయలు
దేరింది యూనిఫారం వేసుకు
రావడానికి ఆ అమ్మాయి.
అయితే ఇంటికి చేరే లోపలే
దారిలో ఓ లారీ ఢీకొని బాగా
ఆమె గాయపడింది; తర్వాత
పాపం — ఆస్పత్రిలో చని
పోయింది!

ఏ కళ గాని పదికాలాలపాటు నిలవా
లన్నా, అభివృద్ధిచెందాలన్నా ప్రజల ఆదరాభి
మానాలు ఎంతైనా అవసరం. మనది ప్రజా
ప్రభుత్వం కాబట్టి కళలకు ఉత్సాహ ప్రోత్సా
హాలు అందించవలసిన బాధ్యత ప్రభుత్వానికి
వుంది. ఈ నిజాన్ని గుర్తించిన తమిళనాడు
ప్రభుత్వం తన ఆధ్వర్యంలో వుండే 'ఇయల్
ఇసై నాటక మన్రమ్'—తరఫున ప్రతియేటా
సంగీతం, సాహిత్యం లాంటి వివిధ కళా
రంగాలలోని కళాకారుల విశేషమైన కృషికి
గుర్తింపుగా "కలైమామణి" బిరుదుతో
సత్కరించే పథకాన్ని చేపట్టింది. ఇంత
వరకు దాదాపు ఏడువందలమందికి ఈ బిరుదు
ప్రదానం చెయ్యబడింది. ఈ సంవత్సరం
కూడా రిపబ్లిక్ దినోత్సవ సందర్భంగా
ముప్పైఏడుమందికి ఈ బిరుదు ఇవ్వడం
జరిగింది. అందులో ఎనిమిదిమంది వనితలు.
వారు శ్రీమతి కల్పకం స్వామినాథన్ (వీణ)
అలర్ మేల్‌వళ్ళి (భరతనాట్యం), ఎస్. కళా
వతి (రంగస్థల నటి), ఆర్. రమణి (రంగ
స్థల హాస్యనటి), జయచిత్ర (సినీనటి), ఎస్.
జానకి (సినీ నేపథ్యగాయని), ఎస్. ఆర్.
పార్వతి (సంగీత నాటక నటి), యు. ఆర్.
జీవరత్నం (రంగస్థల నటి)

# సమాచారాలు

ఢిల్లీ కస్తూరిబా ఆస్పత్రిలో ఆ మధ్య ఒక మగశిశువు పుట్టింది. పుట్టడమే నిర్జీవంగా పుట్టిందని డాక్టర్లు తేల్చి చెప్పారు. శిశువును శవాల గిడ్డంగికి తీసుకెళ్ళి శవానికి ఓ గుడ్డ చుట్టి తల్లిదండ్రు లకు అప్పగించారు కూడా. అప్పుడు ఆ శిశువు బామ్మ 'మన వడి ముఖం ఓసారి చూడాలి. ప్రాణం లేకపోయినా ఫరవా లేదు' అనిపట్టుపట్టిందట. శిశువు ముఖంమీది ముసుగుతొలగించ గానే కళ్లు తెరచి చూసిందట ఆ పాప! అంతే "మా బాబు ప్రాణాలతోనే వున్నాడు" అని కేకవేసిందా బామ్మ. ఆస్పత్రి ఉద్యోగులమీద పోలీసు కేసు పెట్టింది. "పుట్టినప్పు డేమో జీవంలేదు, ఆ తర్వాత ప్రాణం రావడం ఆశ్చర్యంగానే వుంది. గాడ్ ఈజ్ గ్రేట్" అని డాక్టర్లు తప్పును దేవుడి మీదికే నెట్టారు!

తండ్రికి నోబెల్ బహుమతిని సాధించి పెట్టిన అదే విజ్ఞాన శాస్త్ర పరిజ్ఞానం, ఆయన కూతురుని కళాశాల ప్రవేశ పరీక్షలలో నెగ్గనివ్వకుండా చేసింది. పాకిస్థాన్ కు చెందిన ప్రొఫెసర్ అబ్దుస్ సమద్ భౌతిక శాస్త్రంలో ఎన్నో పరిశోధనలు జరిపి కొత్త సిద్ధాంతాలు కనిపెట్టడంతో ఆయనకు 1979 సం॥లో నోబెల్ బహుమతి లభించింది. ఆయన కుమార్తె బస్రా లండన్‌లో చదువు కుంటోంది. ఆమె పాఠశాలలో చదువు కుంటున్నప్పుడే ఉపాధ్యాయినులు "మీ నాన్నగారి వింత సిద్ధాంతాలన్నింటినీ ఇంటి పట్టునే వదలిపెట్టు. వాటినిగాని పరీక్షలలో రాశావంటే అసలు నెగ్గలేవు" అని హెచ్చ రించారట. అయితే ఈ హితోపదేశాలన్ని టినీ పెడచెవిని పెట్టి ప్రశ్నలకు సమా ధానంగా ఆమె నాన్నగారి కొత్త థియరీలే రాసింది; ఫెయిలయింది. దాంతో భౌతిక శాస్త్రం మీద విరక్తి పెంచుకుని ప్రస్తుతం భాషా శాస్త్రం చదవడం ప్రారంభించింది బస్రా! లండన్‌లోనే ఇలా వుంటే ఇక మన దేశం కథ చెప్పాలా? ముత్తాత దగ్గర నేర్చుకున్న పాఠాలను తాత—మనవడికి నేర్పిస్తే దానిని తుచ తప్పకుండా బట్టీ పట్టి కాగితం పట్టాలతో వీధిన పడుతున్నాము. "తాడూ బొంగరం లేని నేటి విద్యావిధానమే దీనికి కారణం" — అంటున్నారు మన విద్యావేత్తలు!

ఉన్నత విద్యను వ్యాపింప చేస్తున్న విశ్వవిద్యాలయాలు కొన్ని ఇటీవల తమ సాయ శక్తులా విద్యార్థులకు షాక్ ట్రీట్‌మెంట్స్ ఇవ్వడం కూడా ప్రారంభించాయి. పూనా విశ్వ విద్యాలయంలో పరీక్ష రాసి ఉత్తీర్ణుడైన ఒక విద్యార్థి తన మార్కు-షీట్ చూసి దిగ్భ్రాంతి చెందాడు, అందులో పరీక్షకు అతను "ఆబ్సెంట్" అని వుంది! అదే విశ్వవిద్యా లయంలో మరో విద్యార్థిహిందీ పరీక్ష రాశాడు, అయితే మార్కులు మరొకరికి ఇవ్వ బడ్డాయి! బి. ఏ. చివరి సంవ త్సరం చదివే ఒక విద్యార్థిని— పరీక్షలు బాగా రాసినా మంచి మార్కులు రాకపోయేసరికి— విచారించి, విచారించగా ఆమె రాసిన సమాధాన పత్రాలలో ఒకటి లేనేలేదని తెలిసొచ్చింది!

పురుషులకు మాత్రమే పరిమితమైనవి 'ఫారెస్ట్ గార్డ్స్' అనబడే అటవికశాఖ రక్షకుల ఉద్యోగాలు. అటవిక సంపద అంటే కట్టెలు, మృగాలు మొదలైనవి దొంగిలింపబడకుండా కాపాడడం ఈ ఉద్యో గుల కర్తవ్యం. ఈ ఉద్యోగాలను తొలి సారిగా స్త్రీలకు కూడా కేటాయించిన ఘనత అరుణాచల ప్రదేశ్‌కు దక్కింది. ఇటీవల ఈ ఉద్యోగంలో ఐదుగురు వనితలు చేరారు, అందులో నలుగురు వివాహితులు.

**25 రూపాయలు**

బహుమతి పొందిన ప్రశ్న:

జరీనా, కడప

ఒక రచయి(త)త్రి తన రచనలో ఒక సమస్యను తీసుకుని రాసినప్పుడు ఆ సమస్యకు తనే పరిష్కారం సూచించడం మంచి రచన అవుతుందా? లేక ఆ పరిష్కారం ఏమిటన్నది పాఠకులచేతనే ఆలోచింపజేసేలా రాయడం మంచి రచన అవుతుందా?

పాఠకులచేత ఆలోచింపజేసేదే మంచి రచన. అలాంటి రచన చెయ్యడమే రచయిత బాధ్యత.

బి. విమలాదేవి, గుంతకల్లు

స్త్రీ స్థానం సమాజంలో నానాటికీ దిగజారిపోతున్నదంటే అందుకు కారణం – పత్రికల్లో ముఖపత్రం మొదలుకొని, చలనచిత్రాలలో అశ్లీల సన్నివేశాల వరకూ స్త్రీని అచ్చం వ్యాపార సరళిలోనే వాడుతున్నారన్నది నిర్వివాదాంశం. ఇటువంటి స్థితిని పోగొట్టాలంటే అది మీ రచయిత్రులవల్లనే జరగాలని నా నమ్మకం. మరి మీరేమంటారు?





# మీ రచయిత్రితో మీరు

అశ్లీలతను పాఠకుల, ప్రేక్షకుల బలహీనత వల్లనే 'కాష్' చేసుకోవడం జరుగుతున్నది. ఇది ఒక్క రచయితలవల్లనే జరిగేది కాదు. ఒక ఉద్యమం లేవదీయాలి. దానికి మీలాంటి వాళందరూ కూడా పూనుకోవాలి.

ఎమ్. నాగమణి, నరసన్నపేట

ఎన్నో సెక్స్ సినిమాలకి, చెత్త చిత్రాలకి 'ఎ' సర్టిఫికేటు ఇస్తూ వుంటారు కదా.... అలాగే నవలల్లో కూడా చెత్త, శృంగార పుస్తకాలు వస్తున్నప్పుడు వాటికి మాత్రం 'ఎ' సర్టిఫికేటు ఎందుకు ఇవ్వరు? పుస్తకాలకి కూడా సెన్సారుబోర్డు వుంటే బాగుంటుంది కదా?

సినిమా మాస్ మీడియం. చదువురానివాడు కూడా సినిమా చూడవచ్చును. అందువల్ల సినీమాలో అశ్లీలతో, సెక్సో ఎక్కువగా చూపెడితే సమాజం మీద దాని ప్రభావం ఎక్కువగా ఉంటుంది. ఈ దేశంలో చదువుకున్నవాళ్ళ సంఖ్యే తక్కువ. అందువల్ల పుస్తకాల ప్రభావం పరిమితగానే ఉంటుంది కనక బహుశా 'ఏ' సర్టిఫికెట్ గురించి ఆలోచించి ఉండదు ప్రభుత్వం. అదీకాక 'ఏ' సర్టిఫికెట్ ఇవ్వబడ్డ పుస్తకాలకు గిరాకీ పెరుగుతుంది.' ఎప్పుడూ పుస్తకాలు చదవనివాడు కూడా అందులో ఏముందోననే కుతూహలంతో చదువుతాడు. 'ఏ' సర్టిఫికెట్ ఇచ్చిన సినిమాల్లో ఎక్కువగా కన్పించేది టీన్ ఏజ్ బాయ్సే!

**టి. లీలావతి, ఖరగ్‌పూర్**

మీ దృష్టిలో ఉత్తమ రచయిత(త్రి) ఎవరు? యువత అభిరుచులకు అనుగుణంగా ప్రేమ, విరహ కథలు రాసేవారా లేక ప్రతిపదంలోనూ సాహిత్యాన్ని నింపి పాఠకులకు విజ్ఞానాన్ని అందజేయడానికి ప్రయత్నించేవారా?

ఉత్తమ రచనలు చేసేవారు. పాఠకుల్ని ఆలోచింపచేసేదే ఉత్తమ రచన. అంటే ఊహాలోకాల్లోకి పాఠకుల్ని ఎగరవెయ్యకుండా, నేలమీద నిలబెట్టి ఆలోచించేలా చేసేదే ఉత్తమ రచన.

**ఎన్. సుశీల, టెక్కలి**

మీరు ఇంతవరకూ ఎన్ని నవలలు రాసారు? అందులో మీకు నచ్చిన నవల ఏది? కారణం ఏమిటి?

ఇంకా చాలా రాయాలని నా ఉద్దేశం. అప్పుడే ఎన్ని రాశానో లెక్క వేసుకోవడం ఎందుకులెండి? ప్రతి నవలా నాకు నచ్చినదే నండీ. నచ్చని విషయం తీసుకొని నేను అసలు రాయను.

**కల్యాణి, నిజామాబాద్**

మీరు ఈ మధ్య రాస్తున్న నవలలు అన్నీ ఒకే పాయింట్ మీద ఆధారపడి వుంటున్నాయి. ఈ ధోరణి మాకు ఎంతో అసంతృప్తిని కల్గిస్తోంది. దీనికి మీ సమాధానం ఏమిటి?

ఈ మధ్య నేను రాసిన ఏఏ నవలలు చదివారు? ఆ నవలల పేర్లు ఏమిటి? ఆ నవలల్లో మీరు కనిపెట్టిన ఒకే పాయింట్ ఏమిటి? నేను మాత్రం ఒకే పాయింట్ తీసుకొని రాయలేదని ఖచ్చితంగా చెప్పగలను.

**వై. కుల్‌సమ్‌బీ, అనంతపురం**

పెళ్లి అనే పేరుతో 'భర్త' అనే ముద్ర వేసుకుని భార్యను రకరకాలుగా హింసిస్తున్నా కూడా అలాంటి స్త్రీ పురుషుల సంబంధాన్ని 'సక్రమమైనది'గానూ, పెళ్లి చేసుకోకుండా, కలిసి కాపురం చేస్తూ, అన్యోన్యంగా ఉండే స్త్రీ పురుషుల సంబంధాన్ని 'అక్రమమైనది'గానూ పిలవడం ఎంతవరకూ న్యాయమంటారు?

భర్తల్ని హింసించే భార్యలు మాత్రం లేరూ? ఈనాడు స్త్రీకి పదిమందిలో మూడు ముళ్లు వేస్తే కూడా భద్రత లేదు. ఇద్దరూ కలిసి బ్రతకడం తప్పుకాదు. కాని ప్రస్తుత వ్యవస్థలో అలా బ్రతికే స్త్రీకీ, ఆమె సంతానికీ లీగల్‌గా రైట్ ఉండదు.

**జానకి, బోధన్**

ఆనాటి నుంచి, ఈనాటి వరకూ మగాడికి ఇద్దరు భార్యలైనా సమర్థించే సంఘం, స్త్రీ ఇద్దరు మగాళ్లకి తనువిస్తే ఏనాటికైనా హర్షిస్తుందంటారా?

భారతం చదివారా? భారతాన్ని ఇప్పటికీ మహాకావ్యంగానే భావిస్తున్నాం!

**కుసుమ, ఖరగ్‌పూర్**

మీరు రాసిన 'సంయుక్త' నవల 'భరణి' మాస పత్రికలో ప్రచురింపబడింది కదా. మళ్లా అదే నవల కేవలం పాత్రలు, కథ పేరు మార్పుతో 'ఆనంద జ్యోతి' వార పత్రికలో 'ఇదీ కథ' అనే పేరుతో ప్రచురింపబడుతోంది. ఇలా ఎందుకు జరిగింది?

"సంయుక్త" నవల పూర్తిగా మీరు చదివారా? ఇంకా నేను రాస్తూనే ఉన్నాను. ఇప్పటికి రెండు వందల పేజీలదాకా రాశాను. "భరణి" రెండో సంచికతోనే ఆగిపోయింది అందులో దాదాపు పది

---



## పదేళ్ళ కవయిత్రి రాషన్

పాఠశాలల్లో చెప్పే పాఠాలతో కుస్తీపడుతూ, పాసైతే చాలనుకునే విద్యార్థులే ఎక్కువగా వున్న ఈ రోజుల్లో-చదువులో ఎక్కువ ప్రతిభ కనబరచిన వారిని మెచ్చుకుంటాము. చదువుతో పాటు లలిత కళల్లో కూడా ప్రావీణ్యం సంపాయించిన బాల బాలికలను చూసినప్పుడు ఇంకా ఎక్కువగా మెచ్చుకోవాలని అనిపిస్తుంది. పదేళ్ళ విద్యార్థిని రాషన్ అస్పాండియారోవా – కజక్ సోవియట్ రిపబ్లిక్ రాజధాని అయిన ఆల్మా - అటాలోని ఒక పాఠశాలలో చక్కగా చదువుకుంటూ, మరో ప్రక్క కవితలు రాయడం ప్రారంభించింది. ఆమె కవితలు ఉపాధ్యాయులనూ, పెద్దలనూ ఆకర్షించాయి. వాళ్లు ఆ బాలికను బాగా ప్రోత్సహించసాగారు. దాంతో ఆమెకు మరింత ఉత్సాహం ఏర్పడింది. తన కవితలకు తానే రేఖా చిత్రాలు రచించి, వాటిని ఒక పుస్తకంగా ప్రకటించి, అందరి మెప్పు సంపాయించింది!

రాషన్‌కు కవితలు అల్లడంలో ప్రేరణ ఏ విధంగా ఏర్పడింది?

ఆమె తల్లిదండ్రులకు, వాళ్ల సన్నిహితులకు కవిత్వం అంటే అభిమానం. వాళ్లు - హోమర్, పుష్కిన్, గోథే వంటి గొప్ప కవుల రచనలు చదువుతున్నప్పుడు రాషన్ ఉత్సాహంగా వింటూ వుండేది. ఆ అమ్మాయికి బొమ్మలు వేయడంలో కూడా ఆసక్తి వుంది. 'తనూ కవితలు రాసి, బొమ్మలు వేస్తే ఎలా వుంటుంది?' అనుకుని, అలా తన రచనా వ్యాసంగం ప్రారంభించింది. యువతరానికి ప్రాముఖ్యం యిచ్చే వార్తా పత్రిక 'ద్రుజ్బై రెబ్యాటా' రాషన్ కవితలను, రేఖా చిత్రాలను ప్రకటించింది. ఆ తర్వాత వర్ణచిత్రాలను రచించడంలో కూడా ఎక్కువ కృషి చేసింది. రాషన్ వర్ణచిత్రాలు ఎన్నో ప్రదర్శనల్లో ప్రముఖ స్థానాన్ని సంపాయించాయి. డిప్లొమాలను గెలుచుకున్నాయి!

రాషన్ ప్రచురించిన కవితల సంపుటి పేరు 'ది క్లాక్'. అందులో 21 కవితలున్నాయి. 'అమ్మా – నాన్న', 'ప్రకృతి' మొదలైన శీర్షికల పేరుతో, తనకు బాగా సన్నిహితంగా వున్న జీవితాన్నే - ఆమె తన కవితల్లో ప్రతిబింబించింది!

హేను పేజీలు మాత్రమే వెలువడింది. పూర్తి నవలను పాఠకులకు అందించే ఉద్దేశ్యంతో "ఇదీ కథ" అనే పేరుతో "ఆనందజ్యోతి" వారపత్రికలో ఇప్పుడు ప్రచురించబడుతోంది.

**ఎమ్. రామకుమారి, బెంగళూరు**

మీరు రాసిన 'మరో కర్ణుడి కథ'లో శరత్‌కు తన తల్లిని పిచ్చిదానిగానయినా ఒకసారి చూపించి వుంటే అతనికి కొంతైనా మనశ్శాంతి కలిగేదేమో?

తల్లిని పిచ్చిదాన్నిగా చూస్తే మనశ్శాంతి ఎలాగుంటుందండీ?

**వి. విజయలక్ష్మి, అలుదు**

ఏ జాతి సాహిత్యం నిర్వీర్యమౌతుందో ఆ జాతి పతనోన్ముఖమవుతుందని నా ఉద్దేశ్యం. మీ అభిప్రాయం ఏమిటి?

మీ అభిప్రాయంతో ఏకీభవిస్తాను. ఈ అభిప్రాయాన్ని చాలా పెద్దవారే ఏనాడో వెలిబుచ్చారు.

**కె. జి. సరళకుమారి, కుప్పం**

రచయిత్రికి, కవయిత్రికి గల భేదం ఏమిటి?

నీటికీ కెరటానికీ ఉన్న సంబంధం.

**జి. సరస్వతి, మద్రాసు**

ప్రతివారూ అచ్చులో తమ పేరు చూసుకోవాలనే తాపత్రయంతో ఏదో ఒక విధంగా చొప్పదంటు రచనలు చేసి, తామూ రచయిత్రులమై పోయామని భావిస్తున్న ఈ తరుణంలో ఒక రచయిత్రిగా 'రచయిత్రి' అనే మాటకి పరిపూర్ణమైన నిర్వచనం ఏమిటో చెప్పగలరా?

రాయనివ్వండి. చొప్పదంటు రచనలంటారా? తీరా రాశాక కాకపోయినా అచ్చు అయ్యాకనయినా వాళ్ళకే ఆ విషయం బోధపడుతుంది బోధపడకపోతే అది వాళ్ళ ఖర్మ! మనం ఏం చేస్తాం? సృజనాత్మక శక్తి రచనకు కావాలి. సృజనాత్మక శక్తితో రచించేవాళ్లే రచయితలు.

**ఎమ్. వసులక్ష్మి, శ్రీకాకుళం**

సతీసహగమనం, కన్యాశుల్కం, బాల్య వివాహం వంటి ఒకనాటి మూఢాచారాలను తమ కలం బలంతో రూపుమాపగలిగారు కందుకూరి, గురజాడ వంటి సంఘ సంస్కర్తలు. మరి ఈనాడు సంఘంలో స్వైర విహారం చేస్తున్న వరకట్నాన్ని ఏ సాహితీ ప్రక్రియ ఎందుకు మార్చలేకపోతోంది? ఇప్పటి సాహిత్యానికి సమాజాన్ని మార్చగలిగే సామర్థ్యం లేదా? లేక ఇప్పటి ప్రజలకి సాహిత్యమంటే కేవలం కాలక్షేపం, వినోదమయ్యిందా?

గురజాడ, కందుకూరి మొదలైనవారు సంఘసంస్కర్తలు. రచనల్ని వారు సంఘ సంస్కరణకు సాధనాలుగా ఉపయోగించుకున్నారు. అంటే ఆ మహానుభావులు తమ ఆశయసిద్ధికోసం కలాలను ఉపయోగించారు. నేటి రచయితలు సంఘ సంస్కర్తలు కాదు. కేవలం రచయితలే. అదీకాక వరకట్నం అనే దురాచారం ఆర్థికపరమైనది. దాన్ని రూపుమాపాలంటే ఈ వ్యవస్థ మారాలి. ఆర్థిక సమానత్వం రావాలి. కనీసం ఆడపిల్లకు మగవాడితో సమానంగా తండ్రి ఆస్తిలో భాగం ఇవ్వాలి. అంతేగాని కేవలం రచనలవల్ల ఈ దురాచారం రూపుమాపగలమనే నమ్మకం నాకు లేదు.

**టి. శారద, భువనేశ్వర్**

మీ 'నింగినుండి నేలకు' నవలలో కల్పనకు బుద్ధి చెప్పటానికి సిద్ధార్థ అంత నాటకం పొడిగించడం అసందర్భంగా వుంది. కల్పన చనిపోయి వుంటే సిద్ధార్థ ఏం చేసి ఉండేవాడు?

ఏమో! ఏమిచేసి ఉండునో? అది మీరు ఆలోచించండి.

**డాక్టర్ కె. రామలక్ష్మి, పలమనేరు.**

సందేశాత్మకమైన 'సమత', 'మట్టిమనిషి' 'బంధితుడు' మొదలైన రచనలు చేసిన మీరు కేవలం సగటు సినిమా ధోరణిలో 'ప్రతీకారం' నవల రచించడానికి కారణం ఏమిటి? సాహిత్యంలో ఏ మార్గమైనా అవలంబించగల ప్రతిభ వున్నదని నిరూపించడానికేనా?

నేను కూడా సినిమా నవలలను రాయగలను అని నిరూపించడానికే! అది ప్రచురించబడిన వారం రోజుల్లోనే ఒక ప్రొడ్యూసర్‌గారు మద్రాసు నుంచి బయలుదేరి సికిందరాబాద్ స్టేషన్‌లో దిగారు. వ్యామోహంతో రాసి ఉంటే ఆ ఒక్క నవలతోనే ఆగిపోతానా?

**కె. జి. హేమలత, కుప్పం**

'ఉత్తమ నవల'కు నిర్వచనం ఏమిటి?

సాంఘిక, రాజకీయ, ఆర్థిక పరిస్థితుల్ని విశ్లేషించి, పాఠకులను ఆలోచింపచేసేదే ఉత్తమ నవల.

**ఎ. జయలక్ష్మిరాజు, అనంతపురం**

ప్రస్తుతం వస్తున్న నవలల్లో ఏమాత్రం కొత్తదనం వుండడం లేదు. సంభాషణలు, సన్నివేశాల్లో కాస్త మార్పు తప్పితే అన్ని కథలూ ఒకేరకంగా వుంటున్నాయి. దీనికికారణం రచయిత్రుల మనస్తత్వాలు ఒకే రకంగా వుండటమా? నవలకు తగ్గ ప్లాట్లు నిజ జీవితాల్లో లేకపోవడమా?

సమకాలీన రచయితలకు, సమకాలీన ఆలోచనలు రావచ్చును. అందుకే పోలికలు కన్పించవచ్చును. కాని సమస్యలు మాత్రం విడివిడిగానే ఉంటాయి. రచనా పద్ధతుల్లోనూ భిన్నత్వం కన్పిస్తుంది. మీకు చూసే కళ్ళూ అర్థం చేసుకొనే మనసూ ఉంటే, బోలెడంత నవ్యత.

**సి. ప్రమీల, శ్రీరామసాగర్‌ప్రాజెక్టు**

సీరియల్ నవలలు చాలావరకూ మొదలుపెట్టినపుడు అనవసర వర్ణనలు ఎక్కువగా రాసి అతి నెమ్మదిగా కథ నడిపిస్తారు. తీరా చివరిదశకు వచ్చేసరికి ఇక ఓపిక లేనట్లుగా ముగించి వూరుకుంటారు. దీనివల్ల మాకు సీరియల్స్ మీద ఉత్సాహం తగ్గిపోతోంది. ఇలా ఎందుకు జరుగుతోందంటారు?

మీకూ ఇంకా ఇంకా చదవాలనిపించడం వల్లనే సీరియల్ పూర్తి అయితే, త్వరత్వరగా ముగించినట్టు అనిపిస్తుందేమో!

**కె. ఈశ్వరి, గొంది**

'నింగినుండి నేలకు' రచనలో కల్పన, రవీంద్రల పాత్రలు అత్యంత అసహజంగా వున్నాయి. వాస్తవ

దృక్పథంతో రచనలుచేసే మీరు ఈ పాత్రలను ఎట్లా సృష్టించారు? ఇక 'సావేరి' నవలలో దత్తు, రజియాల మన స్తత్వమేమిటి? సావేరిలో మీరు చెప్పాలనుకున్నది స్పష్టం చెయ్యలేదని నా అనుమానం. ఒకపక్క రేఖకు దత్తు అన్యాయం చేస్తున్నా దత్తు పైవే సానుభూతి కలిగేలా చేశారు. దత్తు, రజియా, రేఖల పాత్రలు ఏ దృక్పథంతో సృష్టించారో వివరణ కోరుతున్నాను. అలాగే కల్పన పాత్ర కూడా!

సూటిగా ఏదో ఒక విషయం మీద ప్రశ్న వెయ్యడానికి ప్రయత్నించండి. రామాయణ మంతా విని రాముడికి సీత ఏమౌతుంది అని అడిగినట్టు ఉన్నది మీ ప్రశ్న. "నింగి నుండి నేలకు" నవల చదివాక ఏ ఆశ యంతో రాశానో అర్థంకాని మీకు నేను చెబితే మాత్రం అర్థం అవుతుందా? దత్తు మీద సానుభూతి కలుగుతుందని మీరే రాశారుగా — ఇంకా మళ్ళీ ఏ ఉద్దేశ్యంతో రాశారని అడుగుతారేం? "అలాగే కల్పన పాత్ర కూడా" అన్నారు. అంటే కల్పన పాత్ర మీద కూడా మీకు సానుభూతి కలిగిందనేనా?

ఆర్. ఇందిర, కోరగుంటపల్లి

మీ నవల 'నింగినుండి నేలకు'లో కల్పన పాత్రను కేవలం మీరు కల్పించినదేనా లేక అలాంటి వ్యక్తి మీకు ఎక్కడైనా తారసపడిందా? ఆ పాత్ర చాలా అసహజంగా వుంది—అందుకని. రచయిత్రిగా మీరు సాధించినదేమిటి? పొందిన సంతృప్తి ఏపాటిది?

కల్పన + కల్పన = కల్పన. సాధించాలనే కృషి ఇంకా చేస్తూనే ఉన్నాను. తృప్తిని కొలిచే సాధనాన్ని సైంటిస్టులు ఇంకా కని పెట్టలేదు.

బి. సుమలత, మద్రాసు

ఈ మధ్య కొన్ని పత్రికలలో రచయిత్రుల సీరియల్స్ ప్రచురిస్తూ 'ఆంధ్రుల ఆరాధ్య రచయిత్రి' అనో 'నవలారాణి' అనో మకుటాలు తగిలిస్తూ వ్యాపార ప్రకటనల్లో వస్తువులు అమ్మడానికి చేసే ప్రచారంలా చేసి మరీ ప్రచురిస్తున్నారు. దీనిపై మీ అభిప్రాయం ఏమిటి?

అయ్యబాబోయ్! అందరికీ తెలిసేలా చెప్పమంటారేం? అది ట్రేడ్ సీక్రెట్. అంటే వ్యాపార రహస్యం.

ఎ. ఆర్. సీత, నగరి

మీ వ్యక్తిగత విషయం అడుగుతున్నానని మరోలా భావించకూడదు. నా అభిమాన రచయిత్రిగా మీ గురించి నాకు కొంత తెలుసుకోవాలని వుంది. వివాహ వ్యవస్థపై మీ అభిప్రాయానికీ, మీరు అవివాహితగానే వుండడానికీ ఏదైనా సంబంధం వుందా? దయచేసి తెలియజేయగలరు.

ఎలాంటి సంబంధం లేదు. మొదటిది సమాజానికి సంబంధించినది. రెండోది వ్యక్తిగతమైనది.

ఎస్. ఎస్. లక్ష్మి, రాజమండ్రి

మీ రచనలు సినిమాలుగా తీశారు కదా. మీరు ఒక నవలగానీ, కథగానీ రాసినప్పుడు ఏదో ఒక దృక్పథంతో రాస్తారు. దాన్నే సినిమాగా తీసినప్పుడు అందులో మీరనుకున్నట్టు కాకుండా మార్పులు చేసి తీస్తే మీరెలా ఫీలవుతారు?

సంవత్సరం అంతా ఉండాలనే ఉద్దేశ్యంతో మీరు ఆవకాయ పెడతారు. అది మధ్యలోనే బూజు పట్టిపోతే మీకు ఎలా ఉంటుంది? అంతే! □

## జన్మ రహస్యం!

మధ్యప్రదేశ్‌కు చెందిన పధ్నాలుగేళ్ల గులాబీబాయ్ ఈ మధ్య ఒక అనూహ్యమైన చిక్కు నుండి విడివడింది. ఇద్దరు దంపతులు ఆ పిల్లని 'నువ్వు మా కూతురంటే.... మా కూతుర'ని చెరో రెక్కా పుచ్చుకుని పోట్లాడి, పోలీసులకి ఫిర్యాదు చేసేదాకా వెళ్ళారు.

కాలూరామ్, రేషమ్‌బాయ్ అనే దంపతులు గులాబీబాయ్ తమ కుమార్తె అని వాదించారు. అంతవరకూ గులాబీబాయ్ గిర్వార్, షేతన్‌బాయ్‌ల పెంపకంలో వుంది. వారే తన నిజమైన తల్లిదండ్రులని భావిస్తోంది. కాలూరామ్ దంపతులు తమ కుమార్తె సుశీల 1970లో తప్పిపోయిందనీ 1978లో గిర్వార్ ఇంట్లో గులాబీబాయ్ పేరుతో కనిపించిందనీ పోలీసులతో చెప్పారు. మధ్యప్రదేశ్‌లోని బిల్కిస్‌గంజ్ గ్రామ నివాసి అయిన గిర్వార్ ఆమె తన కుమార్తే అని అన్నాడు. కాని విచిత్రమేమంటే అతను కూడా అందుకు తగిన సాక్ష్యాధార పత్రాలేవీ చూపలేకపోయాడు!

పోలీసులకి ఏం చెయ్యాలో తోచక సివిల్ సర్జన్‌కి కాస్తా ఆ కేసు వప్పగించారు. రక్త పరిశోధనలో ఆ అమ్మాయి ఆ ఇద్దరు దంపతులలో ఎవరికైనా జన్మించి వుండవచ్చునని తేలింది. దాంతో ఈ కేసు కాస్తా భోపాల్‌లోని మెడికో–లీగల్ ఇన్‌స్టిట్యూట్‌కి పంపారు. అప్పటికే ఈ గొడవ రాజుకుని బిల్కిస్‌గంజ్ గ్రామమంతా వ్యాపించింది. ఈ తతంగం విపరీత పరిణామాలకి దారి తీయకముందే పరిష్కరించాలన్న ఉద్దేశ్యంతో ఇన్‌స్టిట్యూట్ డైరక్టర్ డాక్టర్ హరీష్ చంద్ర ఆ ఇద్దరు తల్లిదండ్రుల రక్తపు గ్రూపులని, గులాబిబాయి గ్రూపుని క్షుణ్ణంగా పరిశీలించారు. అంతేకాదు వారి కుటుంబ చరిత్ర, శిశు జననం, శరీరావయవాల పోలికలు, అలవాట్లు – ఇవన్నీ కూడా పోల్చి చూశారు. కాని అప్పటికీ ఒక నిర్ణయానికి రాలేకపోయారు.

ఈ వివాదం ఒక్క హెచ్. ఎల్. ఎ. (హ్యూమన్ ల్యూకోసైట్ ఏంటిజెన్) విధానం ద్వారానే పరిశీలించడం సాధ్యమవుతుందన్న ఉద్దేశ్యంతో ఆయన ఢిల్లీలోని ఆల్ ఇండియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్‌కి వప్పగించారు. హెచ్. ఎల్. ఎ. టెక్నాలజీలోని సెల్యూలర్ ఇమ్యూనాలజీ విధానం ద్వారా టిష్యూల మార్పిడికి తగిన వీలును గ్రహించవచ్చును. ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన డాక్టర్ ఎమ్. సి. వైద్య ఇద్దరు 'తల్లిదండ్రుల' రక్తాన్ని, గులాబీబాయ్ రక్తాన్ని ఈ విధానం ద్వారా పరిశీలించి చివరకు ఒక నిర్ణయానికి వచ్చారు. గులాబిబాయ్, కాలూరామ్, రేషమ్‌బాయ్‌ల కుమార్తె కాదనీ, ఆమె అసలైన తల్లిదండ్రులు షేతన్‌బాయ్, గిర్వార్‌లేననీ ఆయన తన పరిశోధనల ద్వారా వెల్లడించారు. ఈ హెచ్. ఎల్. ఎ. విధానం ద్వారా అసలు తల్లిదండ్రులు ఎవరో తెలుసుకోవడం నూటికి నూరు పాళ్లు సాధ్యమవుతుందని ఆయన అన్నారు. ఆసియాలోకల్లా ఈ విధమైన పరీక్ష జరపడం ఇదే ప్రథమం కావడం విశేషం!

# శీతల పానీయాలు

ప్రతి రోజూ ప్రతి మనిషీ ఇంచుమించుగా రెండు న్నర లీటర్ల నీటిని కోల్పోతూ ఉన్నారు. ఈ నష్టాన్ని భర్తీ చేసేందుకూ, జిహ్వాచాపల్యాన్ని తీర్చేందుకూ ఒక్క నీటినేగాక ఎన్నో రకాల పానీయాలను మనుషులు నిత్యమూ వాడుతున్నారు. చాలా పురాతన కాలం నుండే మానవులు స్వాభావిక ఖనిజ లవణాలున్న పానీయాలను వాడుతూ ఉన్నారు. ఈ పానీయాలు–తిన్న ఆహార పదార్థాలను సులభంగా జీర్ణం చేస్తాయి. ఇలా ఆరోగ్యాన్ని కలిగించే పానీయాలు అవసరమనుకున్న మానవుడు కృత్రిమ పానీయాల ఉత్పత్తి నారంభించాడు. జోసఫ్ ప్రీస్ట్లీ అనే ఆయన 1767లో నీళ్ళల్లో 'గ్యాస్'ను జొప్పించే విధానం కనుక్కున్నాడు. ఆ తర్వాత కార్బొనేట్ చేయబడిన పానీయాల ఉత్పత్తి ప్రారంభింపబడింది.

పానీయాలు ఆహ్లాదకరమైన రుచినీ, ఆకర్షించదగిన పరిమళాన్నీ, రంగునూ కలిగి ఉండడమే గాక, దప్పికను తీర్చి, తీసుకున్న తర్వాత 'మళ్ళీ తీసుకుంటే బావుండు' ననిపించే గుణం కలిగి ఉంటే, అవి అందరి మన్ననలనూ పొందగలుగుతాయి.

ఇలా అందరినీ ఆకర్షించేందుకు పోటీపడుతున్న ఈ పానీయాలనన్నింటినీ స్వాభావికమైనవీ, కృత్రిమమైనవీ అని రెండు రకాలుగా వర్గీకరించవచ్చు. స్వాభావికమైన పానీయాల్లో స్వచ్ఛమైన నీరు కలపని పళ్ళరసాలూ, నిలువ ఉంచి, అవసరమైనప్పుడు నీళ్ల కలుపుకుని త్రాగే పళ్ళరసాల పానీయాలూ, స్క్వాష్‌లూ, మొదలైనవన్నీ చేరుతాయి. వేడి చేసో, చల్లబరిచో తయారు చేయబడే పళ్ళరసాల 'కాన్‌సెన్‌ట్రేట్'లు కూడా స్వాభావికమైనవిగానే భావించబడతాయి.

పళ్ళరసాల పానీయాలు వ్యాపారరీత్యా భారతదేశంలో 1930 నుండి ఉత్పత్తి చేయబడుతున్నాయి. 'నిమ్మరసం' లాంటి పానీయాలు ఇళ్ళల్లో వాడడం పురాతన కాలం నుండీ ఉంది. భారతదేశంలో ముఖ్యంగా నిమ్మ, దానిమ్మ, టొమేటో, నారింజ, ఆపిల్, జామ, మల్బరీ, మామిడి, పనస పళ్ళరసాలు బాగా వాడబడుతున్నాయి. ఇవి చాలావరకూ ఆయా కాలల్లోనే లభ్యమౌతాయి గనుక, సంవత్సరం పొడుగునా అన్ని రకాలనూ చవి చూడగలిగేందుకు వీలుగా అవి నిలువ చేయబడాలి.

అన్ని పళ్ళరసాల్లోనూ 'ఫ్రక్టోస్', 'గ్లూకోజ్' 'సుక్రోస్'లలో ఏదో ఒకటి కలవబడి తీపి రుచినిస్తున్నాయి. నిలువఉండే పళ్లరసాల్లో ఈతీపి పదార్థాలే గాక మాలిక్, సిట్రిక్, టర్టారిక్ లాంటి 'ఆర్గనిక్ ఆసిడ్స్' కూడా చోటు చేసుకుంటున్నాయి. మంచి పరిమళమూ, ఆహ్లాదాన్నిచ్చే రుచీ కొన్నిరకాల స్వాభావిక రసాయనిక పదార్థాల ద్వారా చేకూరుతున్నాయి. టొమేటోల్లోని 'లైకోపెన్' అనే రంగు పదార్థమూ, అలాగే నారింజలోని కెరోటీన్ లాంటివి ఆయా పానీయాలకు రంగులను తెస్తున్నాయి. 'టానిన్' వల్ల ఆపిల్ రసంలో లేత గోధుమ రంగు వస్తుంది.

అన్ని పళ్ళరసాలూ పోషక విలువలు గలిగినట్టివే. పంచదారవల్ల ఇంధనశక్తినీ పంచదార లేని విటమినులను పళ్ళరసంలోనూ పొందవచ్చు. రుచికరమైన ఈ పానీయాలు దప్పికను తీర్చి ఆహ్లాదాన్ని కలిగించడమే గాక, బలాన్నీ ఉత్సాహాన్ని కూడా పెంపొందించ గలుగుతాయి. మామూలుగా ఈ పళ్ళరసాల్లో 0.4 నుండి 8 శాతం వరకూ ఆసిడ్స్ ఉంటాయి. ఒక శాతం వరకూ ప్రొటీన్లుంటాయి. 2 నుండి 10 శాతం వరకూ పంచదార, ఒక శాతం వరకూ క్రొవ్వు పదార్థాలూ ఉంటాయి. ప్రతి వంద గ్రాముల పానీయంలోనూ ఇంచుమించుగా 2.5 మి.గ్రా 'సి' విటమినూ, 0.03 మి.గ్రా ఫోలిక్ ఆసిడ్, 0.02 మి. గ్రా. రిబోఫ్లావిన్, 0.7 మి. గ్రా. వరకూ థయామిన్, 230 మి. గ్రా. వరకూ పొటాసియం, 12 మి. గ్రా. వరకూ మెగ్నీషియం, 2 మి. గ్రా. వరకూ సోడియం, 16 మి. గ్రా. వరకూ సున్నం, 16 మి. గ్రా. వరకూ ఫాస్పరస్, 9 మి. గ్రా. వరకూ ఇనుమూ ఉంటాయి. పోషక విలువలరీత్యా టొమేటో రసం మిగతా అన్నింటికన్నా ఉత్తమమైనది.

బజారులో ఎంతో ఎక్కువ ధరకు అమ్మబడే ఈ పానీయాలను, ఇంట్లో మనం చాలా తక్కువ ఖర్చుతో తయారు చేసుకుని నిలువ ఉంచుకోవచ్చు. ఈ మధ్య ఇలా నిలువ ఉంచుకునే పద్ధతులు తరచుగా రేడియో ద్వారానూ, పల పత్రికల ద్వారానూ వెలువడడం వలన ఇళ్ళల్లోనే ఎక్కువమంది తయారు చేసుకునే ప్రయత్నాలు చేస్తున్నారు. వ్యాపారం కోసం తయారు చేసే వాళ్ళు గ్యాస్ ద్వారానూ, వేడి చేయడం ద్వారానూ, చల్లబరచడం ద్వారానూ, సోడియం బెంజోట్ లాంటి పదార్థాలను కలపడం ద్వారానూ పలు రీతుల్లో ఉత్పత్తి చేస్తున్నారీ పానీయాలను.

ఈ పళ్ళరసాలు 'సోడియం' తీసుకునేందుకు నిషేధింపబడిన వారికి చాలా ఉపయోగకరాలు. 'పెప్టిక్ అల్సర్' రోగులకు ఇవి ఔషధాలవలె పని చేస్తాయి. బరువు తగ్గించుకునే ప్రయత్నాల్లో ఉన్నవాళ్లకు శక్తివర్థకాలు. మలబద్ధకం లేకుండా చూసే ఈ పానీయాల్లో విటమిన్ 'సి' సమృద్ధిగా లభిస్తుంది గనుక 'స్కర్వీ' వ్యాధి రాదు. 'డిసెంట్రీ'లాంటి విరేచనాలను వీటిల్లో ఉండే 'పెక్టిన్' అరికడుతుంది. ఈ పానీయాలవల్ల తల నొప్పీ, కడుపు నొప్పీ, కాళ్ళ నొప్పులు లాంటివి వస్తున్నాయుట. కాని ఇవి భారతీయుల్లో మాత్రం కనిపించడం లేదని చెబుతారు.

పెద్ద పెద్ద పట్టణాల్లో కృత్రిమ పానీయాల వాడకం ఈ రోజుల్లో ఎక్కువగా ఉంది. స్వాభావిక పానీయాలతో పోల్చి చూస్తే వీటిల్లో పోషక విలువలు చాలా తక్కువ. పండ్ల ఎసెన్సులతో, మూలికలతో తియ్యదనాన్ని జోడించిన ఎన్నో పానీయాలు బజారులో అమ్ముడవుతున్నాయి. కోలా లాంటి పానీయాలకు గిరాకీ ఎక్కువగా ఉంది. కోలా తర్వాత నారింజ, నిమ్మ, ద్రాక్ష రుచుల పానీయాలు చోటు చేసుకుంటున్నాయి.

ఇవన్నీ వాటికి కల్పించబడిన పరిమళం వల్లా, రుచివల్లా బాగా ఆకర్షింపబడుతున్నాయి. తయారు చేయబడే పద్ధతుల దోషాలవల్ల ఎన్నో అనారోగ్యాలు ఏర్పడే ప్రమాదమున్నది. వీటిల్లో కలుపబడే రంగులవల్ల 'క్యాన్సర్' లాంటి ప్రమాదకరమైన వ్యాధులు వచ్చే అవకాశాలు కూడా వున్నాయి. ఆరోగ్యశాఖ అనుమతించని రంగులు ఎన్నో ఈ పానీయాల్లోనూ, బజారులో అమ్మబడే పలు శీతల పానీయాల్లోనూ చోటు చేసుకుని ఎంతో అనారోగ్యాన్ని ప్రజలకు తెచ్చిపెడుతున్నాయి.

సిట్రిక్ ఆసిడ్‌ను గానీ, పంచదారను గానీ, పొటాసియం మెటాబై సల్ఫేట్‌ను గానీ గ్యాసును ఎక్కించిగానీ సాధారణంగా పానీయాలు నిలువ చేయబడుతూ ఉంటాయి. ఈ పని సరిగ్గా జరక్కపోతే పానీయాల గుణమూ చెడి, విలువా తగ్గి సూక్ష్మజీవులు పెంపొంది ఆరోగ్యాన్ని దెబ్బ తీస్తాయి.

ప్రభుత్వం 'ఫ్రూట్స్ ప్రాడక్ట్స్ ఆర్డర్' ద్వారానూ, ఆహార కల్తీ నిరోధకచట్టం ద్వారానూ ఆరోగ్యకరమైన ఉత్పత్తులనే అనుమతిస్తున్నది. నిలువచేసేందు కుపయోగించే పదార్థాలుగానీ, రంగులుగానీ 'ఫ్రూట్ ప్రాడక్ట్స్ ఆర్డర్' ననుసరించే చేర్చబడాలి. తయారుచేసి అమ్మేవాళ్ళంతా భారత ప్రభుత్వ అగ్రి కల్చరల్ మార్కెటింగ్ అడ్వైజర్ నుండి ముందుగా లైసెన్సు పొందాలి. ప్రతీ పానీయం పైనా దానిలో చేర్చబడ్డ పదార్థాల పేర్లూ, వాటి పరిమాణాలూ తెలుపుతూ 'లేబిల్' అంటించాలనీ, తయారుచేసిన వారి పేరూ, చిరునామా కూడా ఉండాలనీ భారత ఆరోగ్య మంత్రిత్వశాఖలోని 'కేంద్ర ఆహార ప్రమాణాల కమిటీ' నిర్దేశించింది. ఈ కమిటీ 'ఆహార కల్తీ నిరోధక చట్టం' నిర్దేశించిన ప్రమాణాలు పానీయాల్లో ఉండేలా చూసేందుకు ఏర్పాటు చేయబడింది. కనుక పానీయాలను తీసుకునేటప్పుడు పై వివరాలు ఆ పానీయాల సీసా పైన ఉన్నాయో, లేవో గమనించటం మంచిది.

ఏమైనా స్వాభావిక పానీయం కానీయండి, కృత్రిమ పానీయం కానీయండి ఇంట్లోనే తయారు చేసుకోవడం సర్వోత్తమమైన పద్ధతి. ఇలా చేయడం వల్ల ఆరోగ్యకరమైన, మంచి ప్రమాణం గల పానీయాన్ని చౌకలో పొందవచ్చు. ఇంట్లోనే తయారు చేసుకున్నామనే సంతృప్తి కలుగుతుంది.

—జయ

# ధర నింగిని అంటగలదు!

**ఈ** ప్రపంచంలో స్థిరంలేనివి ఏవి? అని ప్రశ్న వేస్తే సమాధానం ఏం వాస్తోందో తెలుసా?....

వస్తువుల ధరలు!

అందులోనూ నిత్యావసర వస్తువుల ధరలు!

అదుపులో పెడుతున్నామని, ప్రభుత్వం ప్రకటిస్తున్నాసరే, ప్రజలు ప్రతిఘటిస్తున్నా సరే, ఈ ధరలు రోజు రోజుకీ పెరిగిపోతూనే వున్నాయి. నిన్నటి ధర ఇవాళ వుండదు; ఇవాళ వున్న ధర రేపు వుండదు. ఈ ధరలు ఎందుకిలా వామనుడి రూపంలా పెరిగిపోతున్నాయో కారణం చెప్పేవాళ్ళు ఎవరూ లేరు! పైగా తెల్లారిచేప్పటికల్లా షాపు తెరిచేసరికి వస్తువుల ధరలు దాటంతటవే పెరిగిపోయినట్టుగా షాపువాళ్ళు మాట్లాడతారు. ఇంకో విశేషం ఏమిటంటే ఒకసారి ఒక వస్తువు ధర పెరిగిందనుకోండి – అది మళ్ళీ కిందికి రాదు – అలా అలా పైకి పోవలసిందే! రేడియోలు, టి. వి. లూ, ఎలక్ట్రిక్ సాధనాలూ, ఫర్నిచరూ, బట్టలూ మొదలుకుని, పెన్సిలు, రబ్బరూ వరకూ ధరలు పెరుగుతూనే వున్నాయి. బియ్యం, పంచదార, పప్పులూ, ఉప్పులూ, కూరగాయలూ వీటి మాట సరేసరి!

వీటి ధరలు తగ్గుతాయనీ, జీతాలు పెరుగుతాయనీ వెర్రి ఆశతో అందరం ఎదురుచూస్తూ కూచోవలసిందేగాని, ధరలు తగ్గే రోజులు వస్తాయన్న నమ్మకం లేదు!

మా అమ్మగారు చెబుతూ వుంటారు – మా పెద్దన్నయ్య పెళ్ళి 1934 ప్రాంతాల జరిగినప్పుడు, పెళ్ళిలోకి కావాలని పెద్ద బస్తాడు ఉల్లిపాయలు కొన్నారుట – ఆ బస్తా వెల అప్పుడు రూపాయన్నరట! ఇప్పుడు కిలో ఆ ధరలో లేదు! పైగా ఈ మధ్య కిలో ఆరు, ఏడు రూపాయలు కూడా అమ్మింది! నేటి ధరలు, వీటి వ్యవహారాలు చూస్తున్నవాళ్ళం, అప్పటిధర వింటే ముక్కు మీద వేలేసుకుని "ఎంత చవకో" అని అరగంటసేపు ఆశ్చర్యపోతాం.

ఈ ధరలు ఇలాగే పైపైకి పోతూ వుంటే, నా తర్వాతి తరంవాళ్ళు ఎలా జీవితాలు గడుపుతారు? ఎలా జీవిస్తారు? అని కంగారు పుడుతోంది. మా అబ్బాయికి ఇప్పుడు పదేళ్ళు. వాడు పెద్దవాడై, పెళ్ళి చేసుకుని, పిల్లల్ని కని, వాళ్ళకు పెళ్ళిళ్ళు చేసే వేళకి ఈ ధరవరలు ఎంత ఉచ్చదశకు అంటుకుంటాయో!

అందుకే నాకు అనిపిస్తూ వుంటుంది. ఇప్పుడు మా అమ్మగారి పాత విషయాలు విని మనం ఎంత ఆశ్చర్యపోతున్నామో — ఇప్పటి విషయాలు విని, రానున్న తరం వాళ్ళూ అలాగే ఆశ్చర్యపోతారు. మా అబ్బాయి వాడి కొడుకులతో ఇలా ముచ్చటిస్తాడు – "ఒరే, ఇప్పుడు ధరలు ఇలా మండిపోతున్నాయిగాని, నా చిన్నతనంలో ఉల్లిపాయల ధర ఎంతో తెలుసా? కిలో ఆరు రూపాయలు.... ఒక్కోసారి ఐదు రూపాయలకి కూడా ఇచ్చేవాళ్ళు!"

"అబ్బ! అంత చవకా!" అంటారు ఆ పిల్లలు, 'అయ్యో ఆ రోజుల్లోనైనా పుట్టాం కాదే' అని విచారిస్తూ.

"ఇప్పుడు బియ్యం కిలో ఇరవై రూపాయలు అమ్ముతోందా – అప్పుడెంత? మంచి బియ్యం—మూడు రూపాయలు!"

"అబ్బ! ఎంత చవకో!"

"అంతెందుకురా!.... ఈ తోటకూర కట్టుందా, ఇది అప్పుడు అర్ధరూపాయి! తప్పితే నలభై పైసలు!"

"అబ్బ! అంత చవకా!"

మరి, ఆ పిల్లలు తాతలు అయి, వాళ్ళ మనమలకి వీళ్ళ తరంనాటి ధరలు చెబుతూ వుంటే, వాళ్ళేమంటారో తెలుసా? అదే మాట అంటారు – "అబ్బ! ఎంత చవక రోజులో!"

—ఆర్. రేవతి

# ఏప్రిల్ ఫూల్.... ఏప్రిల్ ఫూల్!

సూటు బూటు వేసుకుని దర్జాగా నడుస్తున్నా డొకాయన. ఆ వీధిలో జనసందడి అంతగా లేదు. గోడ మీది పోస్టర్లు చూస్తూ నడుస్తున్నా డాయన. ఆ గోడ మధ్యలో విరిగివుంది. ఇంతలో అతని దృష్టి పేవ్‌మెంట్ మీద పడివున్న వ్యానిటీ బ్యాగ్ పై బడింది. ఎదురుగా ఎవరూ రావడం లేదు. చుట్టూ చూశాడు. దరిదాపుల్లో ఎవరూ కని పించలేదు. ఎంతటి సూటు బూటు వ్యక్తయినా ఆశ అనేది వుంటుంది కదా! అమాంతం ఆ బ్యాగ్‌ని అందుకునేందుకు క్రిందకి వంగాడు.

అంతే....

మరుక్షణం ఎవరో లాగినట్లుగా ఆ బ్యాగ్ విరిగిన గోడ చాటుకు వెళ్లింది. ఆ వ్యక్తి తెల్లబోయి చూశాడు. ఇంతలో "ఏప్రిల్‌ఫూల్....ఏప్రిల్‌ఫూల్", అంటూ ఒక కుర్రాడు గోడ చాటునుంచి అరుస్తూ బయటికి వచ్చాడు. ఆ కుర్రాడి వెనక మరో నలుగురైదుగురు పిల్లలు వంత పాడుతూ వచ్చారు. బ్యాగ్ అందుకోవాలన్న ఆత్రుతలో ఆ సూటువాలా కాస్తా దానికి కట్టిన సన్నటి దారాన్ని గమనించలేదు. ఆ కుర్రాడి అరుపు తర్వాత అర్థమైందతనికి ఆ రోజు ఏప్రిల్ ఫస్టని. తనవైపు వెక్కిరిస్తూ అరుస్తున్న ఆ పిల్లల్ని ఏం చెయ్యాలో తోచక ఓ వెధవ నవ్వు నవ్వి ముందుకు చక్కాపోయాడా 'పెద్దమనిషి'!

ఏప్రిల్ ఫస్ట్ రాగానే పిల్లలకీ, కొందరు పెద్దవాళ్లకీ కూడా ఎవరో ఒకర్ని 'ఫూల్'ని చేసి ఏడిపించాలనే సరదా వుంటుంది. అలా వాళ్లు మోసపోయిన తర్వాత 'ఏప్రిల్‌ఫూల్' అని అరిచి ఆరడీ చేస్తే అదో ఆనందం! ఇక చిన్న పిల్లలైతే చెప్పఖ్ఖర్లేదు. బంగాళ దుంప చెక్కల మీద ఎ. ఎఫ్. అని చెక్కి సిరాలో ముంచి ఎదుటివారి వీపుల మీద ముద్రలు వెయ్యడం, సిరా చల్లుకోవడం వంటి పనులతో ఆ రోజుని కాస్తా ఓ చిన్న సైజు 'ఏకవర్ణ' హోలి పండుగ చేసేస్తారు.

ఈ పండగలాంటి సందడి వెనక వున్న కథ ఏమిటి? అది మనకు ఎలా సంక్రమించిది? అంటే, ఆంగ్లేయుల నుంచి వచ్చిందని చెప్పుకోవచ్చు. కాని ప్రపంచంలోని ముప్పాతిక మువ్వీసం దేశాలలో ఏప్రిల్ ఒకటో తారీఖుని 'ఆల్ ఫూల్స్‌డే' (మూర్ఖుల దినం)గానే వ్యవహరిస్తున్నారు. ఐతే ఈ కథ ఎలా మొదలైంది?

కొన్ని ఆచారాలు, అలవాట్లు ఎలా ప్రారంభమయ్యాయన్నది ఆరా తియ్యడం కష్టం. అలాగే ఏప్రిల్‌ఫూల్ దినం కూడా ఎలా, ఎప్పుడు ప్రారంభమైందో చెప్పడం కష్టం. కాని ఏప్రిల్‌ఫూల్స్‌డే ఫ్రాన్స్ దేశస్థులతో ప్రారంభమైనదని అంటారు.

పూర్వం అమలులో వున్న కాలండర్‌ను మార్చి ఇప్పుడు మనం ఉపయోగిస్తున్న కాలండర్‌ను రాసినప్పుడు మొదట దానిని అమలులో పెట్టింది ఫ్రాన్స్ దేశమే! 1564లో తొమ్మిదవ ఛార్లస్ రాజు కొత్త కాలండర్ ప్రకారం నూతన సంవత్సరం జనవరి 1న జరుపుకోవాలని శాసించాడు. అంతవరకూ కూడా కొత్త సంవత్సరం ఏప్రిల్ 1న జరుపుకునేవారు.

కాని చాలామంది ఈ మార్పుకు అంగీకరించలేదు. అలా ఏప్రిల్ 1 నాడే నూతన సంవత్సరం వేడుకలు జరుపుకోవాలనేవార్ని ఇతరుల అవహేళన చేసేవారు. వారికి ఉత్తుత్తి బహుమతులు పంపడం, వారింటికి వస్తామనో, వారిని విందుకు ఆహ్వానించో అటువంటి ప్రయత్నమేమీ చెయ్యకుండా ఏమార్చడం – ఇలాటివన్నీ కూడా వారి మీద ప్రయోగిస్తూ వుండేవారు. ఆ విధంగా ఆ రోజు నూతన సంవత్సరం ప్రారంభమవుతుందనుకునేవారిని మూర్ఖులుగా పరిగణించి 'ఏప్రిల్‌ఫూల్'కింద జమ కట్టేవారు.

వివిధ దేశాలలో వివిధ రకాలుగా ఈ ఏప్రిల్‌ఫూల్ దినం జరుపుకుంటారు. ప్రాక్టికల్ జోక్స్ ఏప్రిల్‌ఫూల్‌ని చెయ్యడంలో ఒక భాగంగా ఇప్పుడు ఎలా వున్నదో ఆ రోజుల్లోనూ అలాగే వుండేదన్నమాట.

పూర్వం లండన్ నగరంలోని లిన్‌స్టర్ గార్డెన్స్‌లో రెండిళ్లుండేవి. భూగర్భంలో ప్రయాణం చేసే రైలుకోసం ఆ భవనాలను పగలగొట్టి రైలు మార్గం ఏర్పాటు చేశారు. అయితే ఆ ఇళ్ల డాబా గోడలూ అవీ అందంగా చెక్కి వుండడంవల్ల డాబాతో సహా అట్లాగే విడిచిపెట్టేశారు. ఈ విషయం తెలియనివాళ్లని లండన్ నగరవాసులు ఆ ఇళ్లవద్ద కలుసుకోమని కబురు పంపేవారు. బయటినుంచి చూడడానికి ఇల్లులా కనిపించేదేగాని తీరా వెళ్లేసరికి ఇల్లేదీ అక్కడ! ఆ విధంగా 'ఫూల్స్' అయ్యేవాళ్లన్నమాట కొందరు.

స్కాట్‌లాండ్‌లో ఏప్రిల్‌ఫూల్ చెయ్యడం మరీ చిన్న పిల్లలు తరహాగా వుండేది. మొహాన మట్టి అంటుకుందని చెప్పటం, ఫలాన చోట కలుసుకోమని చెప్పి వెళ్లకపోవడం – ఇలాటివన్నమాట.

అయితే రాను రాను ఈ ఏప్రిల్‌ఫూల్ ఒక ప్రమాదకరమైన ఆటగా కూడా తయారైంది. ఎక్కడో ఎందుకు మన దేశంలోనే కొన్నాళ్లక్రితం ఏప్రిల్ 1 నాడు అగ్నిమాపకదళం వారికి ఫలానా చోట ఇళ్లు తగలబడిపోతున్నాయని టెలిఫోన్‌కాల్ వచ్చింది. తీరా వారక్కడికి వెళ్లేసరికి మంటలూ లేవు, ప్రమాదమూ లేదు. దాంతో తాము ఏప్రిల్‌ఫూల్స్ మయ్యామని తెలుసుకుని వెనక్కి తిరిగి వచ్చారు. సరిగ్గా ఆ రోజే, ఆ అగ్నిమాపక దళానికి మరో ఫోన్‌కాల్ వచ్చింది. అగ్నిమాపకదళం సిబ్బంది వెళ్లలేదు. ఎవరో తమని ఫూల్స్ చేస్తున్నారనుకుని. కాని విషాదమేమంటే ఈసారి నిజంగానే అక్కడ ఇళ్లు తగలబడిపోయాయి! చూశారా చివరకి ఈ ఏప్రిల్‌ఫూల్ తమాషా కాస్తా 'అదిగో పులి' కథగా మారి ఎంతటి ప్రమాదానికి దారి తీసిందో!

—బన్నీ

"ఇంతకూ పెళ్ళికొడుకు ఎవరు?'' అడిగింది వసుంధర.

"పేరు శ్రీనివాసరావ్! మా బావ సుధీర్ వాళ్ళ ఆఫీసే అతనిదీ!''

"ఏం చదువుకొన్నాడు?''

"పోస్ట్ గ్రాడ్యుయేట్!''

"అతనిని చూశావా?''

"చూడటమేమిటి? నేను హైద్రాబాద్ వెళ్ళినప్పుడు మాతోపాటు అతనూ షాపింగ్‌కొచ్చాడు!''

"ఓహో! అలాగయితే అంతా అర్థమయిందిలే!'' ఉడికిస్తూ అంది వసుంధర.

"ఇదేం లవ్ మారేజ్ కాదులే! ఏదో కనుక్కొన్నట్లు నువ్వేం పోజివ్వనవసరం లేదు''

చంద్రకాంత్ వారి సంభాషణ భరించలేక పోతున్నాడు. హేమ ఆమె వివాహం విషయం అంత ఈజీగా తీసుకోవడం అతనికి నచ్చలేదు. ఆమెని అంతగా అభిమానించే తన గురించి అసలు పట్టించుకోనే లేదన్నమాట! ఆమెను రహస్యంగా ఆరాధిస్తున్న తన మనసుని ఆమె అర్థం చేసుకోలేదన్నమాట! అవును! ఆమెను తను రాత్రింబగళ్ళు లోలోపలే స్మరిస్తున్న విషయం ఆమెకు తెలీదు. రోజూ తన కలల్లో ఆమె విహరిస్తోందన్న నిజం ఆమెకు తెలీదు. ఆమెను తను ప్రణయ సామ్రాజ్యానికి ఏనాడో అధిపతిగా చేసిన సంగతి ఆమెకు తెలీదు. ఆమె లేనిదే తన జీవితమే లేదన్న విషయం ఆమెకు తెలీదు. ఇప్పుడేమిటి చేయడం?

తన ప్రేమను ఆమెకు తెలియజేయాలా? ఆమెను అతనితో వివాహానికి అంగీకరించవద్దని ప్రాధేయపడాలా? ఆమె ఆ వివాహం చేసుకుంటే తను తన జీవితం ముగిస్తానని బెదిరించాలా? ఏమీ అర్థం కావడం లేదతనికి.

సశేషనవల:

# బొమ్మా-బొరుసూ

## శీలంశెట్టి రమాదేవి



జరిగిన కథ:

హేమ అభ్యుదయ భావాలు గల యువతి. హేమ బావ సుధీర్ తన స్నేహితుడు, సహ ఉద్యోగి అయిన శ్రీనివాసరావుని హేమకి పరిచయం చేస్తాడు. సుధీర్ హేమని వివాహం చేసుకోబోవడం లేదని తెలుసుకున్నాక, శ్రీనివాసరావు హేమని కలుసుకుని తన కోరికను వ్యక్తంచేస్తాడు. హేమ తన తండ్రిని కలుసుకుని మాట్లాడమని చెబుతుంది. శ్రీనివాసరావు హేమ తండ్రి రామరాజును కలుసుకుంటాడు. ఆయన హేమని, తన భార్య సౌభాగ్యమ్మని సంప్రతించి ఉత్తరం రాస్తానంటాడు. వారి అంగీకారంతో తన సమ్మతి తెలియజేస్తూ ఉత్తరం రాస్తాడు. శ్రీనివాసరావు తన తల్లిదండ్రులకి ఈ విషయం తెలియజేయడానికి తన ఊరికి ప్రయాణమవుతాడు. అతని తండ్రి శివరామయ్య, తల్లి సీతమ్మ శ్రీనివాసరావుని తమ బంధువుల అమ్మాయి నాగమణి నిచ్చి వివాహం చేద్దామనుకుంటారు. ఆమె చదువు లేని పల్లెటూరి అమ్మాయి అని శ్రీనివాసరావు ఒప్పుకోడు. తను చదువుకోలేదన్న మిషతోనే అతడు తనని నిరాకరించడంతో నాగమణి శ్రీనివాసరావు ఇంటనే వుండి మెట్రిక్‌కి కడుతుంది. వివాహం చేసుకోకుండా ఇంకా పై చదువులు చదవాలనుకుంటుంది. ఆ స్థితిలో నాగమణిని చూసి జాలిపడతాడు శ్రీనివాసరావు. తనకు వివాహం నిశ్చయమైన సంగతి హేమ తన స్నేహితురాలు వసుంధరకి, ఆమె తమ్ముడు చంద్రకాంత్‌కి చెబుతుంది. చంద్రకాంత్‌కి హేమ పట్ల ఆరాధనాభావం వుంది. ఈ విషయం వినగానే అతని మనసు విలవిలలాడిపోతుంది.



అయినా తన మాటలు ఆమె లెఖ్ఖ చేస్తుందా? చిన్నపిల్లాడి మాటలని కొట్టి పారేస్తుంది. ఆమె కంటే చిన్నవాడయిన తనకు అలాంటి కోరికలు తగవని మందలిస్తుంది.

చంద్రకాంత్‌కి వుక్రోషం ముంచు కొచ్చింది కోపంగా హేమ వేపు చూశాడతను.

"నేనింక వెళ్తాను వసుంధరా!" లేచి నిలబడుతూ అన్నది హేమ.

"అదేం? రైలు వచ్చేవరకూ ఉండవా?"

"ఊహూఁ! నువ్వు వెళ్ళిపోతూంటే చూస్తూ వుండడం నాకు బావుండదు! అందుకని ముందే వెళ్ళిపోతాను!"

"సరే!"

"హైద్రాబాద్ వెళ్ళగానే ఉత్తరం రాస్తావు కదూ?"

"ఓ! నువ్వెంత ప్రాంప్ట్‌గా జవాబిస్తావో చూస్తాను."

"ఓకే, చంద్రకాంత్! నువ్వేమీ మాట్లాడనే లేదు. అప్పుడే మర్చిపోయావా ఏమిటి నన్ను?" అతనిని నవ్వుతూ పలుకరించింది హేమ.

"అవునవును! ఎవరు మర్చిపోయిందీ మీకే తెలుసు..." నిష్ఠూరంగా అన్నాడతను.

"ఓహో! ముందే నేరం నా మీదకు నెట్టేస్తే సరిపోతుందనుకుంటున్నావా! సరే! నేను వెళ్తున్నానిక!" అందామె.

"పదండి! బయటివరకూ వస్తాను." ఆమెతో పాటు స్టేషన్ బయటకు నడుస్తూ అన్నాడతను. ఇద్దరూ వెయిటింగ్ రూమ్‌లో నిండిపోయిన జనం మధ్య నుంచీ తప్పించుకుని రిక్షా స్టాండ్ దగ్గరకు చేరుకున్నారు.

"మీది చాలా కఠినమయిన మనసు!" అన్నాడు చంద్రకాంత్ హఠాత్తుగా.

హేమ ఆశ్చర్యపడింది.

"నాదా?"

"అవును!"

"ఎందుకని?"

"నేను చెప్పను!"

"అదేమిటి? కారణం చెప్పకుండా స్టేట్‌మెంటిస్తే ఎలా సరిపోతుంది?" నవ్వుతూ అడిగింది.

"కారణం ఏమిటో మీ మనసుకి తెలుసు!" తిరిగి అన్నాడతను.

"బావుంది! తెలుస్తే అడగడం దేనికి?"

అతనికేం చెప్పాలో తెలీటం లేదు.

"సరే పోనీండి!" అన్నాడు నిదానంగా.

అతనేదో బాధపడుతున్నాడని గ్రహించింది హేమ.

"రిక్షా కావాలామ్మా?" రిక్షావాడు వచ్చి నిలబడ్డాడు.

"అవును!" రిక్షా ఎక్కి కూర్చుంది హేమ.

"ఇంక వెళ్తాను చంద్రకాంత్!" అంది ఆప్యాయంగా.

"వెళ్ళండి! మీరు నన్ను అర్థంచేసుకోలేరు!" అనేసి గిరుక్కున వెనక్కి తిరిగి స్టేషన్‌లోకి నడిచాడతను.

హేమ చకితురాలయింది. చంద్రకాంత్ ప్రవర్తన ఆమె కేమీ బోధపడలేదు.

రిక్షా ఇంటికి చేరుకొనేవరకూ అతని గురించే ఆలోచిస్తూండిపోయింది. అతనెందుకలా అన్నాడు? అతనిని తను అర్థంచేసుకోకపోవడమేమిటి? తనది కఠినమయిన మనసని ఎందుకన్నాడు?

అసలతని ఆంతర్యం ఏమిటి? తనకు తెలిసి తను అతనితో ఎప్పుడూ దురుసుగా వ్యవహరించలేదే! అతని మనసు కష్టపెట్టుకొనేలా ఎప్పుడూ ప్రవర్తించలేదే! మరెందు కతనలా మాట్లాడాడు? అతనిని తను అర్థంచేసుకోవడమేమిటి?

ఏమీ పాలుపోలే దామెకి.

*

శ్రీనివాసరావ్ హైద్రాబాద్ చేరుకునేసరికి అప్పటికే రామరాజు రాసిన ఉత్తరం ఆఫీసులో తన టేబుల్ మీదుంది.

అతనికీ, హేమకూ వివాహం చేయడానికి తాము అంగీకరిస్తున్నామనీ, అతని తరపు పెద్దవాళ్ళు ఏ రోజయినా సరే వస్తే మిగతా విషయాలన్నీ మాట్లాడి ముహూర్తాలు నిశ్చయించగలరనీ తెలియజేశాడతను.

శ్రీనివాసరావ్ ఆ ఉత్తరం తీసుకుని వెంటనే సుధీర్ ఆఫీసుకి చేరుకున్నాడు.

"ఏమయింది?" అడిగాడు సుధీర్ ఆత్రుతగా.

"వెళ్ళి రామరాజుగారితో అన్నీ మాట్లాడాను! అన్నీ ఆలోచించుకుని ఏ సంగతీ నాకు తెలియజేస్తామన్నారు. నేను అట్నుంచి అటు మా ఊరెళ్ళి ఇవాళే ఆఫీసుకి చేరుకొనేసరికి-ఇదిగో-ఈ ఉత్తరం ఉంది!" అంటూ తన చేతిలోని ఉత్తరం అతని కందించాడు శ్రీనివాసరావ్.

ఉత్తరం చదివి "వెరీగుడ్! కంగ్రాచ్యులేషన్స్!" అన్నాడు సుధీర్ నవ్వుతూ.

"థాంక్యూ! నీ సహకారం లేకపోతే ఇది ఇంత త్వరగా సక్సెస్ అయేదికాదు!"

"నో నో! నేను నీకేం సహాయం చేశానని? వాళ్ళ అడ్రస్ ఇచ్చాను! అంతేగా!"

"అఫ్‌కోర్స్! కానీ నేను నీ స్నేహితుడినన్న విషయం కొంతవరకూ నా మీద సదభిప్రాయం కలుగజేసిందాయనకు! నా గురించి మళ్ళీ ఆరాలు, విచారణలు చేసే అవసరం తప్పిపోయింది."

"సరే! అంతగా నా సహకారం ఉందనుకొంటే ఓ పార్టీ ఇద్దూగానిలే! బాకీ తీరిపోతుంది!" నవ్వుతూ అన్నాడు సుధీర్.

"షూర్!"

ఇద్దరూ మరికాసేపు మాట్లాడుకొన్నాక అక్కడి నుంచి వచ్చేశాడు శ్రీనివాసరావ్.

ఆ రోజు నుంచే అతను హేమ తనింటికి వచ్చేసరికి ఇల్లు ఎలా వుండాలో, ఇంట్లో ఏమేం వస్తువులుండాలో ఆలోచించడం మొదలుపెట్టాడు. హేమ లాంటి అందాల భరిణను ఎంత సుకుమారంగా చూసుకోవాలో తనకు తెలుసు. ఆమెకు తనింట్లో ఏ విధమయిన ఇబ్బందీ కలుగకూడదు. ఆ రోజే తన తల్లిదండ్రులకు ఉత్తరం రాశాడతను. ఆ తరువాత సంఘటనలన్నీ అతివేగంగా జరిగాయ్. అతని తల్లిదండ్రులు రామరాజు దగ్గర కెళ్ళడం-ఆ తరువాత లగ్నాలు లేకపోవడం వల్ల వెంటనే ముహూర్తాలు నిశ్చయించుకోవడం జరిగిపోయింది. ఇరవై రోజుల్లోనే పెళ్ళి ఏర్పాట్లన్నీ పూర్తిచేసుకోవాల్సి వచ్చింది. శ్రీనివాసరావు నెలరోజులు శెలవు తీసుకున్నాడు. బయల్దేరే రోజునే అతనికి ట్రాన్స్‌ఫర్ ఆర్డర్స్ వచ్చాయ్. శెలవు పూర్తవగానే విజయవాడలో జాయినవాలి. తన ఊరికి దగ్గరలో ఉండవచ్చని ఆ ట్రాన్స్‌ఫర్ కోసం తనే కొద్దిరోజుల క్రితం ప్రయత్నించాడు.

*

వివాహం చాలా నిరాడంబరంగా జరిగింది. పెళ్ళిళ్ళల్లో సాధారణంగా కనిపించే ఆచారాలెన్నో పక్కకి నెట్టివేయబడ్డాయ్. అలా జరిగినందుకు శివరామయ్యా, సీతమ్మా నొచ్చుకున్నా, హేమ పట్టుబట్టటం వలన చేసేదిలేక ఊరుకున్నారు. పీటల మీద తల వంచుకోకుండా కూర్చుని నవ్వుతూ, తుళ్ళుతూ స్నేహితురాండ్రతోనూ, బంధువులతోనూ మాట్లాడే హేమను చూస్తుంటే వారికి అయిష్టం ప్రారంభమయింది. మొదటి రాత్రి కోసం సన్నాహాలు ప్రారంభిస్తోంటే హేమ సరాసరి శ్రీనివాసరావ్ దగ్గరకు నడిచి అతనితోనే మాట్లాడుతూ కూర్చుంది చాలాసేపటి వరకూ! ఇది సీతమ్మకు మరింత విడ్డూరమనిపించింది. ఏమీ అలంకరణలు లేకుండానే శోభనం గదిలో అడుగు పెట్టిన హేమను చూసి నవ్వుకొన్నాడు శ్రీనివాసరావ్.

నిజమే! ఇంత అందమయిన అమ్మాయికింకా అలంకరణ లెందుకు?

"ఏమిటి అలా చూస్తున్నారు? గంగిరెద్దు వేషం వేయలేదనా?" నవ్వుతూ అడిగింది హేమ అతనికి సమీపంగా వచ్చి.

"ఊహు! అది కాదు! అందమయిన అమ్మాయికి అలంకరణలు అనవసరం అని నాకిప్పుడు తెలిసింది!" నవ్వుతూ అన్నాడతను.

"అందంగా ఉండడం, ఉండకపోవడం వేరే సంగతి. ఇలా అలంకారాల్లో ముంచి తేల్చబడ్డే ఆడది ఓ ఆట వస్తువులా తయారయింది. న్యాయం మీరే చెప్పండి! అలంకారాలు ఆడదానికే ఎందుకు? మగాడికెందుకుకూడదు?" చిరునవ్వుతో అందామె.

"ఇదిగో చూడమ్మాయ్! ఆడదానికి అలంకారాలు అవసరమా, కాదా అని చర్చించుకోడానికి మనం సమావేశమవలేదు!"

అతని మాటలకు సిగ్గుపడింది హేమ.

ఆమెను దగ్గరకు తీసుకున్నాడు శ్రీనివాసరావ్.

"హేమా!" ఆమె పెదాల మీద ముద్దు పెట్టుకొని తన్మయత్వంతో పిలిచాడతను.

"ఊఁ!"

"ఈ క్షణం కోసం నే నెన్నిరోజుల నుంచీ కలలు కంటున్నానో తెలుసా?"

"ఏమో!"

"ఆ రోజు మనిద్దరికీ పరిచయమయింది గుర్తుందా! అప్పటినుంచీ!"

"నిజమా?" నమ్మలేనట్లు అడిగిందామె.

"అవును! ఆ రోజు నుంచీ రాత్రింబగళ్ళు నీ గురించే ఆలోచన!"

"అప్పుడే రాలేదేం మరి, మా ఇంటికి?"

"బావుంది. నువ్వూ, సుధీర్ వివాహం చేసుకోబోతున్నారేమోనన్న అనుమానం! ఈ మధ్య అతనితో మాట్లాడేవరకూ అసలు విషయం నాకు తెలీదు!"

"మీరు నన్ను చేసుకోడానికి మీవాళ్లు మనస్ఫూర్తిగా వప్పుకొన్నారా?" అడిగింది హేమ.

"అవును! ఏం?"

"అనుమానమొచ్చింది! అంతే!"

"ముందు కొంత వెనుకాడారుగానీ నేను నచ్చజెప్పాక వప్పుకున్నారు. అయినా మనం ఆ విషయం అంతగా పట్టించుకోవాల్సిన పని లేదు. జీవితాంతం కలసి జీవించేది మనం గాని వాళ్లు కాదు!"

హేమ చిరునవ్వు నవ్వింది "మీరు చెప్పింది నిజమే!" అంది తలూపుతూ.

"అదిసరేగాని హేమా! ఇవాళ మనిద్దరం కబుర్లు చెప్పుకొంటూ కూర్చోవాల్సిన రోజు కాదు! కబుర్లకి చాలా సమయం ముందుంది! అవునా?" అంటూ ఆమెని కౌగలించుకొని అలాగే లేవనెత్తి మంచం మీదకు వరిగిపోయాడు. హేమ అతని కౌగిట్లో పసిపిల్లలా ఒదిగిపోయింది.

మరో పదిరోజుల తర్వాత విజయవాడలో సంసారం ప్రారంభించాడు శ్రీనివాసరావ్. ఆఫీసుకి





## కొత్త వస్తువులు

ఎస్‌సీ కంపెనీ (బొంబాయి)వారు వంట చెయ్యడానికి పనికొచ్చే 'హైస్పీడ్' ఎలక్ట్రిక్ సాధనాలను కొత్తగా విడుదల చేస్తున్నారు. ఇక్కడ కనిపిస్తున్న చిత్రం-హైస్పీడ్ బాయిలింగ్ యూనిట్ (మాడల్ యస్ 698 ఎఫ్) అన్నది. ఇది హాట్ ప్లేట్. ఇది పోర్సిలీన్‌తో చెయ్యబడ్డదనీ, 1250 వాట్స్ శక్తితో నడిచే 6 అంగుళాల వ్యాసంగల హాట్ ప్లేట్ ధర రూ 515 అవుతుందనీ, 8 అంగుళాలది అయితే, (2050 వాట్స్) రూ 630 అవుతుందనీ, ఇళ్లలో, ఆఫీసుల్లో, ఆసుపత్రుల్లో, చిన్న కాంటీన్లలో ఉపయోగించడానికి ఈ సాధనం చాలా అనువుగా వుంటుందనీ, ఎస్ సీ వారు చెబుతున్నారు.

వీరే విడుదల చేస్తున్న మరొక ఎలక్ట్రిక్ వంట పరికరం - జూనియర్ కుకింగ్ రేంజ్ (మాడల్ బి-68) ఇది కూడా 1250 వాట్స్ శక్తి మీద నడిచే వొవెన్. అద్దాల తలుపుగల ఈ 'పొయ్యి' ఆటోమాటిక్ థెర్మోస్టెట్ కంట్రోల్ గలదనీ దీని ధర రూ. 2900 అవుతుందనీ వారు తెలియజేస్తున్నారు.

# ఇప్పుడు మీరు కన్య మీకు కావలసిన రక్షణ ఒక్క కేర్‌ఫ్రీ* మాత్రమే ఇవ్వగలదు

OBM/1765 TEL

**కేర్‌ఫ్రీ** మిమ్మల్ని దృష్టిలో పెట్టుకొని తయారు చేయబడింది. ఆ 5 రోజుల శానిటరీ రక్షణకోసం ఇది ఆధునిక యువతికి చేదోడు.

**కేర్‌ఫ్రీ** ఒక ప్రత్యేకంగా చెమ్మనుపీల్చు నేప్‌కిన్, ఇది అధికమైన చెమ్మను పీల్చి మీకు ఇబ్బందిలేకుండా చేస్తుంది వాస్తవంగా, **కేర్‌ఫ్రీ** ఎంతపీల్చగలదంటే ఒకే ఒక నేప్‌కిన్ మీ పూర్తి సమయంలోని ప్రసరణలో సగం దాకా నిలుపుకోగలదు. కాని తాజా భావనకోసం మీరుఎంత తరుచుగా కావాలంటే అంత తరచుగా మార్చుకోండి.

ఒక్క **కేర్‌ఫ్రీ** మాత్రమే దిగువ భాగము ప్రక్కలా చుట్టూ ఒక ప్లాస్టిక్ షీల్డ్ కలిగియున్నది. ఇది మరకలు పట్ల త్రివిధ అడ్డంకిగా పనిచేస్తుంది.

**కేర్‌ఫ్రీ**తో మీరు హాయియైన భావన పొందగలరు, నెలలో ఇది ఏరోజో మీరు మరిచిపోతారు—చెమ్మ తగలటం ఉతికి ఆరవేసే ఇబ్బందిలేదు.

**కేర్‌ఫ్రీ** వాడకానికి తయారుగా వుంటుంది. మార్చుట చాలాసులభం. పారవేయుట చాలా తేలిక. అతి ఆరోగ్యకరమైనదిగూడా.

**కేర్‌ఫ్రీ** ధరించండి.

ఎల్లప్పుడూ విశ్వాసంతో ఉండండి.




10 మరియు 20 నేప్‌కిన్ల ప్యాక్‌లలో లభిసుంది.

Johnson & Johnson

దగ్గర్లోనే ఇల్లు తీసుకున్నాడతను. అంతవరకూ నిలువ ఉన్న డబ్బుతో ఇంట్లోకి ఎన్నో వస్తువులు కొన్నాడు. మంచాలూ, డైనింగ్ టేబులూ, సోఫా సెట్టూ, ఫ్రిజ్, రేడియో!

ఆ ఇల్లు చూచి హేమ పొంగిపోయింది.

"నాకు ఏడువందలు జీతం వస్తుంది హేమా! అదంతా నీ చేతికే ఇస్తాను. ఇంటి బాధ్యతంతా నువ్వే చూసుకోవాలి! సరేనా?" అడిగాడు శ్రీనివాసరావ్.

తలూపింది హేమ.

మొదటినెల జీతం తీసుకుని హనీమూన్ బయల్దేరారు వాళ్లు. దక్షిణ దేశంలోని కొన్ని ముఖ్యమయిన్న పట్టణాలు మాత్రం చూచి తిరిగి వచ్చారు.

రాన్రాను ఇంట్లో ఏమీ తోచక విసుగు పుడుతుండేది హేమకు. శ్రీనివాసరావ్ ఉదయం తొమ్మిదిన్నరకు ఆఫీసు కెళ్లి సాయింత్రం అయిదింటికి గాని తిరిగి వచ్చేవాడు కాదు. అంచేత ఇరుగు పొరుగువారి మీదకు తన దృష్టిని మళ్ళించిందామె. పక్కింట్లో ఉన్నామె అనూరాధ. ముగ్గురు పిల్లలు ఆమెకి. ఆమె భర్త రెండు మూడు రోజులకోసారి ఇంటికి వచ్చి పోతూంటాడు. ఆమెతో తేలిగ్గానే స్నేహం కలసిపోయింది హేమకు. ఇద్దరూ కలసి కాయగూరలకు, షాపింగ్‌కీ కలసి వెళ్తూండేవాళ్ళు. ఆ రోజు మధ్యాహ్నం పదకొండవుతూండగా ఇంట్లో కొచ్చింది అనూరాధ.

"ఏమండీ! మార్నింగ్ షో కెళ్దామా?" అంటూ అడిగిందామె హేమని.

"సినిమాకా?"

"అవును! మళ్ళీ రెండింటికల్లా ఇంట్లో ఉండవచ్చు!"

కొద్దిక్షణాలు ఆలోచించింది హేమ. శ్రీనివాసరావ్ నడగకుండా ఎప్పుడూ సినిమాకి వెళ్లలేదు. వెళ్లినా అతనేమీ అభ్యంతరం చెప్పడని తనకు తెలుసు.

"సరే పదండి!" అంది అంగీకరిస్తూ. ఇద్దరూ ఇంటికి తాళం వేసి సినిమాకి వెళ్ళారు.

తిరిగి వచ్చేసరికి మధ్యాహ్నం మూడయిపోయింది.

శ్రీనివాసరావ్ వచ్చాక మాటల్లో ఆ విషయం చెప్పింది హేమ.

"ఎవర్తో? ఈ పక్కింటిదాన్తో సినిమా కెళ్లావా?" చిరాకుగా అడిగాడతను.



ఇరవై రెండేళ్ళ హనీషా అబ్దుల్లా మలేసియాలో కాంట్రాక్టరుగా స్థిరపడిన ఏకైక వనిత. సంవత్సరంగా ఆ పనిలో ఆమె వున్నదట. అయితే ఒక వనిత ఇటువంటి వృత్తి చేపట్టినప్పుడు ఎన్నో కష్టాలను ఎదుర్కోవలసి వస్తుందని చెబుతుంది హనీషా. అంతెందుకు—ఒకసారి ఋణం మంజూరు చేయించుకోవడం కోసం ఆమె ఒక బ్యాంకుకి వెళ్ళిందట అక్కడ ఆమెని 'ముప్పతిప్పలుపెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగించి' మరీ అప్పు మంజూరు చేశారట. పైపెచ్చు 'ఇదంతా నీ ఓర్మిని పరీక్షించడానికి. నువ్వు వృత్తిలో నిలదొక్కుకోగలవో లేవో తెలుసుకోడానికి' అన్నారట. అంటే మగవారు పాదుకుపోయి వున్న వృత్తిలోకి ఆడవారు ప్రవేశించాలంటే వారికన్న రెండింతలు సమర్థత గలవారుగానూ, దృఢనిశ్చయం గలవారుగానూ ఋజువు చేసుకోవాలన్నమాట—భేష్!

"అవును! ఏం?" ఆశ్చర్యంగా అడిగింది హేమ.

"అలాంటి మనిషితో తిరగడం మంచిదికాదు."

"ఎందుకని?"

"దానిది చాలా బాడ్ కారెక్టర్...."

"అంటే?"

"భర్తనువదిలి వేరొకడితో లేచి వచ్చేసింది...."

హేమ ఆశ్చర్యపోయింది.

"అదేమిటి? ఇప్పుడున్నతను ఈమె భర్త కాదా?"

"ఊహు!...."

"అయినాగాని దానికి తప్పు పూర్తిగా ఈమెదే అని ఎందుకనుకుంటున్నారు?"

శ్రీనివాసరావ్‌కి నవ్వొచ్చింది. తను మర్చిపోయాడు. హేమ విప్లవనారీ సమితి సెక్రటరీ కదా ఒకప్పుడు.

"అంటే తప్పెవరిదంటావ్?"

"ఆమె నిలాంటి పరిస్థితికి ఆమె భర్తే తీసుకు వచ్చాడేమో ఎందుకాలోచించరు? అతనెన్ని దారుణాలు చేస్తే ఆమె ఇంత ఎక్స్‌ట్రీమ్ స్టెప్ తీసుకుందో మనకేం తెలుసు?"

"సరే! పోనీ తప్పు ఆమె భర్తది కూడా ఉందనుకుందాం! అంతమాత్రాన ఇలా మరో వివాహితుడితో లేచివచ్చేయడమే?" అనునయంగా అడిగాడతను.

"అదే మీ మగాళ్ల దుర్బుద్ధి. ఆ పనే మొగాడు చేస్తే పట్టించుకునేవాడు లేడు. కానీ ఆడది చేస్తే మాత్రం కొంపలు అంటుకుపోయినట్లు కేకలు పెడబొబ్బలు, ఆ ఆడదానికి 'బాడ్ కారెక్టర్' అన్న బిరుదులూ! అసలు ఆమెది బాడ్ కారెక్టరని మీకెలా తెలిసింది? భర్తను వదలి ఇంకొక పురుషుడితో సంసారం చేస్తున్నంత మాత్రాన బాడ్ కారెక్టర్ ఎలా అవుతుంది? ఆమె పదిమందితో వ్యభిచారం చేయడంలేదు కదా!

శ్రీనివాసరావ్ కేం మాట్లాడాలో తోచలేదు.

"ఇదిగో! వాళ్ల గురించి మనకు వాదనెందుకు గానీ, ఇంకోసారి దాన్తో తిరగవద్దు! అంతే!" కోపం అణచుకుంటూ అన్నాడతను.

"తిరుగుతే నేనూ చెడిపోతానంటారు! అంతేనా?" నవ్వుతూ అంది హేమ.

"హేమా! లేనిపోని అర్థాలు తీయకు! నేనలా అనలేదు. అలాంటి వాళ్లతో తిరగడం వల్ల మనకు అగౌరవమని చెప్తున్నాను! అంతే!"

హేమకు అతని వాదన నచ్చలేదు. అనూరాధ అంత చేయరాని ఘోరమేం చేసిందో ఎంత ఆలోచించినా అర్థంకావడంలేదు. తనకు సరిపడని భర్తను వదలి, తనను గౌరవించగలడని నమ్మకమున్న మరొక అతన్తో కాపురం చేయడంలో అనౌచిత్యం ఏముంది? ఒకవేళ అది తప్పే అనేట్లయితే ఇదే పని మగవాడు చేస్తే అది తప్పుగా ఎందుకు భావిం

చరు ? అతన్నెందుకు వెలివేయరు ? భార్యను, పిల్లలనూ వదలి వేరొక స్త్రీని వివాహం చేసుకున్న వారెంతమంది లేరు! భార్యతో సంబంధాలు త్రెంచేసుకుని మరో స్త్రీతో అక్రమంగా సంసారం చేస్తున్న పురుషులు చాలామంది తెలుసు తనకు. వారి గురించి ఎవ్వరూ పట్టించుకోరు. ఆ పని ఆడది చేస్తేనే ఘోరం! వీళ్ళ ఆలోచనా ధోరణిలో మార్పురాదా ఇక! భర్త ఎలాంటి వాడయినా, ఎన్ని హింసలు పెట్టినా, ఎన్ని అభిప్రాయ భేదాలున్నా అతనితోనే జీవితమంతా గడిపేయాల్సిందేనా ?

శ్రీనివాసరావుతో వాదన పెంచదల్చుకోలేదామె. తనెంత వాదించినా అతను వినిపించుకోడు. ఎందుకంటే అతనూ ఓ మొగాడేగా!

మర్నాడు మళ్ళీ అనూరాధ వచ్చిందామె ఇంటికి. ఎలాగయినా ఆమె గురించి పూర్తిగా తెలుసుకోవాలనిపించింది హేమకు.

“మీవారు రాలేదా ?” అడిగింది చిరునవ్వుతో.

“ఊహు ! లేదండీ !”

“ఆయనీ ఊళ్ళో ఉండరా! సాధారణంగా ఇంటి దగ్గర కనిపించరు కదా ?” అడిగింది హేమ.

అనూరాధ కొంచెం తటపటాయించింది. ఆమె మొఖంలో మేఘాలు కమ్ముకున్నాయ్.

“నా గురించి ఏమయినా విన్నారా ?” అడిగింది తన చేతి వేళ్ళ వంక చూసుకుంటూ.

“అవును....”

ఆమె కొద్దిక్షణాలు మౌనం వహించింది.

“నిజమే! నేను మా వారిని వదిలేసి వచ్చాను....”

“మీ కభ్యంతరం లేకపోతే అలా ఎందుకు జరిగిందో చెప్పగలరా? ఇందులో బలవంతమేమీ లేదు. ఎందుకో ఈ విషయంలో మీ తప్పేమీ లేదని నాకనిపిస్తోంది. నా ఆలోచన సరయినదే అని తెలుసుకోడానికే అడుగుతున్నాను....”

“ఇందులో అభ్యంతరం ఏముందిలెండి! అయినా మీ లాంటి సహృదయులకయినా అసలు విషయం తెలుస్తే నన్ను సరిగ్గా అర్థంచేసుకోగలుగుతారు.”

హేమ నవ్వింది.

“వివాహానికి ముందే నేను ఒకతనిని ప్రేమించాను. కానీ మావాళ్ల బలవంతం వల్ల వేరొకతనితో నాకు వివాహం జరిగిపోయింది. కొద్ది రోజుల తర్వాత ఆయనకు నా గతం తెలిసింది. నన్ను నిగ్గదీసి అడిగారు. నేను జరిగిన విషయమంతా ఉన్నదున్నట్లు చెప్పాను. అతనూ నేనూ ప్రేమించుకున్న మాట నిజమే ననీ, కానీ అతనితో వివాహం జరుగదని తెలిశాక నేను నా మనసులో నుంచి అతనిని తొలగించివేశాననీ, ఇప్పుడు అతనిని పూర్తిగా మర్చిపోయాననీ—ఎంతగా బ్రతిమాలి చెప్పినా ఆయనకు నా మీద నమ్మకం కలుగలేదు. ఆ రోజు నుంచీ నన్ను చిత్రవధ చేయడం ప్రారంభించారు. చేసేదిలేక ఆయనను వదిలివేసి ప్రేమించినతని దగ్గరకు చేరుకున్నాను. అప్పటికే అతనికి వివాహం అయిపోయింది. అయినా నా పరిస్థితి చూసి నన్ను ఆదరంతో స్వీకరించాడు. జీవితం అంతంచేసుకోవాలన్న నా ఆలోచనను మాన్పించి నాకు మళ్ళీ ధైర్యం చెప్పాడు. ఇద్దరం దేవుని ఎదుట ఒకటయాం. దీని వల్ల అతనికీ అతని భార్యకూ మనస్పర్థలు వచ్చినా తరువాత ఆమె అతనితో సహకరించింది. ఇంక అంతకంటె వేరే మార్గం తోచక అతనితో గడుపుతున్నాను. అతని భార్య మనఃక్లేశానికి కారణమయా నన్న బాధ తప్పితే నిజానికి నాకే లోటూ లేదిప్పుడు ...” చెప్పడం ఆపింది అనూరాధ.

హేమకు అనూరాధ ప్రియుడి మీద కోపం రగిలిపోయింది.

“మీకు మీ కిష్టంలేని వ్యక్తితో వివాహం జరుగుతుంటే అతనెందుకు పిరికివాడిలా చూస్తుండిపోయాడు ? ఆ రోజే మిమ్మల్ని ఎక్కడికయినా తీసుకుపోయి వివాహం చేసుకుంటే ఈ గొడవలన్నీ లేకపోను గదా ?”

అనూరాధ కామె వాదన నచ్చలేదు.

“అతనేం చేయగలడులెండి! పరిస్థితులలా వచ్చాయ్. అయినా ఇదంతా నా ఖర్మలెండి! ఎవర్ననడానికీ వీల్లేదు....”

“ఎందుకు లేదు ? అతను మొగవాడు గనుక అతనే ధైర్యం చేసి ఉండాల్సింది! పోనీ అతను నిజంగానే మిమ్మల్ని ప్రేమించి ఉన్నాడనుకోండి! అలాంటప్పుడు ఇంకొక అమ్మాయిని ఎలా వివాహం చేసుకున్నాడు ?....”

“మీరు ఊరికే అపోహపడుతున్నారు గాని ప్రేమించినంతమాత్రాన జీవితం నాశనం చేసుకోవాలని ఎక్కడుందీ ? ఏ విచార సమయంలో నయినా లేక ఏ సంతోష సమయంలో నయినా జీవితాంతం ఒకరినొకరు గుర్తుచేసుకుంటే అదే ఉన్నతమయిన ప్రేమ అని నే ననుకొంటాను. ప్రేమంటే జీవితాలు నాశనం చేసుకోవడం కాదు....” చిరునవ్వుతో అందామె.

“ఏమో మీరింత సౌమ్యంగా ఎలా ఆలోచిస్తున్నారో నా కర్థం కావటంలేదు....” అంది అసహనంగా.

అనూరాధకు నవ్వు వచ్చింది.

మంచో, చెడో-అనుభవిస్తోంది తను. అతని మనసు ఎలాంటిదో కూడా తనకు బాగా తెలుసు. మధ్యలో అతని మీద ఈవిడ కింత కోపం ఏమిటి ?

“ఇంక వెళ్తానండీ!....” అనేసి అక్కడి నుంచి తప్పించుకుని బయటకు నడిచిందామె.

హేమ చాలాసేపు అక్కడే కూర్చుండిపోయింది, అనూరాధ గురించి ఆలోచిస్తూ.

ఆ రాత్రి శ్రీనివాసరావ్ నిద్రపోయాక–లేచి కూర్చుని అనూరాధ జీవితమే కథగా రాయసాగింది. కథ పూర్తయేవరకు మనసులో అశాంతిగానే ఉంది. కథలో అనూరాధ ప్రియుడినీ భర్తనీ ఇద్దరినీ దోషులుగా చేసి చూపింది. అప్పటిగ్గాని ఆమె మనసులోని కోపం చల్లారలేదు.

కథ పూర్తయేసరికి రాత్రి రెండయిపోయింది. ముగింపు దశలో ఉండగా శ్రీనివాసరావుకి మెలకువ వచ్చింది.

“హేమా” కలవరపాటుతో పిలిచాడతను.

“ఊఁ!”

“ఏం చేస్తున్నావ్ ?” లేచి కూర్చుంటూ అడిగాడు.

హేమ చిరునవ్వు నవ్వింది.

“ఏదో రాసుకొంటున్నాను....”

“ఏమిటది ? ఉత్తరమా ?”

“కాదు!”

“మరి ?”

ఆమె నవ్వేసింది సిగ్గుతో.

శ్రీనివాసరావ్ కళ్ళు నులుముకొంటూ లేచి ఆమె దగ్గరకొచ్చి కాగితాలు చూశాడు. మరు నిమిషంలో అతనికి అర్థం అయిపోయింది.

“ఏమిటి? కథ రాస్తున్నావా ?” అన్నాడు ఆశ్చర్యంగా.

“ప్రయత్నిస్తున్నాను....”

“ఇంతకుముందేమయినా రాశావా ?”

“కాలేజ్ మాగజైన్స్‌కి, సావనీర్స్‌కి రాశాను! పత్రికల కెప్పుడూ రాయలేదు!”

“ఇవన్నీ మధ్యాహ్నం రాసుకోవాలి! రాత్రుళ్ల నిద్ర పాడుచేసుకోవడమెందుకు ?” ఆమెను

రెండు చేతులతో చుట్టి కనురెప్పల మీగ ముద్దు పెట్టుకుంటూ అన్నాడతను.

"కొంచెం ఆగండి! పది నిమిషాల్లో అయి పోతుంది!" వదిలించుకొంటూ అందామె.

అతను వదిలేసి వెళ్ళి మళ్ళీ మంచం మీద పడు కున్నాడు. కథ పూర్తిచేసి తనూ అతని పక్కనే వరిగిపోయింది హేమ. ఆమెకు మెలకువ వచ్చేసరికి అతను ఆఫీసు కెళ్ళడానికి సిద్ధమవుతూ కనిపించాడు. ఛటుక్కున లేచి కూర్చుని టేబుల్ మీదున్న టైమ్ పీస్ వంక చూసింది.

తొమ్మిదవుతోంది.

"అరె! నన్ను లేపలేదేం?" అడిగింది నొచ్చు కుంటూ.

"పాపం కథ రాసి అలసిపోయావ్ కదా!" వ్యంగ్యంగా అన్నాడతను.

"మరి మీరు కాఫీ కూడా తాగకుండానే వెళ్ళి పోతున్నారా?"

అతను నవ్వాడు.

"ఫరవాలేదులే! హోటల్లో తాగుతాను!"

హేమ అతని దగ్గరగా వచ్చింది.

"సారీ!" అంది అతని కళ్ళల్లోకి చూస్తూ.

ఆమెను తన గుండెలకు హత్తుకొని చెక్కిలి మీద చుంబించాడతను.

"మరేం ఫరవాలేదు. నువ్వు విశ్రాంతి తీసుకో వడమే మంచిదని నేనూ నిన్ను లేపలేదు!" అన్నాడు అనునయంగా.

అతను వెళ్ళిపోయాక వంటింటిలోకి నడిచిం దామె. స్టవ్ దగ్గర కెళ్ళాలంటే బద్ధకంగా ఉంది. ఈ సమయంలో వంట చేయబుద్ధికావటంలేదు. కానీ అర్జంటుగా కాఫీ కావాలి ముందు.

పాలు కాయకుండా అలాగే గిన్నెలో ఉంచాడు శ్రీనివాసరావ్. హేమకు కోపం ముంచుకొచ్చిం దతని మీద.

పాలు కాచి తామిద్దరికీ కొంచెం కాఫీ తయారు చేస్తే అతని సొమ్మేం పోతుంది? రోజూ తనే చేస్తోంది కదా? ఏదో కారణంచేత తను లేవలేక పోతే ఆ పని అతను చేయకూడదా? భార్యకు కాఫీ పెట్టి ఇవ్వడం అతనికి తలవంపులుగా భావిస్తున్నా డేమో! ఈ మగాళ్ళు ఎన్ని జన్మలెత్తినా అంతే! ఆడదాన్ని ఎలా 'ట్రీట్' చేయాలో తెలుసుకో లేరు.

విసుక్కుంటూనే కాఫీ కాచుకొని తాగింది హేమ. అప్పటికిగాని ఆమెకు బడలిక పోయినట్లు లేదు.

తరువాత తను రాసిన కథ తీసుకుని మరోసారి చదువుకుంది. అందులో కథ కంటె "వ్యాసం" గుణాలు ఎక్కువగా ఉన్నాయ్. అయినా ఫరవాలేదు. మిగతావాళ్ళు రాసే కథల కేమీ తీసిపోదిది. వెంటనే ఆ కథను తీసుకుని పోస్టాఫీస్‌కి బయల్దేరిం దామె. ఆ పని పూర్తిచేసి ఇంటికొచ్చేసరికి మధ్యాహ్నం పన్నెండయిపోయింది. ఆకలి విపరీతంగా వేయ సాగింది.

ఆకలితోపాటు శ్రీనివాసరావ్ మీద కోపం పెరిగిపోసాగింది.

తన దారిన తను హోటల్ కెళ్ళి కాఫీ టిఫిన్ తీసుకున్నారు. "ఇంటి దగ్గర పెళ్ళాంకి కూడా కాఫీ, టిఫినూ తీసుకెళ్ళి ఇద్దాం" అన్న ఆలోచనే లేదు మనిషికి. అతనూ మిగతావాళ్ళలాగానే స్వార్థ పరుడు. తనేదో భ్రమించింది కాని అతనూ మామూలు మొగాడే. అతనిలో తనూహించినంత ప్రత్యేకత ఏమీ లేదు. అతను చెప్పే మాటలకూ, చేసే పనులకూ పొంతన తక్కువ.

అతని మీద కోపం కొద్దీ భోజనం చేయకుండానే పడుకొందామె.

శ్రీనివాసరావ్ ఆఫీస్ నుంచి వస్తూనే హేమ పడుకుని ఉండటం చూచి కలవరపడ్డాడు.

"పడుకున్నావెందుకు హేమా?" అంటూ ఆత్రుతగా అడిగాడు.

"ఏమీ లేదు! ఊరికినే!"

ఆమె మాటలతో కొంత సంతృప్తి కలిగిం

## కూరలు పోషక పదార్థాలు



మునగ :

వీటిల్లో తెల్ల, ఎర్ర, నల్ల మునగ అని మూడు రకాలున్నాయి. సర్వసాధారణంగా అన్నిచోట్లా దొరికేది తెల్లమునగ. మునగకొమ్మ పాతినా, గింజలు పాతినా చిగురుస్తుంది. మునగచెట్టు వేరు, పువ్వులు, కాయలు కూడా ఉపయుక్తమైనవే.

ప్రతి 100 గ్రాముల మునగకాయలలోనూ—75.0 గ్రాముల తేమ, 6.7 గ్రా॥ ప్రొటీన్లు, 1.7 గ్రా॥ క్రొవ్వుపదార్థం, 2.3 గ్రా॥ ఖనిజ పదార్థం, 0.9 గ్రా॥ నార, 13.4 గ్రా॥ పిండి పదార్థం, 0.44 గ్రా॥ కాల్షియం, 0.07 గ్రా॥ భాస్వరం, 7.0 మిల్లిగ్రాముల ఇనుము 11,300 యూనిట్ల విటమిన్ ఎ, 0.06 మి.గ్రా॥ విటమిన్ బి$_1$, 0.08 మి.గ్రా॥ నికోటినిక్ ఆమ్లము, 0.12 మి.గ్రా॥ రిబోఫ్లోవిన్, 220 మి.గ్రా॥ విటమిన్ సి. వున్నాయి. వీటి కెలోరీ విలువ–96.

లేత మునగకాయలను కూరగానూ, ఉప్మా కూరగానూ వండుకుంటారు. మునగ ఆకుని దక్షిణ ప్రాంతంలోనివారు కూరకి ఉపయోగిస్తారు. పంజాబు ప్రాంతంలో ఎండిన కాయలనూ, ఆకులను కూడా కూరలకి ఉపయోగిస్తారు. పులుసులోనూ, సాంబారులోనూ మునగకాయ తరిగి వేసుకుంటే రుచిగా వుంటుంది. మునగకాయలకి యితర కూరలు కలిపి 'అవియల్'గా కూడా చేసుకుంటారు.

మునగచెట్టులో ఔషధ గుణములు ఎన్నో వున్నాయి. మునగచెక్క రసం ఇంగువ, సైంధవ లవణంతో కలిపి సేవిస్తే శ్లేష్మ సంబంధమైన వ్యాధులని అరికడుతుంది. వేరు చెక్కరసం తేనె కలిపి సేవిస్తే కడుపులో పురుగులని హరింప జేస్తుంది. అయితే దీనికి వేడిచేసే గుణం వుంది. అధికంగా సేవిస్తే పిత్తాన్ని వృద్ధి చేస్తుంది. మునగ గింజల చూర్ణం నస్యం వలె పీలిస్తే తలనొప్పులు, మూర్ఛరోగాలు నశిస్తాయి—అని చెబుతుంది ఆయుర్వేద శాస్త్రం.

# కలకలలాడే
# ముఖ కళకోసం కలికి కంటికి కాటుక




everest/79/SH/117-tl

**దక్షిణభారతీయస్త్రీల కళ్ళల్లో**
**కోటికాంతులను విరియింపజేసేందుకు**

**శింగార్**
డీలక్స్ కాజల్ (కాటుక)

దతనికి. డ్రస్ మార్చుకుని ఆమె దగ్గర కూర్చున్నాడు.

"టీ ఇస్తావా ?" అడిగాడు ఆప్యాయంగా.

"హోటల్లో తాగలేదా ?" అడిగిందామె కోపం అణచుకుంటూ.

"హోటల్లోనా ? ఎందుకు ?"

"ఏమో ! పొద్దున్న వెళ్ళేప్పుడు హోటల్లో తాగుతా నన్నారుగా !"

ఆమెకు కోపం వచ్చిందని గ్రహించాడు శ్రీనివాసరావ్. ఆమెను లేవనెత్తి తన కౌగిట్లోకి తీసుకున్నాడు.

"పొద్దున్న నువ్వు నిద్ర లేవలేదని హోటల్లోనే కాఫీ, భోజనం చేశాను. నీకు వంట్లో నలతగా ఉందా ఏమిటి ? రోజూ నే నొచ్చేసరికి 'టీ' రడీగా ఉంచేదానివి గదా !"

"అవును ! మీక్కావలసింది అన్నీ సమయానికి అమర్చడం ! అంతేగా ! కూర్చోండి ! ఇప్పుడే 'టీ' తెస్తాను !" వంటింటివేపు నడుస్తూ అందామె.

ఆమె వెనుకే తనూ నడిచా డతను.

వంటింట్లో అన్నీ ఖాళీ గిన్నెలు కనిపించేసరికి అతనికి అనుమానం వచ్చింది.

"హేమా ! భోజనం చేశావా నువ్వు ?" ఛటుక్కున ఆమెను తనవేపు తిప్పుకుంటూ అడిగాడు.

"ఇప్పుడు నా సంగతి ఎందుకులెండి. ముందు మీకు 'టీ' ఇస్తాను...."

శ్రీనివాసరావ్‌కి హృదయం ద్రవించిపోయింది.

"హేమా ! ఉదయం నుంచీ భోజనం చేయకుండానే గడిపావా ? ఎందుకు హేమా ? ఏమయింది ?" గాబరాగా అడిగాడు.

"భోజనం చేయాలనిపించలేదు ! అంతే !"

"ఎందుకని ?"

"ఏమో !"

"హేమా ! ప్లీజ్ ! సరిగ్గా మాట్లాడు ! నా మీద కోపం వచ్చిందా ? నే నేమయినా అన్నానా నిన్ను ?"

"అలా అని నే ననలేదు !"

"మరెందుకిలా చేశావ్ ?"

హేమ మాట్లాడలేదు !

"ఆల్‌రైట్, పద ! త్వరగా రడీ అవ్ ! మనం బయటికెళ్ళి హోటల్లో భోజనం చేసివద్దాం !"

"నే నెందుకులెండి ! మీరు చేసిరండి !"

"అదిగో ! అదే వద్దన్నాను ! పద త్వరగా !"



బేబీ మమత



ఈమధ్య హైద్రాబాదులో బాలల అకాడమీ ఆధ్వర్యాన జూనియర్స్‌కు భరతనాట్యంలో పోటీలు జరిగాయి. ఆ పోటీల్లో పాల్గొని, బేబీ మమత–ప్రథమ బహుమతి గెల్చుకున్నది. మమతది–శ్రీకాకుళం. ఆమె తండ్రి కో ఆపరేటివ్ సెంట్రల్ అగ్రికల్చరల్ డెవలప్‌మెంట్ బ్యాంకులో ఉన్నతోద్యోగిగా వుంటున్న శ్రీ మాదిరెడ్డి కృష్ణారావు. మమత వయసు ఎనిమిదేళ్ళు. శ్రీకాకుళం సైంట్ జోసెఫ్ కాన్వెంట్‌లో నాల్గవ తరగతి చదువుతోంది. చిన్నప్పట్నుంచీ నాట్యం మీద అభిలాష. ఇప్పటికీ రేడియోలో పాట వినవస్తే, దానికి ఎలా నాట్యం చేస్తే బాగుంటుందా, అని ఆలోచన చేస్తూ వుంటుంది.

టి. వి.

"నేను రాను !"

"ఎందుకని ?"

"ఉదయం నా విషయం గుర్తులేదు మీకు ! ఇప్పుడు మాత్రం ఎందుకు ?"

"సారీ హేమా ! అయామ్ ఎక్స్‌ట్రీమ్లీ సారీ ! సరేనా ?"

"నేను నిద్ర లేవకపోతే మీరు హోటల్ కెళ్ళిపోయారు. అంతేగాని ఆ కాఫీ మీరే తయారుచేసి నా కివ్వవచ్చన్న ఆలోచనే మీకు రాలేదు. ఎందుకంటే మీ ఉద్దేశ్యంలో చచ్చేంతవరకూ భార్యే వంట మనిషిగా ఉండాలి. మగాడికి వంటింటితో సంబంధం లేదు ! మీరు ఉద్యోగం చేస్తున్నారు. సంపాదిస్తున్నారు. అదేగా మీ ఆధిక్యత ! ఆ కారణంచేతే నేను వంటింట్లో మగ్గిపోవాలి !" రోషంగా అందామె.

శ్రీనివాసరావుకి నవ్వు వచ్చింది.

"అదా ! నీకు ఊహలెక్కువ హేమా ! అలా ఊహించుకోవడం మంచిది కాదు. నేను వంట చేయకూడదని ఎప్పుడూ అనుకోలేదు. నా కసలు కాఫీ చేయడం కూడా రాదు. ఇంతవరకూ ఆ అవసరమే కలుగలేదు. నువ్వేమో, నీ మనసుకి తోచిన విధంగా కోపం పెంచుకొని భోజనం కూడా మానేశావ్ !"

హేమ అతనివంక నమ్మలేనట్లు చూసింది.

"నిజంగా మీకు కాఫీ తయారుచేయడం కూడా రాదా ?"

"వట్టు వేయాలా ?" నవ్వుతూ అడిగాడతను.

హేమ సిగ్గుపడింది.

"పద ! త్వరగా రడీ అయావంటే అలా కాసేపు తిరిగి భోజనం చేసి వద్దాం !"

మారుమాట్లాడకుండా గదిలోకి నడిచి బట్టలు మార్చుకోసాగిందామె. తన ప్రవర్తన తల్చుకొంటే ఆమెకే నవ్వు వచ్చింది.

*

మర్నాడు ఉదయం తెల్లవారకుండానే తలుపు తట్టిన చప్పుడయి లేచి వెళ్ళి తలుపు తెరచిందామె. ఎదురుగ్గా నిలబడ్డ వ్యక్తిని గుర్తుపట్టలేదామె. పంచె, లాల్చీ, కండువా వేసుకొని చేతిలో ఓ బాగ్ పట్టుకొన్నాడతను.

"శ్రీనివాసరావున్నాడా ?" అడిగాడతను.

వెంటనే భర్త తరపు బంధువయి ఉంటాడని గ్రహించిందామె.

"ఉన్నారు !" దారి ఇస్తూ అంది హేమ.

"నేను శ్రీనివాసరావు బాబాయిన్లే...." లోపలికొస్తూ అన్నాడతను.

"అలా కూర్చోండి!" సోఫా చూపిస్తూ అందామె.

అతను బాగ్ సోఫాలో పడేసి కూర్చున్నాడు. అతని కళ్ళన్నీ హేమ మీదే ఉన్నాయ్. నైట్ డ్రస్‌లో ఉన్న హేమను చూస్తూంటే తమాషాగా ఉందతనికి. సినిమాల్లో చూశాడు ఇలాంటి వేషాలు! అంతే!

హేమ వెళ్ళి శ్రీనివాసరావుని నిద్ర లేపింది.

"చూడండి! మీ బాబాయి అట వచ్చారు...." అంది అతనితో.

శ్రీనివాసరావ్ లేచి కూర్చున్నాడు.

"చచ్చాంరా నాయినా!" అన్నాడు నవ్వుతూ.

"ఎందుకూ? తలనొప్పి బాపతా?" అడిగింది హేమ.

"అదేంకాదుగానీ-కొంచెం పాతకాలం మనిషి!"

హేమ కూడా నవ్వింది.

"ముందు మీరెళ్ళి మాట్లాడండి! లేపోతే ఇక్కడికి వచ్చినా వచ్చేస్తారు...."

శ్రీనివాసరావ్ లేచి బయటి హాల్లోకి నడిచాడు.

"ఎప్పుడొచ్చావ్ బాబాయ్?" పలుకరించాడతను.

"ఇప్పుడేరా! కోర్టు పనుండి ఇట్లా వచ్చాను! ఎలా వుంది కొత్త సంసారం?"

"బాగానే ఉంది!"

"అమ్మాయికి కొంచెం షోకెక్కువనుకుంటానే!"

శ్రీనివాసరావ్ ఉలిక్కిపడ్డాడు.

"ఎందుకని?" అన్నాడు ఆశ్చర్యంగా.

"ఆ, మరేం లేదు! ఆ డ్రస్సూ, యవ్వారం చూస్తూంటే కొంచెం ఇదిగా ఉందిలే!"

"అదంతా మామూలే లే! ఇంట్లో అంతా బావున్నారా?" సంభాషణ మార్చడానికి ప్రయత్నిస్తూ అన్నాడతను.

లోపలి గదిలో వాళ్ల మాటలు వింటున్న హేమకి ఒళ్ళంతా కంపరమెత్తినట్లయిపోయింది. హాల్లోకి నడిచి వాడిని బయటకు గెంటుదామా అన్నంత కోపం వచ్చింది.

కొద్దిసేపటి తర్వాత వాళ్ళిద్దరూ మొఖాలు కడుక్కున్నాక కాఫీలు అందించిందామె.

"నీళ్ళు తోడమ్మాయ్! స్నానం చేయాలి!" అన్నాడతను కాఫీ తాగుతూ.

"పనిమనిషి లేదండీ!" అనేసి ఛటుక్కున వెనక్కి తిరిగి వెళ్లిపోయిందక్కడినుంచి.

శ్రీనివాసరావ్ ఖంగారుపడ్డాడు. హేమకు కోపం వచ్చిందని తెలుస్తూనే ఉంది. కానీ బాబాయికి అలా జవాబు చెప్పడం నచ్చలేదతనికి. నీళ్ళు తోడడం ఇష్టంలేకపోతే తనతో చెప్పాలి. తనే తోడేవాడు. లేదా ఇంకేదేనా చేసేవాడు. పెద్దా, చిన్నా లేకుండా "పనిమనిషి లేదండీ" అని చెప్పేయడమేమిటి?

"నీళ్ళు తోడమంటే పనిమనిషి లేదంటుందేమిట్రా?" అర్థంకాక శ్రీనివాసరావుని అడిగాడు అతను.

"మరేం లేదు బాబాయ్! కొంచెం ఆలస్యం అవుతుందని అలా చెప్పిందన్నమాట! అంతే!" సర్దిచెప్తూ అన్నాడు శ్రీనివాసరావ్.

వంటింట్లో ఉన్న హేమ దగ్గరకు నడిచాడతను. కాఫీ తయారుచేస్తోందామె.

"హేమా! అలా పెద్దా, చిన్నా లేకుండా సమాధానాలు చెప్పడమేనా? నీకు కష్టంగా ఉంటే నాతో చెప్పు! నేను చేస్తానా పని! అవతల ఆయనేమనుకుంటాడు?" అన్నాడు కోపం అణచుకుంటూ.

"అలాంటివాళ్ళేమనుకున్నా నేను లెఖ్ఖచేయను! పోనీలేగదాని ఊరుకున్నాను. లేపోతే ఆయన వాగిన వాగుడికి బయటకు గెంటాల్సింది...."

బాబాయి అన్న మాట ఆమె విన్నదని తెలిసిపోయింది శ్రీనివాసరావుకి.

"ఆయనేమన్నాడు పాపం!" సందేహనివృత్తి కోసం అడిగాడతను.

"తెలీనట్లు నటించకండి! అలా ఎందుకన్నాడో కూడా నాకు తెలుసు. ఆయన దృష్టిలో ఆడది ఓ గొడ్డు లాంటిది. తెల్లవారుజామునే నిద్రలేవాలి! చలిలో ఛస్తూ వీధి వాకిలి ఊడవాలి. నీళ్ళు జల్లి ముగ్గులేయాలి. మొగాడిని నిద్రలేపి సేవలుజేయాలి. పైట నిండుగా కప్పుకుని ఎవరయినా మొగాడు ఎదుటపడితే తల భూమిలోకి దించుకుని నమ్రతతో పక్కకు తొలగిపోవాలి!—నేను ఈవిధంగా కనిపించకపోయేసరికి సహించలేక నోటికొచ్చినట్లు మాట్లాడేశారు. షోకులెక్కువట! సానిదానిలా కనిపించానేమో ఆయనగారి కళ్ళకి...." ఉద్రేకంగా అంటోన్న హేమ వంక నిస్సహాయంగా చూస్తుండిపోయాడు శ్రీనివాసరావ్. అతనికి కోపం, భయం రెండూ కలుగుతున్నాయ్. ఈ సమయంలో వివాదం పెంచుకుంటే అవతల బాబాయి ముందు అవమానం పొందాల్సి వస్తుంది. ఇంకేమీ మాట్లాడకుండా తనే మరో స్టవ్ అంటించి దానిమీద నీళ్లు కాయసాగాడతను. తనే నీళ్లు తోడి ఆయనను స్నానానికి పిలిచాడు. ఆయన స్నానం చేసి వచ్చేలోగా తను దగ్గర్లోనే ఉన్న హోటల్ కెళ్ళి ఇడ్లీలు పార్శెల్ చేయించుకొచ్చాడు. కాఫీ టిఫిన్ ముగించి ఆయన కోర్టు కెళ్లిపోయాడు. ఆయన వెళ్ళిపోయాక 'అమ్మయ్య' అనుకొన్నాడు శ్రీనివాసరావ్ గండం గడచినట్లు.

ఆ సాయింత్రం ఆయన కోర్టు నుంచి సరాసరి తన ఆఫీసుకే వచ్చి ఊరెళ్లిపోతున్నానని చెప్పి వెళ్ళిపోవడంతో శ్రీనివాసరావు సంతృప్తిగా గాలి

---

కాకరకాయ చేదు విరగాలంటే ముక్కలు తరిగి, బియ్యం కడిగిన నీళ్ళలో ఒక గంటసేపు నాననివ్వాలి.

జిడ్డు ఉన్న పాత్రను శుభ్రం చేయాలంటే దాన్ని వాడిన కాఫీ పొడితో తోమి, వేడి నీటితో కడగాలి.

—ఎస్. విజయలక్ష్మి

---



తల నిండా పేలు పట్టిన వాళ్ళు ఎన్నో మందులు వాడుతూ వుంటారు. అయినా మళ్ళీ వస్తూనే వుంటాయి. దానికో చిట్కా ఏమిటంటే, వేపాకులు బాగా నూరి తలకి పట్టించుకుని, ఐదు నిమిషాలు ఆగి, బూడిద గుమ్మడికాయలోని నీరు (రసం) రెండు అవున్సులపాటు తీసి అదీ పట్టించాలి. ఇలా నాలుగైదు రోజుల వరసగా చేస్తే, పేలు 'హైస్పీడ్'తో వరుగెడతాయి!

పిల్చుకున్నాడు.

హేమ విషయంలో తగు జాగ్రత్త తీసుకోక పోతే ఆమెను ముందు ముందు అదుపులో ఉంచడం కష్టమవుతుందనిపిస్తోంది. ఇవాళ బాబాయి విషయంలో మొండికేసింది. రేపు మరొకరవ్వచ్చు. వాళ్ళకి జరిగే అవమానం సంగతలా ఉంచి తన పరువు మర్యాదల సంగతేమిటి? వాడు పెళ్ళానికి దడిసే వెధవ అన్న పేరు వస్తే తనెలా సహించ గలడు? ప్రతి చిన్న విషయానికీ తగవులు పెంచుకొనే గుణం తనకి నచ్చదు. కొద్దిరోజులు ఆమెతో రిజర్వ్డ్‌గా ఉండాలి. మనసువిప్పి మాట్లాడకూడదు. బహుశా అప్పుడయినా ఆమె తప్పు తెలుసుకుంటుందేమో! అప్పటికీ ఆమె తన ప్రవర్తన సరిదిద్దుకోక పోతే తరువాతేం చేయాలో తనకు తెలుసు.

ఆ సాయంత్రం అతను ఇంటికొచ్చేసరికి ఇల్లు తాళం వేసి ఉంది. ఆశ్చర్యంతోపాటు కోపం కూడా కలిగిందతనికి. తను వచ్చే సమయానికి ఇంట్లో లేకుండా ఎక్కడకు వెళ్ళినట్లు? అంత అవసరమయిన కార్యక్రమాలేమున్నాయ్?

పక్కింటామె అతన్ని చూసి తాళంచెవి తెచ్చి ఇచ్చింది.

"హేమగారు వాళ్ల స్నేహితురాలు వచ్చి బలవంతం చేస్తే ఆమెతోపాటు వెళ్లారు!" అందామె.

"సరేలెండి!" అనేసి తాళం తీసుకుని లోపలకు నడచాడతను.

బట్టలు కూడా మార్చుకోకుండా ఆమె కోసం ఎదురు చూస్తూ కూర్చున్నాడు.

బాగా చీకటిపడ్డాక వచ్చింది హేమ. ఆమెతో పాటు మరొకతను కూడా లోపలికొచ్చాడు.

"రండి! ఇలా కూర్చోండి!" అంటూ అతనిని ఆహ్వానించింది, హేమ.

"వీరే మా వారు! ఈయన మా ఫ్రెండ్ ఉషాదేవి హజ్‌బెండ్!" ఇద్దరినీ పరిచయం చేసింది.

"గ్లాడ్ టు సీ యూ...." కరచాలనం చేస్తూ అన్నాడతను. శ్రీనివాసరావ్ చిరునవ్వు నవ్వాడు.

"మేము బెంగుళూరులో ఉంటున్నాము. నేను ఆఫీసు పని మీద వస్తోంటే తనూ వస్తానంది మా మిసెస్. తీరా వచ్చాంకదాని అతికష్టం మీద ఎలాగోలా మీ అడ్రస్ సంపాదించి మిమ్మల్ని చూడగలిగాము—" నవ్వుతూ అన్నాడతను.

"ఇక్కడ ఎక్కడ దిగారు?" అడిగాడు శ్రీనివాసరావ్.



## గొల్లపూడి ప్రమద్వర

హైదరాబాదులో ఇటీవల టూరిజమ్ వారోత్సవాల సందర్భంగా రవీంద్రభారతిలో జరిగిన వేడుకలలో నాట్య ప్రదర్శన ఇచ్చి పలువురి ప్రశంసలందుకున్నది – కుమారి గొల్లపూడి ప్రమద్వర.

గుంటూరు బండ్లమూడి హనుమాయమ్మ ఉన్నత పాఠశాలలో తొమ్మిదవ తరగతి చదువుతున్న ప్రమద్వర అక్కడి నాగార్జున సంగీత నృత్య కళాశాలలో నాట్యం నేర్చుకుంటోంది. కూచిపూడి, భరతనాట్యాలు రెండింటి మీద ప్రమద్వర ఉత్సాహంచూపడం చూసి ఆమె తండ్రి శ్రీ గొల్లపూడి ప్రకాశరావు ఆ రెండింటినీ ఆమెకు నేర్పిస్తున్నారు.

ప్రమద్వర ఆంధ్రప్రదేశ్‌లో పలుప్రాంతాలలో నాట్య ప్రదర్శనలు ఇచ్చి మెప్పించింది. నాగార్జున సంగీత కళాశాల నిర్వాహకులలో ఒకరైన ప్రసాదరావు మాస్టారి ప్రోత్సాహంతో 'శకుంతలా దుష్యంతమ్' నృత్యనాటికను పాండిచ్చేరిలో ప్రదర్శించి ప్రేక్షకుల ప్రశంసలందుకున్నది. హైదరాబాదు దూరదర్శినిలో కూడా ప్రసారితమైన ఈ నృత్యనాటిక నాట్యాభిమానులందరినీ అలరించింది. ప్రమద్వర నాగార్జున సాంస్కృతిక సమాఖ్య తరపున ప్రతి నెలా గుంటూరులో జరిగే సాంస్కృతిక కార్యక్రమాలలో పాల్గొంటున్నది. ఒకవైపు విద్య నభ్యసిస్తూనే నృత్యకళను కూడా క్షుణ్ణంగా అభ్యసించి బాగా పేరు తెచ్చుకోవాలనుకుంటోంది కుమారి ప్రమద్వర.

"నటరాజ్ హోటల్లో!"

"ఓహో...."

హేమ 'టీ' తయారుచేసుకొచ్చి వాళ్లిద్దరికి ఇచ్చి తనూ ఓ కప్పు తీసుకుని సోఫాలో కూర్చుంది.

కొద్దిసేపు కూర్చుని వెళ్ళిపోయాడతను.

"సారీ! మీకు చెప్పకుండా వెళ్ళిపోయాను. ఉష బలవంతంగా తీసుకెళ్ళింది హోటల్‌కి. వాళ్ళ రూమ్‌కి మా పాత ఫ్రెండ్స్‌ని మరో ఇద్దరిని కూడా ఆహ్వానించిందట. అందరం కలసి కాసేపు సరదాగా గడుపుదామని అనేసరికి కాదనలేక వెళ్ళాను...." శ్రీనివాసరావ్‌తో అంది హేమ.

శ్రీనివాసరావ్ ఏమీ మాట్లాడలేదు. అతని మనసులో అగ్నిపర్వతాలు రాజుకుంటున్నాయి.

హేమ తనను అడగకుండా బయటకు వెళ్ళడమే కాదు. ఇంతసేపూ హోటల్లో స్నేహితురాండ్రతో కబుర్లు చెప్తోందిట. అక్కడితో ఆగినా ఫరవాలేదు. ఇంతవరకూ ముక్కూ మొగం తెలీని స్నేహితురాలి భర్తను వెంటబెట్టుకుని విహారాలు చేస్తూ ఇంటి కొచ్చింది. తను హేమ విషయంలో ఏదయినా సహించగలడు గాని ఆమె మరో మగాడితో చనువుగా ఉంటే సహించలేడు. తనకు ఆమె మీద నమ్మకం ఉంది. కాని ఆమె అందం మీద లేదు. ఎలాంటి మొగాడినయినా చలింపజేస్తుందది.

"ఇలా హోటళ్ళ కెళ్ళడానికీ, ముక్కూ మొఖం తెలీనివాడితో తిరగడానికి బుద్ధుండక్కర్లేదూ?" ఉద్రేకంగా అడిగాడతను.

హేమ గాబరాపడింది అతని ధోరణికి.

అతను ఈ విధంగా మాట్లాడతాడని గానీ, మాట్లాడగలడని గానీ ఎప్పుడూ ఊహించలేదు.

"ఏమిటి మీరనేది?" అంది తేరుకుంటూ.

"నా మాటలు అర్థం కూడా కావటంలేదన్న మాట. ఇలా నీ కిష్టమొచ్చిన వ్యక్తితో తిరగడం నా కిష్టం లేదని చెప్తున్నాను...."

"తి...రి...గా...నా..." తెల్లబోతూ అందామె.

"వాడిని ఇంటికి తీసుకురావడం—తిరగడం కాదా?"

హఠాత్తుగా ఆమెకు రోషం పొడుచుకొచ్చింది. తను అతని అనుమతి లేకుండా స్నేహితురాలితో గడిపినంతమాత్రాన, ఆమె భర్త మర్యాద కోసం తనను ఇంటి వరకూ దిగబెట్టినందుకు ఇన్ని మాటలు పడాలా? అసలిందులో తను చేసిన ఘోరం ఏమిటని?

[సశేషం]

# విశ్వసాహిత్యంలో ఉద్గ్రంథాలు

'బ్రాహ్మీదేవి'

ప్రసిద్ధమైన జేన్ ఐర్ గ్రంథాన్ని వ్రాసిన చార్లొట్ బ్రాంటీ చెల్లెలు ఎమిలీ బ్రాంటీ. ఈమె రచించిన ఉద్గ్రంథం 'వుదరింగ్ హైట్స్' (Wuthering Heights). ఈమె జీవించిన యార్క్‌షైర్ (Yorkshire–England) ప్రాంత వ్యావహారిక భాషలో 'వుదరింగ్' అంటే 'ఉప్పెనగాలి వాతావరణం' (Stormy weather) అని అర్థం. ఈ గ్రంథంలో యీ పేరు ఒక ప్రాసాదానిది. దాని చుట్టూ కథ తిరుగుతుంది. అందుకని నవలకా పేరు పెట్టింది రచయిత్రి.

ఆంగ్లభాషలో రొమాంటిక్ సాహిత్యయుగంలో వుదరింగ్ హైట్స్–ప్రథమగణ్యమైన మహారచన. ఇందులో రెండురకాల ప్రపంచాలకు సంఘర్షణ రసవత్తరంగా ఘటింపబడింది. ప్రేమ, పగల తీవ్ర ఆవేశ లోకవంక. ఇందుకు సాంకేతికం వుదరింగ్ హైట్స్ భవనం. రెండోప్రక్క నాగరికమై సాంఘిక దృష్టిలో సమీచీనంగా ఉండే ధోరణికి సాంకేతికంగా థ్రష్‌క్రాస్‌గ్రాంగ్. వుదరింగ్ హైట్స్ ప్రపంచం క్రూరంగా – అనాగరికంగా ఉన్నప్పటికీ – అక్కడ లోకాద్భుతమైన ప్రేమకు కూడా స్థానం ఉన్నది. థ్రష్‌క్రాస్‌గ్రాంగ్ ప్రపంచం సుఖశాంతుల నిలయంగా నాగరికంగా ఉన్నప్పటికీ–అది రక్తహీనంగా (అంటే ఆర్ద్రితలేని-నిర్గంధకుసుమం) లక్ష్యహీనంగా ఉంటూ ఉండటం కూడా కద్దు. మూడు పురుషాంతరాల కాలంలో యీ రెండు భిన్నప్రపంచాల సంఘర్షణయే నవలా కథాస్వరూపం.

**కథ**

చలికాలంలో ఒకనాటి సాయంత్రం (1801) థ్రష్‌క్రాస్‌గ్రాంగ్‌లో అద్దెకు ఉంటున్న లాక్ ఉడ్ యజమాని హీత్‌క్లిఫ్‌ని చూడటానికి వుదరింగ్ హైట్స్‌కు వెళ్లుతాడు. అక్కడ కుక్కలు అతనికి అసమీచీనమైన స్వాగతం చెప్పుతాయి. హీత్‌క్లిఫ్ కూడా హార్దికమైన స్వాగతం పలుకలేదు. మళ్ళీ రెండోసారి వెళ్లగా అందంగా, మౌనంగా ఉన్న హీత్‌క్లిఫ్ కోడలు (భర్తృవిహీన) -ఎబ్బెరంగా ఉన్న హేర్‌టన్ ఎర్న్‌షా అనే యువకుడు కన్పిస్తారు. ఆ రాత్రి అక్కడ గడపటానికి తప్పకపోతే -ఎవరూ ఉపయోగించక మూసివుంచిన గదిలో పడుకోవలసి వస్తుంది. అర్థరాత్రి వేళకి కిటికీ తలుపును ఏదో చెట్టు కొమ్మ బాదుతున్నట్లనిపించి కిటికీ తీస్తాడు. అక్కడ చెట్టుకొమ్మ లేదు. ఒక స్త్రీ చేయి-మంచుగడ్డ లాగా ఉన్నది ఎముకలు మాత్రమే మిగిలింది చేతికి అందుతుంది. ఆ కిటికీ ద్వారా ఆ స్త్రీ లోపలకు రావాలని ప్రయత్నిస్తుంది. ఇంతలో అక్కడకు హీత్‌క్లిఫ్ పరుగెత్తుకుంటూ వచ్చి లాక్ ఉడ్‌ను బయటకు త్రోసివేస్తాడు.

థ్రష్‌క్రాస్‌కు తిరిగివచ్చిన లాక్ ఉడ్ ఆ ప్రాంతంలో చాలకాలం నుంచి ఉన్నవాళ్ల ద్వారా పూర్వగాథ తెలుసుకుంటాడు.

ఎర్న్‌షా దంపతులు వుదరింగ్ హైట్స్‌లో సుఖంగా ఉంటూ ఉండేవాళ్లు. వాళ్లకు కేథరిన్ అనే కూతురు, హిండ్లే అనే కొడుకు. ఒకసారి లివర్‌పూల్ వెళ్లి వస్తూ ఎర్న్‌షా అనాధ బాలకుణ్ణి వెంటతీసికొని వచ్చాడు. అతడికి హీత్‌క్లిఫ్ అని పేరుపెట్టి సోదరుడుగా చూసుకొమ్మని తన పిల్లలకు చెప్పాడు. క్రమక్రమంగా హీత్‌క్లిఫ్ ఎర్న్‌షా వాత్సల్యానికి, ప్రేమకు పాత్రుడయ్యాడు. తన తండ్రి వాత్సల్యంలో భాగం పంచుకున్నందుకు అతని మీద హిండ్లేకు ద్వేషం వచ్చింది. హిండ్లే హీత్‌క్లిఫ్‌ను చాలా బాధలుపెట్టుతూ నీచపు సేవకునిగా చూస్తూండడం వల్ల తండ్రి అతనిని చదువనే మిషపెట్టి దూరంగా పంపించి వేశాడు.

అయితే కొద్దికాలంలోనే ఎర్న్‌షా చచ్చిపోయాడు. హిండ్లే వుదరింగ్ హైట్స్ తిరిగి వచ్చాడు. వెంట అతను పెండ్లాడిన నవ వధువు ఉన్నది. ఆమె పేరు ఫ్రాన్సెస్. ఎక్కువ అనారోగ్యపు మనిషి. ఇప్పుడు హిండ్లే హీత్‌క్లిఫ్‌ను మరింత బాధలుపెట్టడం సాగించాడు. ఎప్పటికైనా పగ తీర్చుకోలేకపోతానా అని హీత్‌క్లిఫ్ అనుకొనేవాడు.

ఒకనాడు రాత్రిపూట హీత్‌క్లిఫ్, కాథరిన్ థ్రష్‌క్రాస్‌గాంగ్ వైపు వెళ్ళారు. అక్కడ ఒక విందు జరుగుతుండగా కాథరిన్‌ని కాలి మీద ఒక కుక్క కరిచింది. ఆమెను థ్రష్‌క్రాస్‌గాంగ్ భవనంలోకి తీసుకువెళ్ల వలసివచ్చింది. అక్కడ యజమానులైన లింటన్ దంపతులతో ఆమెకు పరిచయమైంది. వాళ్ల కుమారుడు సుందరుడైన ఎడ్గార్‌తోను మంచి మనసు గల ఇజబెల్లాతోను స్నేహమయింది. ఆమె అక్కడ కాలు నయమయేంతవరకు ఐదువారాలు ఉండవలసివచ్చింది.

తిరిగివచ్చి ఆమె ఇంటి దగ్గర లింటన్ కుటుంబాన్ని తెగమెచ్చుకోవడం సాగించింది. ఆమె మాటల మూలాన హీత్‌క్లిఫ్‌కు అసూయ విపరీతంగా పుట్టుకువచ్చింది.

మళ్లీ ఉదరింగ్ హైట్స్‌లో ఒక మరణం. హిండ్లే భార్య ఫ్రాన్సెస్ హేర్‌టన్ అనే కుమారుణ్ణి ప్రసవించి చనిపోయింది. తన దుఃఖాన్ని మరచిపోవడానికి హిండ్లే ఎక్కువ త్రాగడం సాగించాడు. హీత్‌క్లిఫ్‌ను బాధపెట్టడం కూడా ఎక్కువ చేశాడు.

ఒకనాడు కేథరిన్ పనిమనిషితో కొన్ని మాటలు చెబుతూండగా వెనుక నుంచి హీత్‌క్లిఫ్ విని ఆ మాటలు తనకు సంబంధించినవని అనుకొని ఆ రాత్రే ఇల్లు వదలి వెళ్లిపోతాడు. బాగా ధనం సంపాయించి తిరిగివచ్చి కేథరిన్‌ను వివాహం చేసుకుందామని పట్టుదలతో వెళ్లాడు. మర్నాడు అతను వెళ్లిపోయాడని కేథరిన్ తెలిసికొని అతని కోసం చుట్టుపక్కల ప్రాంతమంతా తుఫానును కూడ లక్ష్యంచెయ్యక గాలించింది.

హీత్‌క్లిఫ్ వెళ్లిపోయిన తర్వాత కేథరిన్ అతని కోసం తపించింది. చివరకు సుందరుడైన ఎడ్గార్‌ను కాదనలేక అతనిని వివాహమాడి థ్రష్‌క్రాస్‌గ్రాంగ్‌కు వెళ్లిపోయింది. అక్కడ సుఖంగా కాలక్షేపం జరుగుతూంటే కొన్నాళ్లకు హీత్‌క్లిఫ్ తిరిగివచ్చాడు. అతడు ఎక్కడకు వెళ్లింది ఏమిచేసింది చెప్పలేదు. కాని ఐశ్వర్యవంతుడుగా తిరిగివచ్చాడు.

అప్పటికి తాగుడులో, అప్పుల్లో మునిగిపోయిన

హింద్లే అతనిని కొంత డబ్బు పుచ్చుకుంటూ ఉదరింగ్ హైట్స్‌లో ఉండనిస్తాడు. అయితే రోజు రోజుకీ హింద్లే త్రాగుడు ఎక్కువ అవుతుంది. అప్పులు ఎక్కువైపోతాయి. ఉదరింగ్ హైట్స్‌కి హీత్‌క్లిఫ్ నిజమైన యజమాని అవుతాడు.

హీత్‌క్లిఫ్ ఇజబెల్లాను వలలో వేసుకుంటాడు. వాళ్ల వివాహానికి ఎడ్గార్ అంగీకరించకపోతే ఆమెను ఉదరింగ్ హైట్స్‌కు లేవదీసుకుపస్తాడు. అతనికి థ్రష్‌క్రాస్‌గాంగ్‌లో ప్రవేశం లేకుండా పోయింది. ఒకనాడు కాతరిన్ చావుబ్రతుకుల్లో వున్నట్లు హీత్‌క్లిఫ్‌కు తెలిసింది. ఉండబట్టలేక ఆమె దగ్గరకు వెళతాడు. ఆమె తన హృదయంలో వున్న ప్రేమను పరితాపాన్ని వెల్లడించి కాతెలింటన్ అనే కుమార్తెను ప్రసవించి చచ్చిపోయింది. భగ్నప్రేమికుడై పరితప్తుడైన హీత్‌క్లిఫ్ ఆమె ఆత్మను నిరంతరం తన వెంట ఉండమని ఆక్రోశించాడు.

ఇంతలో ఇజబెల్లాకు హీత్‌క్లిఫ్ నిజస్వరూపం తెలిసింది. తన్ను పెండ్లాడింది ప్రేమతో కాదు. తన అన్న మీద కక్ష్యసాధించుకోవడానికి. ఆమె ఇల్లు వదలి లండన్ వెళ్లి అక్కడ లింటన్ అనే కుమారుణ్ణి ప్రసవించింది. హింద్లే ఉదరింగ్ హైట్స అంతా హీత్‌క్లిఫ్‌కి తాకట్టుపెట్టి త్రాగుడుతో చచ్చిపోయాడు. హీత్‌క్లిఫ్ హింద్లే కుమారుడు హేర్‌టన్‌పై పగ తీర్చుకుంటూ బాధలుపెడ్తూ పెంచుతాడు.

కుమారుని కన్న పన్నెండేళ్లకు ఇజబెల్లా భగ్నహృదయురాలై చచ్చిపోయింది. ఆమె కుమారుణ్ణి ఎడ్గార్ తీసుకువచ్చి పెంచుతాడు. హీత్‌క్లిఫ్ తన కుమారుణ్ణి తానే పెంచాలంటాడు. ఎడ్గారు ఏమి చేయలేకపోతాడు. క్యాథీ లింటన్‌ను చూడటానికి ఉదరింగ్ హైట్స్‌కు వస్తుంది. ఆమెను బంధీ చేసి హీత్‌క్లిఫ్ రోగిష్టియైన తన కొడుకుతో ఆమె పెండ్లి చేస్తాడు. ఈ వార్త తెలిసి ఎడ్గార్ గుండెపగిలి చచ్చిపోతాడు. క్యాథీ థ్రష్‌క్రాస్‌గాంగ్‌కు యజమానురాలవుతుంది. తరువాత కొన్నాళ్లకు రోగిష్ఠి లింటన్ కూడా చచ్చిపోతాడు. క్యాథీ మామగారు హీత్‌క్లిఫ్‌తో ఉండవలసివచ్చింది.

కొన్నాళ్లకు హీత్‌క్లిఫ్ చిరాకుపడి జీవితం మీద అసహ్యంకలిగి ఆహారం మానేసి చచ్చిపోతాడు. చచ్చిపోయినతర్వాతనైనా తన ప్రియురాలు కాతరిన్‌ని కలుసుకోవాలని ఆశ. ఇప్పుడు ఉదరింగ్ హైట్స్‌లో క్యాథీ హేర్‌టన్‌లు మిగులుతారు. ఆమె అతన్ని ఒక మానవుడుగా చెయ్యడానికి ప్రారంభించింది. హీత్‌క్లిఫ్‌కి సమాధి కాతరిన్ సమాధి పక్కనే చేయబడింది.

తుఫానురాత్రులలో హీత్‌క్లిఫ్, కాతరిన్ పిశాచాల రూపాలలో పరిసరాలలో సంచరిస్తారని జనం అనుకుంటారు.

ఈ నవల వ్రాసిన ఎమిలి బ్రాంటి జీవితం కూడా విషాదపూరితమయినదే. ఆమె యార్క్‌షైర్ తోర్నటిలో 1818 జూలై 30 న జన్మించింది. ఆమె 1836 లో స్వల్పకాలం గవర్నెస్ ఉద్యోగం చేస్తూ దూరంగా ఉన్నా ఇంటి మీది బెంగతో తిరిగివచ్చింది. ఆమె తన అక్కలిద్దరికంటే నిజానికి ఎక్కువ శక్తివంతమైన రచయిత్రి, కవయిత్రి కూడా.

వర్జినీయా ఉల్ఫ వచ్చేటంతవరకూ ఈమె గద్య శైలి ప్రథమ గణ్యతలో ఉన్నది. ఉదరింగ్ హైట్స మొదట 1840 సం॥లో ఎల్లిసిబెల్ అనే కలం పేరుతో ప్రకటించింది. మొదట ఎక్కువ గుర్తింపు రాకపోయినా క్రమక్రమంగా ఇది గొప్ప రచనగా అంగీకరింపబడింది. ఆమె తన సోదరీమణులలాగానే క్షయవ్యాధితో పీడింపబడి 1849 వ సం॥ డిశంబరు 19 న హేవర్త్‌లో మరణించింది. □

# బామ్మగారి పేజీ



**ఎస్. కె. సుబ్బలక్ష్మి, హైద్రాబాదు**

మా అబ్బాయి వయస్సు 16 సం॥లు. వాడు సన్నగా వుంటాడు. రోజూ కోడిగుడ్డు ఇస్తే బలం వస్తుందని కొందరు చెప్పారు. సరే అని కొన్నిసార్లు కోడిగుడ్డుని పాలలో కొంచెం చెక్కెర వేసి కలిపి ఇచ్చేను. అయితే ప్రతిసారి అది తాగిన ఐదు నిముషాలకల్లా 'అమ్మా కడుపులో తిప్పుతోంద'ని అంటాడు. అట్లా ఐదు నిముషాలు కడుపు పట్టుకుని మెలికలు తిరిగిపోయి, తరువాత మొత్తం వాంతి చేసుకుంటాడు. దయచేసి ఇట్లా ఎందుకు అవుతోందో చెబుతారని ఆశిస్తున్నాను.

అది అబ్బాయికి పడడం లేదన్న మాట. పడకపోయినపుడు, వెంటనే ఆపేయండి. పాలల్లో కలపకుండా గుడ్డు ఉడికించి—ఇచ్చి చూడండి.

**కె. జి. సరళకుమారి, కుప్పం**

రాత్రి పడుకోబోయేముందు దైవాన్ని ధ్యానిస్తూ నిద్రించమన్నారు. ఎందుచేతనండి?

దైవ ధ్యానం రాత్రే కాదు. వీలైనపుడల్లా చెయ్యమన్నారు. నిద్రించే ముందు విధిగా చెయ్యమన్నారు. ఎంచేతంటే, 'నిద్ర' అనేది-'సగం మరణం' లాంటిది. ఒంటి మీద స్పృహ వుండదు. అలాంటి సమయాల్లో ఎలాంటి కీడు అయినా జరగవచ్చు. అందువల్ల ఏ కీడూ రాకుండా చెయ్యమని దైవాన్ని ప్రార్థించమన్నారు.

కొందరు తులసి పూజానంతరం కొన్ని బియ్యపు గింజలను పక్షులకోసం తులసికోటలో వేస్తుండడం నేను గమనించాను. ఇలా ఎందుకు వేస్తుంటారు?

మీరే చెబుతున్నారుగదమ్మా—పక్షుల కోసం అని. అంతే!

**శుభసుభాన్, గిద్దలూరు**

ఎక్కడికైనా ప్రయాణమైపోయేటప్పుడు ఎవరైనా తుమ్మితే కొద్దిసేపు ఆగి వెళ్తారు. అలా ఆగి వెళ్ళడం దేనికి?

తుమ్ము అపశకునం - అని ఒక నమ్మకం. ఈ నమ్మకానికి ఆధారాలు ఏమీలేవు. తుమ్మడం అనారోగ్యానికి ఒక లక్షణం గనక, అది ఏదైనా కీడు తెస్తుందేమోనన్న సందేహంతో-తుమ్మిన వెంటనే బయల్దేరరు.

**యల్. రాధారమణి, గూడూరు**

పరశురామావతారము కూడా దశావతారములలో ఒక అవతారము కదా! ఆ పరశురాముడు కృష్ణావతారములో ఎలా వుంటాడు? కృష్ణావతారములోని పరశురాముడు, దశరధ మహారాజు కాలములోని పరశురాముడు, దశావతారములలోని పరశురాముడు వీరంతా ఒకటేనా? లేక వేరువేరుగా వున్నారా?

పురాణాల ప్రకారం-పరశురాముడు ఒక్కడే. తండ్రి దగ్గర వరం పొందినవాడు కావడం వల్ల, చిరకాలం బ్రతికినట్టు పురాణాలు చెబుతాయి. పరశురాముడు విష్ణువు అంశంతో పుట్టినవాడు. అంచేత, విష్ణువు అవతారం చాలించినా, అతను మాత్రం వుండగలిగాడని!

**వి. కనకదుర్గ, చెరుకుపల్లి**

పెండ్లికాని పిల్లలు వివాహాది శుభకార్యాలలో అక్షింతలు వేసి దీవించకూడదు అంటారు. కారణం?

చిన్నవాళ్లు పెద్దవాళ్ళ మీద అక్షంతలు వేసి, దీవించకూడదు గదా - అందుకని! అయితే, పెళ్లి కాకపోయినా వధూవరుల కంటె వయసులో పెద్దవాళ్ళయితే, తప్పకుండా ఆశీర్వదించవచ్చు!

**కె. గీతాకుమారి, వెల్లూరు**

నాకు జుట్టు ఎక్కువగా ఊడిపోతుంది. తల దువ్వుకోవాలంటే భయమేస్తోంది. తలకు ఎప్పటినుంచో క్లినిక్ షాంపూ వాడతాను. నాలుగైదు రోజులకోమారు కొబ్బరినూనె రాస్తాను. జుట్టు చాలా ఎక్కువగా పోతోంది. దయచేసి దీనికేదైనా నివారణోపాయం చెప్పండి.

జుట్టు వూడిపోడానికి చాలా కారణాలు వున్నాయమ్మా. లోగడ నేను వివరంగా చెప్పాను. ముఖ్యంగా - వారనికోసారయినా తలకి నూనె పెట్టుకుని తలంటుకోవాలి. తలకి కొబ్బరినూనో నువ్వులనూనో ఏదో ఒకటి రాసుకోవాలి గాని, ఎప్పటికప్పుడు నూనెలు మారుస్తూవుండకూడదు. షాంపూలు ఎక్కువగా వాడకుండా వుండడం మంచిది. మందార పువ్వుల నూనె కొంతకాలం వాడి చూడండి. అన్నింటికంటె ముఖ్యమైనది—మీ తల్లో పేలు, చుండు లేకుండా చూసుకోండి—ముందు!

**కె. జి. సరళకుమారి, కుప్పం**

'సున్నిపిండి' చర్మ సౌందర్యానికి ఎంతో మేలు చేస్తుందని చాలామంది అంటారు కదా! సున్నిపిండిలో ఏవేవి, ఎంతెంత పాళ్లల్లో, ఎలా వేసి తయారు చెయ్యాలో మా ప్రాంతం వైపు ఎవరిని అడిగినా వివరంగా తెలుపలేకపోతున్నారు. మీకు తెలిస్తే దయచేసి తెలుపండి.

సున్నిపిండి అంటే పెసరపిండి. పొట్టుతో వున్న పెసలులో, గసగసాలు కలపండి. (పెసలు అర కిలో వున్నట్టయితే, గసగసాలు నూరు గ్రాములుండొచ్చు) రెండింటినీ కలిపి మర పట్టించండి. అంతే! అలాగే సెనగల్ని పిండి పట్టించి కూడా కొందరు వాడతారు. ㅁ



మహావీర జయంతి
(మార్చి ఇరవైతొమ్మిది)
పర్వదిన సందర్భంగా
జైన ఆలయాల
విశేషాలను
ఇక్కడ వివరిస్తున్నాము.



## మన దేవాలయాలు:

జైనమతం నాస్తికమతం. నాస్తికులకు సవాలక్ష నిర్వచనాలున్నాయి. దేవుణ్ణి ఒప్పుకోని వాళ్లు నాస్తికులు అని కొందరంటే వేదాలను వ్యతిరేకించినా నాస్తికులే అని మరి కొందరంటారు. ఈ రెండు విధాలా జైనమతం నాస్తికమే. అంతే కాదు. మనదేశంలో మనిషికి విలువనిచ్చి మానవతకు పెద్ద పీట వేసిన మొదటి మతం కూడా జైనమే.

మానవాభ్యుదయానికి దోహదం చేసే మంచి విషయాలను గాలికి వదలి బలులు ప్రధానంగాగల యజ్ఞయాగాది క్రతువులకు, వర్ణవివక్షతకు అగ్ర సింహాసనం అప్పగించి వేదపండితులు ఊకను దంచడం ప్రారంభించిన కాలఘట్టంలో వైదిక మతానికి వ్యతిరేకంగా చెలరేగిన తిరుగుబాటు మతాలు-జైనం, బౌద్ధం అని కొందరి అభిప్రాయం. వేద ప్రమాణాలను వ్యతిరేకించినప్పటికీ మన దేశంలో ఇంకా ప్రాచుర్యంలో వున్నది కూడా ఒక్క జైనమే.

వేదాలను వ్యతిరేకించడమే ప్రధాన ఉద్దేశం కాదు. నిజానికి వేదాలకన్నా సనాతనమైనవి జైన సిద్ధాంతాలు అని కొందరు వాదిస్తారు.

జైనమతానికి మూల పురుషుడయిన ఋషభ దేవుని ప్రస్తావన ఋగ్వేదంలో వుంది. ఇరవై నాలుగు తీర్థంకరులలో మొదటివాడాయన. ఇరవై నాల్గవ తీర్థంకరుడు వర్ధమాన మహావీరుడు. అంతకు ముందున్న సిద్ధాంతాలను సంస్కరించి జైనమతానికి పునరుజ్జీవనం కల్గించిన వర్ధమాన మహావీరుడు క్రీ. పూ. ఆరవ శతాబ్దికి చెందినవాడు.

క్రీ. పూ. ఆరవశతాబ్దం లోనూ దానికి కొంచెం అటూ ఇటుగా ప్రపంచం నాలుగు చెరగులా-మానవ జీవితాలను గాఢంగా పరిశీలించి సత్య జ్యోతులు వెలిగించిన మహా మహులు ఎందరో ఆవిర్భవించారు. చైనాలో తత్వవేత్త కన్ఫ్యూషియస్;



# జైన ఆలయాలు



ఇరాన్‌లో జరాష్టర్; గ్రీకు దేశంలో— ఎవరో ఏదో చెప్పారని గుడ్డిగా ఆచరించకుండా ప్రతి విషయాన్ని ఎందుకు? ఏమిటి? అని హేతుబద్ధంగా ఆలోచించాలని యువతరాన్ని ఉద్బోధించి అందుకోసమే తన ప్రాణాలను అర్పించిన మహామనీషి సాక్రటీస్; ప్లాటో మొదలైన తత్వవేత్తలు మనిషి ఆలోచనలకు నూతన దృక్పథాలను ప్రసాదించారు. ఆ కాల ఘట్టంలోనే మన దేశంలో అహింసా జ్యోతులు వెల్గించారు — మహావీరుడు, గౌతమ బుద్ధుడు.

కడుపు కోసం కాషాయం కట్టినవాడు కాదు మహావీరుడు.

ఈనాటి బీహార్‌లో వుంటున్న నాటి మగధ దేశానికి రాజైన సిద్ధార్థుని రెండవ కుమారుడు వర్ధమానుడు. కన్నవాళ్ళు కాలం చేశాక అన్న నందివర్ధనునికి రాజ్యాభిషేకం జరిగింది. ఆ తర్వాత పెద్దల అనుమతితో ముప్పైయవయేట రాజభోగాలను భార్యా పిల్లలను వదలి సన్యాసం స్వీకరించాడు. పన్నెండు సంవత్సరాలు తీవ్రమైన తపస్సు చేసి తనలోని నైచ్య ప్రవృత్తిని నాశనం చేసి రాగద్వేషాలను జయించి 'జినుడు'గా 'మహావీరుడు'గా పేరు పొందాడు.

తను పయనించిన మార్గాన్ని, అనుష్ఠించిన నియమావళిని సమ్యక్ దర్శనం, సమ్యక్ జ్ఞానం, సమ్యక్ చారిత్రం అన్న త్రిరత్నాలుగా క్రోడీకరించి తన అనుయాయులకు ఉపదేశించి 'తీర్థంకరు'డయ్యాడు!

ఆధ్యాత్మిక జీవనానికి జీవనాడి విశ్వాసం. అందువల్ల తీర్థంకరుల బోధనలలో అచంచలమైన విశ్వాసం కల్గివుండడం సమ్యక్ దర్శనం. బోధనలలోని సత్యాలను సమూలంగా ఆకళింపు చేసుకోడం సమ్యక్ జ్ఞానం. తెలుసుకున్నవాటిని అనుదిన జీవితంలో ఆచరించడం సమ్యక్ చారిత్రం. ఆధ్యాత్మిక పరిణతికి కొలమానం; మనిషిలోని అసలు మనిషిని బట్టబయలు చేసేది మనిషి అనుదిన ప్రవర్తన. అందువల్ల ఆత్మవికాసానికి అనుదినం ఆచరించవలసిన పంచ మహావ్రతాలను ఆదేశించాడు మహావీరుడు.

తనకు తెలిసినది మాత్రమే పరమసత్యం; మిగతావన్నీ అబద్ధాల అంబారాలు అని తీసి పారేయడం—నలుగురు గుడ్డివాళ్లు ఏనుగు ఆకారాన్ని నాలుగు విధాలుగా వివరించినట్లే అవుతుంది. పరిపక్వత చెందిన ఆత్మలకు మాత్రమే పరిపూర్ణ జ్ఞానం సాధ్యం. అంచేత బహుముఖమైన సత్యాన్ని విశాల దృక్పథంతో బహుజనామోదయోగ్యంగా చూడాలన్న అనేకాంతవాదాన్ని ప్రపంచానికి అందించినవాళ్ళు తీర్థంకరులు.

తీర్థంకరులలో కొందరికి ఆసేతుహిమాచలం అక్కడక్కడా—ప్రకృతిదృశ్యాల అందాలకు అందం సమకూర్చేవిధంగా ఆలయాలు నిర్మించబడ్డాయి. రాజస్థాన్‌లోని (మౌంట్) అబూగిరి జైనులకు ప్రధానక్షేత్రం. ఆ రాష్ట్రంలోనే వున్న రణక్‌పూర్, జైసాల్‌మర్; గుజరాత్ రాష్ట్రంలోని ఎల్లోరా; బీహార్‌లో వైశాలి, రాజ్‌గిరి, పావపురి మొదలైన చోట్ల జైనులకు ముఖ్యమైన ఆలయాలు వున్నాయి.

జైన ఆలయ నిర్మాణ విధానంలో ముఖ్యంగా రెండురకాలు వున్నాయి. మామూలు గుళ్ళు బస్తీ రకానికి చెందినవి. కొండలమీది బయలుప్రదేశాలలో తీర్థంకరుల శిలావిగ్రహాలు ప్రతిష్ఠించడం బెట్టా రకానికి చెందినవి. కర్ణాటకలోని శ్రావణబెళగొళలోని గోమతేశ్వర ఆలయం ఈ కోవలోనిది. గోమతేశ్వరుడు మొదటి తీర్థంకరుడైన ఋషభదేవుని కుమారుడు. రెండవ తీర్థంకరుడు. ఐదువందల అడుగుల ఎత్తు 'వింధ్యగిరి' మీద ఏభైఏడు అడుగుల ఎత్తులో వున్న ఈ బ్రహ్మాండమైన బాహుబలివిగ్రహం-ఏటు నుంచి చూసినా దాదాపు పదిహేనుమైళ్ళ దూరానికి కనబడుతుంది.

మహావీరుని స్వచ్ఛమైన అహింసా సిద్ధాంతాలకు ప్రతీకలా అన్నట్టు-కలకత్తా, బొంబాయి మద్రాసు నగరాలలో—పాలరాతితో నిర్మింపబడిన ఆలయాలు ఎంతో ఆహ్లాదాన్ని కల్గిస్తాయి. దక్షిణాది దేవాలయాల్లా ఆకాశంతో సరసాలాడకపోయినప్పటికీ— ఈ గుడులలోని ప్రతి అడుగూ అపురూప శిల్ప సౌందర్యంతో అలరారుతోంది!

ఈ ఆలయాల దర్శనం వల్ల తీర్థంకరుల బోధనలు, అహింస ఆధారంగాగల పంచమహావ్రతాలను తుచ తప్పకుండా ఆచరించడం అందరికీ సాధ్యం కాకపోవచ్చు. కానీ ఎదుటివాళ్ళూ మన లాంటివాళ్ళే అన్న కనీస జ్ఞానంతో మెలగడం— కొంత ప్రయత్నిస్తే ప్రతి ఒక్కరికీ సాధ్యమే. ఈ భావం అందరిలో ఏర్పడిన మరుక్షణమే ఈ ప్రపంచం ఆనందధామం కాకపోవచ్చు. కాని తప్పకుండా అందరికీ నివాసయోగ్యం అవుతుంది!

## ఎంబ్రాయిడరీ:





ఫొటోలో కనిపిస్తున్న చీరలేసును (బోర్డరు) టాటింగ్ అంటారు. టాటింగ్‌ను అల్లి చీరలకు, కర్చీఫ్‌లకు, గౌనులకు వేసుకోవచ్చును. ఓపిక ఉంటే టీసెట్ కూడా చేసుకోవచ్చును. ఈ రెండు లేసుల మధ్య కనిపిస్తున్న హంసల జంటను షేడో వర్క్ చేస్తే చీరకి చాలా అందం వస్తుంది. ముందుగా టాటింగ్ అల్లే విధానం తెలుసుకుందాము.



కావలసిన వస్తువులు : టాటింగ్ షటిల్ 1, నేవీ బ్లూ టాటింగ్ బాల్స్ 8. ఈ వస్తువులు దారాలు అమ్మే షాపులో దొరుకుతాయి. దారాన్ని షటిల్‌లో చుట్టాలి. అంటే, షటిల్ మధ్య భాగం చుట్టూ దారాన్ని చుట్టాలి. (1 వ బొమ్మలో చూపిన విధంగా).



1 వ చిత్రం

టాటింగ్ అల్లే విధానం : షటిల్‌ని కుడిచేత్తో పట్టుకొని, సుమారు 15 అంగుళాల పొడవుగల దారాన్ని బయటకు తీయాలి. ఇప్పుడు 2 వ బొమ్మలో చూపిన విధంగా దారాన్ని ఎడమచేత్తో



2 వ చిత్రం

పట్టుకోవాలి. అంటే చివరి మూడు వేళ్ళ చుట్టూ దారం తిప్పుతూ, బొటనవేలూ, మరియూ చూపుడు వేలుతో దారాన్ని పట్టుకోవాలి. ఇప్పుడు కుడి చేతిలోని షటిల్‌ని ఎడమచేతిలో ఉన్న దారం క్రింద నుంచి తీసి, అప్పుడు వచ్చే ఖాళీలో నుంచి మళ్ళీ షటిల్ పోనిచ్చి, ఎడమచేతి మధ్యవేలుతో ముడి వేయాలి. ఇప్పుడు మొదటి ముడి వస్తుంది. ఇదే విధంగా షటిల్‌ని ఎడమచేతి దారం పైనుంచి క్రిందకు పోనిచ్చి, ఎడమచేతి వేలితో మొదటి ముడివలె రెండవముడి వేయాలి. ఇప్పుడు ఈ రెండు ముళ్ళూ కలిపితే డబుల్ స్టిచ్ అంటారు. (3 వ చిత్రం చూస్తే ఎలా వస్తుందో అర్థం అవుతుంది.













3 వ చిత్రం

ఈ విధంగా అల్లితే టాటింగ్ అల్లిక చాలా వరకూ వచ్చినట్లే. ఇంకా లూపులూ, జాయినింగ్‌లూ చెయ్యవలసి ఉంది.

లూప్ వేసే విధానం : మొదటి ముడి వేసే టప్పుడు, దారాన్ని బిగువుగా లాగకుండా (4 వ చిత్రం) కొంచెం వదులుగా ఉంచాలి. ఇప్పుడు



4 వ చిత్రం

రెండవ ముడి గట్టిగా వేస్తే, మధ్యలో కొంచెం ఖాళీ వస్తుంది. దీన్నే లూప్ అంటారు (5వ చిత్రం).



5 వ చిత్రం



షాడోవర్క్ చేసే విధానం







జాయినింగ్ చేసే విధానం : ఎడమచేతి వేలి మీద దారాన్ని లూపులో నుంచి పిన్‌తో గాని క్రోషియోసూదిల్‌తో గానీ పైకి లాగాలి. ఇప్పుడు దారంలోనుంచి షటిల్‌ని తీసి ఎడమచేతి మధ్య వేలితో నెమ్మదిగా దారాన్ని బిగించాలి. ఇప్పుడు



6 వ చిత్రం

రెండవముడి వేస్తే జాయినింగ్ పూర్తవుతుంది (6 వ చిత్రం).

చీరపై డిజైను వేసే విధానం : 5 డబుల్ స్టిచెస్ తరువాత ఒక లూపు, ఈ క్రమంలో మొత్తం 20 డబుల్ స్టిచెస్ వచ్చేవరకూ వెయ్యాలి. (అంటే మొత్తం 3 లూపులు వస్తాయి) ఇప్పుడు రెండు కొసలూ ఎడమ చేత్తో పట్టుకుని కుడి చేత్తో షటిల్ దారాన్ని గట్టిగా లాగాలి. ఇప్పుడు గుండ్రంగా రింగ్ తయారవుతుంది. (షటిల్ దారాన్ని ఎప్పటి కప్పుడు కావలసినంత విప్పి తీసుకోవాలి) ఇప్పుడు మొదటి రింగుకు అదే విధంగా ఇంకొక రింగ్ వెయ్యాలి. తరువాత 3 వ రింగ్ మొదటి రింగ్ ప్రక్కన వెయ్యాలి. అయితే, మొదటి 5 డబుల్ స్టిచెస్ వేసిన తరువాత మొదటిరింగ్ చివరి లూప్‌తో కలపాలి. ఇదే విధంగా ఒక రింగ్ పైకి, ఒక రింగ్ క్రిందకి, వేస్తూ పోతే చీరపై డిజైన్ తయారవుతుంది. 15 మీటర్లు అల్లితే ఫొటోలో చూపిన విధంగా చీరంతా డబుల్ బోర్డరు వేసుకోవచ్చు. ఈ లేసును చీరపై టాకాలు వేస్తూ అతకాలి. షటిల్‌లో దారం అయిపోగానే రింగు ప్రక్కన కొత్త షటిల్ దారాన్ని ముడి పెట్టాలి. ఇప్పుడు ఈ రెండు లేసుల మధ్య హంసలను షేడోవర్క్ ఎలా చెయ్యాలో తెలుసుకుందాం.

కావలసిన దారాలు :

ఏంకర్ — 0324 (6 విచ్చులు)
ఏంకర్ — 065 (12 విచ్చులు)
ఏంకర్ — 0237 (6 విచ్చులు)

ముందుగా చీరపై, హంసల జంటల మధ్య అర మీటరు దూరం ఉండేటట్టుగా ట్రేసింగ్ తీయ్యాలి. బొమ్మలో చూపిన విధంగా రంగు దారాలు ఉపయోగిస్తూ క్రింద చూపిన విధంగా షేడోవర్క్ చెయ్యాలి.




—దండు విజయలక్ష్మి

# రంగులతో జాగ్రత్త!



అందమైన అద్దాల అలమరలో దొంతర దొంతర్లుగా అమర్చబడ్డ రంగురంగుల మిఠాయిలు చూస్తూంటే, నాలుకపై నీళ్ళూరుతాయి. సహజంగా, ఈ తినుబండారాలు ఇంతటి గాఢమైన రంగులు కలిగి వుండవు. తినే పదార్థాల్లో మామూలుగా కలిపే రంగులకు బదులుగా వ్యాపారస్తులు చౌకగా దొరికే బట్టల రంగులను (DYES) మిఠాయిలు, పప్పు ధాన్యాలు, మసాలా ద్రవ్యాలు, ఐస్‌క్రీమ్, శీతల పానీయాలు తదితర ఆహారపదార్థాల్లో కలుపుతున్నారు. బట్టల రంగులు కేవలం రంగులు అద్దటానికే ఉపయోగపడతాయి. కాని తినేందుకు మాత్రం పనికిరావు. ఈ రంగులు కలిపిన ఆహార పదార్థాలు .తింటే, అవి అనేక రుగ్మతలకు హేతువులై మానవ శరీరంలో అవకతవకలు కలిగిస్తాయి. ఈ రంగులు చివరకు ప్రాణాలను సైతం బలిగొనవచ్చును.

ప్రభుత్వం వారు ఈ రంగులపై అనేక పరీక్షలు జరిపిన పిదప, కొన్ని రంగులు తినేందుకు పనికి వస్తాయని మరికొన్ని తినేందుకు పనికిరావని నిర్ధారించారు. పనికిరాని రంగులు హాని కలిగిస్తాయి గాబట్టి వాటిని ఆహారపదార్థాల్లో కలపకూడదనే చట్టాన్ని ప్రభుత్వం ప్రవేశపెట్టింది. ఈ చట్టాన్ని ఉల్లంఘించిన వారికి ప్రస్తుతం కఠిన శిక్షలను అమలు పరుస్తున్నారు.

నిషేధింపబడ్డ రంగుల్లో ముఖ్యంగా పేర్కొనబడిన రంగు, పసుపువర్ణంగల "మోటానీల్ ఎల్లో". ఈ రంగు పెట్రోలుత్పత్తి లో తయారైన 'కోల్ టార్' నుండి తయారుచేయబడింది. 'మోటానీల్ ఎల్లో' రంగు గోధుమ, మైదా, శనగపిండితో తయారుచేసే తినుబండారాల్లోనూ, పాలతో చేసే 'కోవా' 'కలాకంద్' లాంటి మిఠాయిల్లోనూ, కిళ్ళీల్లో వాడే రకరకాల మసాలాల్లోనూ, నమిలే పొగాకు, జర్దా మరియు హొటళ్ళల్లో 'బిర్యాని' మొదలగువాటిలోనూ విరివిగా వాడుతారు. కంది పప్పుకు మంచి రంగు వచ్చేందుకు కూడ ఈ రంగు పూస్తారు. కొనుగోలుదార్లు రంగు పూసిన పప్పుల మెరుపు - తళుకులకు మోసపోయి అసలు పప్పుకు బదులు, ఈ పప్పులనే కొనడం జరుగుతుంది. పుచ్చిపోయిన పసుపుకొమ్ములకు కూడా ఈ రంగును పూస్తారు. అధిక ధనార్జనపరులైన వ్యాపారస్తులు డాల్డా, మార్గరిన్ లాంటి వనస్పతులకు 'పెరుగు' కలిపి బాగా వేడి చేస్తారు. వేడి చేయడం వల్ల వనస్పతి కరిగి పెరుగుతో బాగా కలిసిపోయి రవ్వ రవ్వలుగా మారుతుంది. ఈ మిశ్రమానికి 'మోటానీల్ ఎల్లో' రంగును కలుపుతారు. అందువల్ల వనస్పతి అసలు నెయ్యిలా, రవ్వరవ్వలుగా లేత పసుపు వర్ణంలో చాల ఆకర్షణీయంగా కనబడుతుంది. నిషేధింపబడ్డ ఈ రంగును సేవించడం వల్ల పురుషబీజకోశాలు (TESTES) టిష్యూలు దెబ్బతింటాయి. శుక్లకణాల (SPERMS) ఉత్పత్తి క్రమంగా సన్నగిల్లుతుంది. చివరికి పురుషులు నపుంసకులుగా మారే ప్రమాదం కూడా వుంది.

కొంచెం గోరువెచ్చని నీటిలో కొద్దిగా 'తినుబండారం'ను తీసుకొని, దానికి కొన్ని చుక్కల నిర్జల హైడ్రోక్లోరిక్ ఆమ్లం వేస్తే 'ఊదారంగు' వస్తే, అందులో 'మోటానీల్ ఎల్లో' కలుపబడిందని నిర్ధారణ చేయవచ్చును.

సుడాన్-III అనే నిషేధింపబడ్డ రంగు గాఢమైన ఎరుపు రంగును కలిగివుంటుంది. ఈ రంగు క్యాన్సర్ వ్యాధిని కలుగచేస్తుంది. ఈ రంగును సామాన్యంగా నాణ్యతలేని మిరపకాయలకు పూస్తారు. అందువల్ల ఇవి నాణ్యతగలవాటివలె మంచి రంగుతో మిసమిసలాడుతుంటాయి. రంపపు పొడి కలిపిన కారంలోనూ, హల్వాలు మరియు కొన్నిరకాల శీతలపానీయాల్లో కూడ ఈ నిషేధింపబడ్డ రంగు కలుపబడుతుంది. ప్యారఫిన్ ద్రవంలో ముంచిన దూదిని రంగుపూసిన మిరపకాయలపై రుద్దితే, దూదికి ఎఱుపు రంగు అంటిందనుకోండి, ఆ కాయలకు ఖచ్చితంగా రంగుపూసినట్లే!

ఐస్‌క్రీమ్, షర్బత్తుల్లో నిషేధింపబడ్డ ఆరెంజ్ – II, రోడామైన్-బి, రంగులు కలుపుతారు. ఈ రంగులు మూత్రపిండాలు, కాలేయం మరియు ప్లీహంలో కురుపులను కలుగ చేస్తాయి. నిషేధింపబడ్డ రంగుల్లో మరికొన్ని కాంగోరెడ్, ఆరమైన్, మాలకైట్ గ్రీన్, లెడ్‌క్రోమైటు మరియు బ్లూ వి. ఆర్. యస్ ముఖ్యమైనవి.

'కాంగో రెడ్' రంగు మూత్రపిండాలకు సంబంధించిన 'హైడ్రో నెఫ్రాస్', మెదడుకు చెందిన 'హైడ్రో సెఫలస్' మరియు 'గ్లూకోమా' అనే కంటివ్యాధినీ కలుగచేస్తుంది. ఆరమైన్, రోడామైన్-బి, బ్లూ. వి. ఆర్. యస్ రంగులు రకరకాల క్యాన్సర్ వ్యాధులకు హేతువులు. మాలకైట్ గ్రీన్ రంగు వాడిపోయిన కూరగాయలకు పూస్తారు. ఈ రంగు ఊపిరితిత్తులు, కాలేయం మరియు ఛాతిలో వ్రణాలు కలిగిస్తాయి. ఎముకలు, చర్మం మరియు స్త్రీ బీజకోశం (OVARY) పై కూడ ఈ రంగు తన ప్రభావాన్ని చూపుతుంది. లెడ్ క్రోమైట్ రంగు రక్తవిహీనులను చేయడమే కాకుండా పక్షవాతం మరియు గర్భస్రావం కూడ కలుగచేస్తుంది.

అనుమతివ్వబడ్డ కొన్ని రంగుల వాడకం మోతాదు మించితే, అవి కూడ నిషేధింపబడ్డ రంగుల లాగే హాని కలుగచేస్తాయి. 'అమర్‌నాధ్' అనే అనుమతివ్వబడ్డ రంగును ప్రపంచంలో నేడు సుమారు అరవయి దేశాలవారు ఆహారపదార్థాల్లోనూ, మందుల్లోనూ మరియు కాస్మెటిక్స్‌ల్లో విరివిగా వాడుతున్నారు. పొరపాటున ఈ రంగు పరిమాణం మోతాదు మించితే విపరీత అనర్థాలకు దారితీస్తుంది. ఈ రంగు గర్భిణీ స్త్రీల్లో గర్భస్రావం

కలుగచేస్తుంది. మరికొంతమంది వనితల్లో చనుబాలు తయారుచేసే 'లాక్టేషన్' అనే ప్రక్రియకు అంతరాయం కలుగుతుంది. ఇంతేగాక వారిలో ప్రత్యుత్పత్తి శక్తి కూడ తగ్గిపోవచ్చును. ఈ రంగు అధికం కావడం వల్ల ట్యూమర్లు, క్యాన్సర్ వ్యాధి కూడ కలగవచ్చును.

ఎరిత్రోసిన్ మరియు పాన్‌ష్యూ-4 R అనే రంగులు ఎర్ర రక్తకణాల్లోని ఎర్రదనానికి అంశీభూతమైన 'హెమోగ్లోబిన్' విచ్ఛిన్నంచేసి, ఎర్ర రక్తకణాలను పాడుచేస్తాయి. ఎరిత్రోసిన్ వల్ల విరోచనాలు కూడ కలుగవచ్చును. 'సన్‌సెట్ ఎల్లో' రంగు విరోచనాలు మరియు 'ఇండిగో కారమైన్' చర్మంపై 'సార్కోమా' అనే ట్యూమర్లను కలుగచేస్తాయి.

ఈ రీతిగా మనం నిషేధింపబడ్డ రంగులతో పాటు అనుమతించిన రంగులు కూడా మోతాదుకు మించి కలుపబడ్డ ఆహార పదార్థాలు తినడంవల్ల అనేక వ్యాధులకు గురవుతున్నాం. కాబట్టి బజార్లో ఏదైనా వస్తువును కొనే ముందు, ఆ వస్తువు యొక్క ప్రచారాన్నిబట్టి గాని, పై మెరుగులకు మిడిసిపడిగాని నాణ్యతలేని మరియు కల్తీ పదార్థాలను కొనకుండా జాగ్రత్తగా మసలుకోవాల్సి వస్తుంది. ప్రభుత్వం వారిచే 'ఐ. యస్. ఐ' గాని, 'అగ్‌మార్క్' గుర్తులున్న వస్తువులను కొనడమే మంచిది. అంతేగాక చాలమటుకు, అంగళ్ళలో దొరికే పసుపు, కారం, మసాల, సాంబార్ పొడులు కొనడం మానాలి. ఇళ్ళల్లోనే వాటిని స్వయంగా తయారు చేసుకోవడం ఆరోగ్యానికి శ్రేష్టం. కంది, పెసర, శనగలాంటి పప్పు ధాన్యాలు ఉడికించే ముందు వాటిని బాగా కడగాలి. ఇలా కడగడం వల్ల వాటికి పూయబడ్డ రంగులు కొంత వరకూ తొలగిపోతాయి. చింతపండును కూడా వాడే ముందు నీళ్ళలో బాగా కడగడం మంచిది.

ఇటీవలే మద్రాసు విశ్వవిద్యాలయం వారు 'కిచన్‌కిట్' రూపొందించారు. ఈ కిచన్‌కిట్ ప్రయోగశాల వంటిది. ఇందులో కల్తీలు తెలుసుకునేందుకు అవసరమయే రసాయనాలు మరియు కావలసిన సామగ్రులూవుంటాయి. వీటివల్ల కొనబోయే ఆహార పదార్థాలు కల్తీవా? కావా? అని అక్కడికక్కడే పరీక్షించి, జాగ్రత్త పడవచ్చును. ఈ 'కిచన్‌కిట్లు' అతి త్వరలోనే బజార్లలో అమ్మకానికి వస్తాయని అనుకుంటున్నారు.

—చిలువేరు స్వరూప

## ఇంటి దగ్గర చెయ్యండి

## ముఖానికి పౌడర్

సౌందర్య సాధనాలన్నింటిలోకీ ముఖానికి రాసుకునే పౌడర్ చాలా ముఖ్యమైనదంటే అతిశయోక్తి కాదు. ఇంట్లో పిల్లలకూ, పెద్దలకూ అందరికీ అవసరం కనుక దీనిని ఇంట్లోనే తయారు చేసుకోవడం వలన డబ్బు ఆదాగా వుంటుంది. స్త్రీలు దీనిని తయారు చేయడం ఒక గృహపరిశ్రమగా తీసుకుంటే బాగా అమ్ముడయి, ఆర్థికంగా లాభాన్ని కూడా తెచ్చిపెడుతుంది.

తక్కువ ఖర్చుతో మంచి రకం ఫేస్ పౌడర్ తయారు చేసే విధానాన్ని ఇక్కడ వివరిస్తున్నాను. దీనికి కావలసిన వస్తువులు :— స్టీయటైట్ (Steatite) రెండు పౌండ్లు, బోరాక్స్ (Borax) $\frac{1}{4}$ అవున్సు, సెంటు (Scent) తగినంత.

స్టీయటైట్ అనబడేది ఒక విధమైన పిండి పదార్థం, ముఖచర్మానికి మృదుత్వాన్ని కలిగించే గుణం దీనికి వుంది. బోరాక్స్ అనబడేది క్రిమినాశిని మందుతో సమానమైనది. ఇది ముఖచర్మంలోకి సూక్ష్మక్రిములు ప్రవేశించడాన్ని అరికట్టడంతో పాటు ముందుగానే చర్మంలోకి చేరి నివాసం ఏర్పరచుకున్న సూక్ష్మక్రిములను నాశనం చేస్తుంది. సువాసనకోసం సెంటును ఉపయోగించాలి.

స్టీయటైట్ పిండి రసాయనములు అమ్మే షాపులలో చౌకధరకు లభిస్తుంది. ఈ స్టీయటైట్ పిండిని కొని బాగా జల్లించి శుభ్రం చేసి పెట్టుకోవాలి. దీనిలో కొద్దిగా పిండిని ఒక వైపు విడిగా తీసి పెట్టాలి. బోరాక్స్‌ను తెచ్చి బాగా మెత్తగా పొడికొట్టి పెట్టాలి. ఈ పొడిని స్టీయటైట్‌కు చేర్చి బాగా కలపాలి. ఈ మిశ్రమాన్ని ఓ వైపు వుంచాలి. ఇప్పుడు విడిగా తీసిపెట్టిన స్టీయటైట్‌ను తీసుకుని దానికి సెంటు వేసి బాగా కలిపి, దానిని పై స్టీయటైట్—బోరాక్స్ మిశ్రమానికి చేర్చి మొత్తాన్ని బాగా కలియపెట్టాలి. మరోమారు మొత్తం మిశ్రమాన్ని శుభ్రంగా జల్లించుకోవాలి. ముఖానికి రాసుకునే పౌడర్ తయారయిందన్నమాట.

ఇప్పుడు టాల్కం పౌడర్ తయారుచేసే విధానం తెలుసుకుందాం. దీనికి కావలసిన వస్తువులు :—

టాల్కం ఒక పౌండు, జింక్ ఆక్సైడ్ (Zinc Oxide) రెండు అవున్సులు, తగినంత సెంటు, కొద్దిగా బోరాక్స్.

టాల్కం అనబడే వస్తువు గడ్డలుగాను పొడిగా కూడా లభిస్తుంది. దానిని తెచ్చి బాగా మెత్తగా పొడికొట్టి పెట్టాలి. ఆ తర్వాత ఆ పిండిని జల్లించి శుభ్రం చేసుకోవాలి. ఈ టాల్కం పొడిలో కొద్దిగా ఒకవైపు తీసి పెట్టాలి. శుభ్రం చేసిన టాల్కంకు జింక్ ఆక్సైడ్ పొడిని చేర్చి బాగా కలపాలి. ఈ మిశ్రమాన్ని ఒక వైపు పెట్టాలి. ఇప్పుడు విడిగా తీసిపెట్టిన టాల్కం తీసుకుని దానికి సెంటును చేర్చి బాగా కలపాలి. ఈ సెంటు మిశ్రమాన్ని పై టాల్కం — జింక్ ఆక్సైడు మిశ్రమానికి చేర్చి మొత్తాన్ని బాగా కలపాలి. చివరగా బోరాక్స్ పోసి బాగా కలిపి, మరోమారు శుభ్రంగా జల్లించాలి. ఇదే టాల్కం పౌడర్.

ఈ టాల్కం పౌడర్, ఇందాక చెప్పిన ఫేస్ పౌడర్ చూడటానికి తెల్లగా వుంటాయి. తెలుపు కాకుండ రంగు చేర్చబడిన పౌడర్లు ఇప్పుడు విరివిగా అమ్ముడవుతున్నాయి. రంగులన్నింటిలోనూ లేత గులాబీరంగుగల పౌడర్‌కే గిరాకీ ఎక్కువగా వుంటున్నది. ఈ రంగు పౌడర్‌ను తయారు చేయడానికి స్టార్చ్ (Starch) అనే పిండి పదార్థాన్నే ఉపయోగించాలి. రంగు రావడానికి కొద్దిగా కార్మైన్ (Carmine) పొడిని కొన్ని చుక్కలు నీటితో కలిపి, దానిని బొట్టుబొట్టుగా స్టార్చికి చేరుస్తూ చేతితోనే బాగా నొక్కి కలుపుతూ వుంటే పౌడర్‌కు రోస్ కలరు వస్తుంది. రోస్ కలరు ఎక్కువగానో, తక్కువగానో వుండాలంటే దానికి తగినట్లుగా స్టార్చిని ఎక్కువతక్కువలు చేసి సరి చేయవచ్చును. ఈ విధంగా రంగు కలిగించబడిన పౌడర్‌ను బాగా జల్లించి తీసుకోవాలి. ఈ పౌడర్‌కు సువాసనను కలిగించడానికి రోస్ ఆటో (Rose Otto)ను తగినంత చేర్చి బాగా కలపాలి. ఏ సెంటు పడితే ఆ సెంటును ఉపయోగించ కూడదు. ఈ విధంగా తయారుచేయబడిన పౌడర్‌ను ప్లాస్టిక్ కవర్లలోకి పోసి వాటిని సీసాలలోకిగాని, అట్ట పెట్టెలలోకిగాని పెట్టి ప్యాక్ చేయాలి.

గమనిక : 1 పౌండు = సుమారు 453 గ్రాములు; 1 అవున్సు = సుమారు 28 గ్రాములు

—గార్ల సరస్వతి




## శరపంజర
(నవల)

[రచన : త్రివేణి; అనువాదం: శర్వాణి; పేజీలు: 168; వెల : రు. 3–50; ప్రచురణ : ఎమ్. శేషాచలమ్ అండ్ కో, మద్రాసు.]

"ఒకప్పుడు నాకు మతిభ్రమణం కలిగినమాట నిజమే! అంతమాత్రాన నాలో ఆశలన్నీ చచ్చిపోవాలా? నాకూ నల్గురిలా బ్రతకాలని వుంది. నా భర్తా, పిల్లలూ నన్ను కోరుకోవాలనీ, ప్రేమించాలని ఆశించటం తప్పా? చెల్లని నాణెంలా అందరూ నన్ను వదిలిపెట్టేశారు. ఎందుకని?"— ఇది కావేరి ఆక్రోశం.

మానసిక రుగ్మత కారణంగా మెంటల్ హాస్పిటల్లో చేర్పించబడ్డ కావేరి రెండేళ్ళ తర్వాత మామూలు మనిషిగా మారి క్రొత్త జీవితం మీద కొండంత నమ్మకంతో భర్త వెంట ఇంటికొస్తుంది. అప్పట్నించే కథ మొదలవుతుంది. "మునుపటిలా భర్త ఆమెను ప్రేమించాడా? పిల్లలు చేరువయ్యారా? అత్తగారు ఆదరించారా? స్నేహితులూ, బంధువులు అభిమానం చూపించారా?"— ఈ ప్రశ్నలకు సమాధానమే త్రివేణి విశిష్ట నవల 'శరపంజర'.

స్థిమితం కోల్పోయిన మనసుకి స్వస్థత చేకూర్చాల్సిన సంఘపు బాధ్యతని, ముఖ్యంగా భర్త, ఇంట్లో వాళ్ళ ప్రవర్తనని హెచ్చరించే ఈ నవల ప్రతివారూ తప్పక చదవదగ్గది.

చదువుతున్నంతసేపూ కావేరి గురించి జాలిపడ్తూ, మిగతా పాత్రల్ని అసహ్యించుకుంటే చాలదు.

మనోబలం లేని మనుషులకు మనం అందివ్వాల్సిన చేయూత గురించి ఒక్క నిముషం ఆలోచించగల్గితే ఈ రచనకు సార్థకత చేకూరుతుంది.

## 'పునర్జన్మ'
(నవల)

[రచన : త్రివేణి; అనువాదం: కళ్యాణి; పేజీలు: 179; వెల : రు. 6-00; ప్రచురణ : ఎమ్. శేషాచలమ్ అండ్ కంపెనీ, మద్రాసు.]

"'పిల్లి' అన్న మాటకు ప్రతిక్రియ 'కళ్ళు' అని కుసుమ ఎందుకన్నదో తెలుసా?" పిల్లికి పచ్చటి కళ్ళుంటాయి. మీకు పచ్చకళ్ళున్నాయి. కుసుమకు మీమీద కోపం వచ్చినప్పుడల్లా మిమ్మల్ని గుర్తుకుతెచ్చే పిల్లిని సుసాన్ అనే ఆంగ్లో–ఇండియన్ పిల్లని బాది, మిమ్మల్ని కొట్టిన తృప్తిని పొందేది."

"ఒక వ్యక్తికి పిచ్చిపట్టించేవారు ప్రత్యక్షంగా, పరోక్షంగా చుట్టూ వున్న వ్యక్తులు. ఆ వ్యక్తి మనసు, మనోదౌర్బల్యం పిచ్చికి ఓ పదిపాళ్ళు కారణమయితే, వాళ్ళు పెరిగిన వాతావరణం, ఆ సన్నివేశం చుట్టూ వున్న వ్యక్తులు, మిగతా తొంభై పాళ్ళు కారణమవుతారు." అన్న డాక్టరు మాటలు ప్రతివాళ్ళూ గుర్తుంచుకొని, తోటివాళ్ళతో కొంచెమైనా మృదువుగా ప్రవర్తించగల్గితే ఇంతమంది పిచ్చివాళ్ళు, ఇన్ని పిచ్చాసుపత్రులు తయారు కావు.

అమితగారాబంగా పెరిగిన కుసుమ తల్లి చనిపోవటంతో, సవతితల్లి పాలనలో పెరగాల్సి వస్తుంది. తండ్రి నిర్లక్ష్యం, సవతితల్లి అనాదరణలతో తీవ్రమైన మానసిక ఆందోళనను తట్టుకోలేక ఆమె పిచ్చిదవుతుంది. చివరికి పిన్ని తమ్ముడు రాజశేఖరం ప్రేమతో పునర్జన్మ ఎత్తుతుంది కుసుమ.

మానసిక శాస్త్రానికి సంబంధించిన ఈ నవలలో వున్నది కథ కాదు, జీవితం! అది రచయిత్రి ప్రతిభకు చక్కటి నిదర్శనం.

## గర్ల్ ఫ్రెండ్
[నవల]

[రచన : డాక్టర్ సి. ఆనందారామం; ప్రచురణ : యమ్. శేషాచలం అండ్ కంపెనీ, మద్రాసు-1; పేజీలు : 120; వెల : రూ. 4]

డబ్బూ, దసకం, బలగం వుండి మాయలూ, మోసాలూ చెయ్యగల 'పెద్దమనిషి' జయపాల్. వయసుమళ్ళినా గర్ల్ ఫ్రెండ్స్ గలవాడు. అతనికో కొడుకు నీరద్. తండ్రిని ఎదిరించి, హోటల్స్‌లో డాన్సులు చేస్తూ వుంటాడు. వేద అనే అమ్మాయిని తను అతనికి గర్ల్ ఫ్రెండ్‌గా వుంటే, ఉద్యోగం ఇస్తానని ఆమెను చేరదీశాడు జయపాల్. జయపాల్ కొడుకు, వేద చెల్లెలూ ప్రేమలో పడ్డారు. అది జయపాల్‌కు కిట్టలేదు. కొడుకు తెగించాడు. కొడుకు బుద్ధిమార్చుకుంటాడన్న ఉద్దేశంతో అతనికో పెద్ద హోటల్ కట్టించి ఇచ్చినా, తను వేద చెల్లెల్ని వివాహం చేసుకున్నట్టుగా ప్రకటించాడు. అది జయపాల్‌కు పెద్ద దెబ్బ.

అలా —

తండ్రి తాను చేసిన చెడ్డపన్లను సమర్థించుకుంటూ, కొడుకు చేసినది 'అన్యాయం' అంటాడు. నవలకి క్లైమాక్స్ కావాలి కాబట్టి, జయపాల్ దొంగమనిషి కాబట్టి, టేప్ రికార్డర్లు, టేప్ మాయంకావడం, రౌడీలు, రివాల్వర్లు, స్టంటులు ఇవన్నీ చోటు చేసుకున్నాయి. చివరికి తను తొలినుంచి ప్రేమిస్తున్న శ్రీనివాస్ అనే యువకుడి చేతిలో వేద -మరణిస్తుంది.

ఉత్సాహంగా సాగిపోతూ, ఆగనివ్వకుండా చదివించేస్తుందీ పుస్తకం.

## ఇలా ఎంతమందో
(నవల)

[రచన : దేవరాజు సీత; ప్రచురణ : ఎమ్. శేషాచలం అండ్ కంపెనీ, సికింద్రాబాదు; పేజీలు : 148; వెల : రూ. 3-50]

ఇది రచయిత్రి తొలి నవల. కొత్తల్లో ఉండే ఆవేశం, తెలిసినదంతా చెప్పేయాలన్న తపన ఈ నవలలో కనిపిస్తూనే ఉంది. కానీ, నవలకు కావలసిన ముఖ్యగుణం, చదివించే నేర్పు. అది ఉంది ఈ నవలకు.

రాయదలచుకున్న విషయం స్పష్టంగా చెప్పారు రచయిత్రి. ఈనాటి మధ్యతరగతి కుటుంబీకులు వ్యసనాలకు బానిసలై, సంసారాన్ని జీవితాల్ని పణంగా పెట్టి ఆడి అదృష్టమనే నీహారికల్ని వెంటాడి ఎలా అలసిపోతున్నారో చెప్పారు. చదువుతుంటే కొన్ని సంఘటనలు వెన్ను జలదరింప చేసేవిగా కూడా ఉన్నాయి.

మండుటెండలో, కేవలం చల్లటి నీళ్ళకు తప్ప చేతుల్లో డబ్బులు కూడా లేకుండా, మరో ఊరిలో ఉద్యోగం చేస్తూ భార్యను మర్చిపోయిన "భర్త" అనే అమానుషత్వం నిండిన మనిషి దగ్గరకు అభిమానధనురాలు ఇల్లాలు అయిన స్త్రీ నడిచి, దుఃఖపడుతూ వెళ్ళగానే, అతని బాధ్యతారహితత్వం మరొకసారి ఋజువైనప్పుడు ఆమె పడే తపన హృద్యమంగా చిత్రించారు.

మరొకచోట, ఎదిగిన ఆడపిల్లలు పక్క గదిలో ఉండగా, తాగి వచ్చిన కామాతురుడైన భర్తకు లొంగిపోవడం బాధ్యతగా భావించిన ఇల్లాలు పడే తపన, దుఃఖం, చదువుతున్నప్పుడు ఒళ్ళు జలదరిస్తుంది.

ఈమె మంచి భవిష్యత్తు ఉన్న రచయిత్రి.

పది గంటల ప్రాంతంలో డ్రాయింగ్ రూములోంచి ఎవరో అమ్మాయి గొంతు విన్పించినట్లయితే వంటింట్లోంచి వచ్చి తొంగిచూశాను. ఆయన ఎదురుగా ఎవరో అమ్మాయి కూర్చుని ఉంది. ఆయన చూస్తే బాగుండదని లోపలకు వెళ్ళిపోయాను.

ఒక గంట తర్వాత లోపలికి వచ్చి "వంటయిందా?" అన్నారు.

"ఆ" అన్నాను.

"అయితే అన్నీ టేబిల్ మీద సర్దేసి వెళ్ళు! మేము పెట్టుకుంటాం' అన్నారు.

ఈ కొత్త విధానం నాకు ఆశ్చర్యాన్ని కలిగించింది. కాని ఆయనకి ఎదురు చెప్పకూడదు. మారు మాట్లాడకుండా ఆయన చెప్పినట్లే చేశాను. అక్కణ్ణించి వచ్చి గదిలో కూర్చున్నాను.

వంటింట్లోంచి మాటలూ, పకపకా నవ్వులూ విన్పిస్తున్నాయి. అవన్నీ వింటోంటే నా మనస్సు భగభగమంటోంది. ఎవరా అమ్మాయి? ఆయనతో ఆ అమ్మాయికి అంత చనువు ఎలా వచ్చింది? ఆ పిల్ల ఆఫీసులో అందరితోనూ అలాగే ఉంటుందా? లేక ఆయనతోనే ఉంటుందా! వీళ్ళిద్దరిది కేవలం స్నేహమేనా? లేక ఇంకేదైనా వుందా! —

ఇవన్నీ నా మనస్సులో రేగినవి మాత్రమే. నేను వారినేమీ అడగదల్చుకోలేదు. వీళ్ళ వ్యవహారం ఎంతవరకూ వస్తుందో చూడదల్చుకున్నాను.

మూడు నెలలు గడిచాయి.

ఒకరోజు పడుకునే సమయంలో అన్నారు "జయా! నేను పద్మని పెళ్లి చేసుకోబోతున్నాను," అని.

నాకు షాక్‌లా తగిలింది ఆ మాట. వారింతకు తెగిస్తారని కలలో కూడా అనుకోలేదు!

"ఇది చాలా అన్యాయం" అని అరిచాను. వారు శాంతంగా "ఏది" అన్నారు.

"మీరు పెళ్ళి చేసుకోవడం."

"ఎందుకవుతుంది? నాకు పిల్లలు కావాలి" అన్నారు.

వారికి పిల్లలంటే ఇష్టం వున్నట్లు ఎప్పుడూ చెప్పలేదు. ఇదొక వంకేమో!

"దానికి నే నేంచెయ్యను? అది నా ఒక్కదాని మీదే ఆధారపడిలేదు. డాక్టరు దగ్గిరికి వెళ్లి ఇద్దరం పరీక్ష చేయించుకుందాం రండి!" అన్నాను బింకంగా.

ఆ మాటలతో ఆయనకి కోపం వచ్చింది. "నాకేం పట్టింది! నేను మగాణ్ణి. ఆ అవసరం నాకు లేదు."

"లేదూ! మరి పద్మని చేసుకుని కులుకుదామనుకున్నారా! మీరుండేది అరణ్యం కాదు. చుట్టూ సంఘం వుంది. నాకు విడాకులివ్వందే దాన్ని పెళ్ళి చేసుకోవడానికి వీలులేదు. తెలుసా?" అన్నాను ఆవేశంగా.

ఆయన నవ్వారు.

"విడాకులు ఎలా పుచ్చుకోవాలో నాకు తెలుసు" అని లైటు తీసి దుప్పటి ముసుగేసుకున్నారు.

నేను నా మంచం మీద వాలి కరువుతీరా ఏడ్చాను."

జయ ఆ పైన మాట్లాడలేకపోయింది. ఆమెను చూస్తోంటే నా మనస్సు ఏవిటోగా అయిపోయింది.

ఎంతో అణకువ, మర్యాద వుట్టిపడేట్టు కనిపించే మోహన్ ఇంత నీచుడా! అపురూపంగా ప్రేమించే భార్యను కాదని మరోదాన్ని చేసుకోడానికి సిద్ధపడడమా!

"అక్కయ్యా! రెండురోజులు నిద్రాహారాలకు దూరమయ్యాను. వారు అనుకున్నంత పనీ చేస్తారు. అప్పుడు నా గతి ఏమిటి?"

జయ కళ్ళ నుండి టపటపా నీళ్ళు రాలాయి.

అనునయంగా జయ చేతిని నా చేతిలోకి తీసుకున్నాను.

"అక్కయ్యా! ఇన్నాళ్ళూ ఆయన నీడలో వుండి, ఆయన చెప్పింది వింటూ, ఆయన కింత వండిపెడ్తూ, ఒక విధమైన జీవితానికి అలవాటు పడ్డాను. నాకు బ్రతుకు మీద ఎటువంటి మమకారం గానీ, కోరికలు గానీ, ఏవేవో చెయ్యాలనే ఉత్సాహం గానీ లేవు. ఇప్పుడు ఆయన నీడలోంచి వచ్చి విడిగా జీవించాలనే కోరిక నాకు లేదు. ఆయన గనుక విడాకులిస్తే నాకు చావడమే శరణ్యం. నేను చావడమో! బ్రతకడమో! అది నీ చేతుల్లోనే వుంది అక్కయ్యా!"

జయ కథ వింటోంటే నా చరిత్రపుటలు నా కళ్ల ముందు వుంచిన అనుభూతి కలిగింది.

లోకంలో స్త్రీల కన్నీటిగాథలన్నీ ఒకేలా వుంటాయంటారు. ఇదే కాబోలు. జయ, పద్మని పెళ్ళి చేసుకుంటే చావాలని నిర్ణయించుకుంది.

కానీ నాకు మాత్రం చావడం ఇష్టంలేదు! ఈ అందమైన ప్రపంచాన్ని వదిలి వెళ్ళలేను. భగవంతుడు ప్రత్యక్షమై వరమిస్తానంటే — ఈ ప్రకృతిలోని అందాల్ని చూస్తూ సృష్ట్యంతం వుండ



ఖిస్తే చాలంటాను.

లోకంలో కాస్త నిరాశకలిగితే చాలు మనుషులు ఆత్మహత్య చేసుకుంటారు. చిన్న కష్టం వస్తే భరించలేరు. చిన్న సమస్యకి సహించలేరు.

అటువంటివి విన్నప్పుడు వారి పిరికితనానికి అసహ్యమేస్తుంది. వారి అజ్ఞానానికి జాలివేస్తుంది. ఏ కోరికలు తీరకపోతేనేం? ఏ ఆశలు నెరవేరకపోతేనేం? చీకటి ముసుగుల్ని తొలగించుకొస్తున్న సూర్యోదయాన్ని చూస్తూ బ్రతకూడదా!

చంద్రకాంతిలో నవ్వే పారిజాతాల్ని చూస్తూ బ్రతకూడదా!

నిశీధిలో, నీరవనిశ్శబ్దంలో —

నేను ఒక్కదాన్ని మేల్కొని గాలి తెచ్చే సుగంధాన్ని పీలుస్తూ, ఏవేవో స్వర్గాలు చూస్తూ గడపిన క్షణాలు అనేకం వున్నాయి.

"ఏమిటక్కయ్యా! ఆలోచిస్తున్నావు?"

తలెత్తి చూశాను.

కాలం మారుతున్నా, స్త్రీల కన్నీళ్లు అలాగే నిలిచి వున్నాయి.



# ఈ దీపం ఆరిపోదు

## విన్నకోట సుశీలాదేవి

పెద్ద కథ:

"జయా! పద్మ నాకు తెలుసు. నీ కెటువంటి అన్యాయం జరగదు. మాటిస్తున్నాను. నువ్వు నిశ్చింతగా ఉండమ్మా" అన్నాను దృఢంగా.

జయ నా రెండు చేతులూ పుచ్చుకుని కళ్ళకద్దుకుంది ఆనందంగా.

"అక్కయ్యా! మీరెంత మంచివారు. నా జీవితాన్ని ఒడ్డున పడేశారు. మీ మేలు జన్మలో మరిచిపోలేను. నా కాపరం నిలబెట్టినందుకు రోజూ మిమ్మల్ని తలచుకుని దీపం వెలిగించుకుంటాను."

జయ ఆనందంతో, ఆవేశంతో మాట్లాడుతోంది.

ఆమె ముఖం వెలిగిపోతోంది.

లేచి నుంచుంది.

"వస్తానక్కయ్యా! ఆయన వచ్చే టైమయింది. మళ్ళీ కలుస్తాను," అని చటుక్కున వంగి నా కాళ్ళ మీద చేతులుంచింది.

"ఛ! ఏం పని జయా!" అంటూ ఆమెను లేవనెత్తాను.

"వస్తానక్కయ్యా!" అంటూ జయ తృప్తిగా వెళ్ళిపోయింది.

వెళుతున్న జయని చూస్తూ నిట్టూర్చాను. ఏం ఆడవాళ్ళు! వీళ్ళ కోరికలు ఎంత అల్పమైనవి. భర్త ఎక్కడెక్కడో తిరిగి ఇంటికొచ్చి ప్రేమగా తమను పలుకరిస్తే చాలు. ఆయన తప్పులన్నింటినీ క్షమించేస్తారు. అన్నీ మర్చిపోతారు.

చిత్రం ఏమిటంటే! చదువు స్త్రీ బుద్ధికి పదును పెట్టిందేగాని, మనస్సుని వికసింపచేయలేదు. అయినా జయకి అంత నమ్మకంగా మాటిచ్చాను కదా నేను పద్మని ఒప్పించగలనా!

పద్మ నా మాట వింటుందా! కాదంటే.... ఉహూ అలా అనదు. పద్మ నాకు చిన్నప్పట్నించీ తెలుసు. చాలా మంచిపిల్ల. ఏదో తెలియక తొందరపడి వుంటుంది. నేనంటే చాలా ఇష్టం ఆ పిల్లకి. నే చెప్తే కాదనదు. కాదంటే.... నేను ఎంత అవమానానికి గురౌతానో! అసలు జయకి ఏం సమాధానం చెప్తాను?

ఆలోచనల్తో మనసంతా వికలమైంది.

"అమ్మగారూ! పది దాటింది భోజనంచేస్తారా!" రావులమ్మ అడిగింది.

ఏది తప్పినా తిండి తినడం తప్పదు కదా!

"తీసుకురా" అని లేచి అలాగే నెమ్మదిగా నడచుకుంటూ బాత్‌రూమ్‌లోకి వెళ్ళాను.

బాత్‌రూమ్‌లో కాళ్ళు కడుక్కుంటూ కిటికీలోంచి బయటికి చూచాను. కింద నూతిచప్టా దగ్గిర ఆయన కాళ్ళు కడుక్కుంటున్నారు. సరోజ ప్రక్కన నుంచుని ఏదో చెప్తోంది. ఇద్దరూ విరగబడి నవ్వుకుంటున్నారు.

నాకు కారం రాచుకున్నట్లయింది. నే నిక్కడ ఇలా రోగంతోపడి ఏడుస్తుంటే వాళ్ళు హాయిగా వున్నారు. ఏదో కసి, ఆవేశం నా మనస్సుని ఊపాయి. కాని నేనేం చేయగలను? మనసులో ఏడ్చుకోవటం తప్ప.

నా కోసం బాధపడే ఆత్మీయులు లేని దౌర్భాగ్య జీవితం ఐపోయింది నాది. ఎలా వున్నావు? ఏం తిన్నావు? ఏం కావాలి? అని అడిగేవారు లేరు. ఈ మూలగదిలో నన్ను పారేశారు.

ఒక వస్తువుని మన కుపయోగపడేవరకూ వుంచుకుంటాం. అది పాడయితే దూరంగా విసిరేస్తాం.

అవును! మనిషి కూడా వస్తువుతో సమానమేనేమో!

"అమ్మా! అలా నిలబడిపోయారేమిటి?" రావులమ్మ కంగారుగా లోపలకు వచ్చింది.

డబ్బు కోసం చేసేదైనా దీనికున్న అభిమానంలో వెయ్యో వంతైనా వాళ్ళకి లేదు. రావులమ్మ నా చేయి పుచ్చుకుని నెమ్మదిగా నడిపించుకుని వచ్చి మంచం మీద కూర్చోపెట్టింది.

కంచం వున్న టేబిల్‌ను నా ముందుకు లాగింది. అన్నం మీద హితవు ఏనాడో చచ్చిపోయింది. ఏదో ముష్టిదానికి పడేసినట్లు మిగిలినవి, అడుగూ బొడుగూ నా ముఖాన పారేస్తున్నారు!

"ఏంటమ్మా! అలా తింటారు. డాక్టరుబాబు బాగా తినమని చెప్పలా! పెరుగు వేయనా అమ్మా!" అంటూ నీళ్ళలాంటి పెరుగు కంచంలో ఒంపింది.

రెండు ముద్దలు తిని చెయ్యి కడుక్కున్నాను.

"కాస్సేపు పడుక్కుని హాయిగా నిద్రపోండమ్మా!" రావులమ్మ కంచం తీసుకుపోయింది.

హాయి! హు! ఈ శరీరం అనే పంజరం లోంచి మనస్సనే చిలక ఎగిరిపోయిననాడే హాయి. అంతవరకూ నా మనస్సుకి విశ్రాంతి లేదు. ఈ ఆలోచనలు నన్ను తినెయ్యక తప్పదు. వూరికే పడుకుంటే ఒకటే ఆలోచనలు. ఏదైనా చదువుదామంటే కళ్ళల్లో నీళ్లు కారతాయి. అయినా సరే ఏదైనా పుస్తకం తీసుకుని కాస్సేపు బొమ్మలైనా చూద్దామనిపించింది. రావులమ్మ లేదు. భోజనం చేస్తోందేమో!

నేను లేచి టేబిల్ మీద చూశాను. అన్నీ పాత మేగ్జయిన్సే. కొత్తవి ముందుగదిలో వుంటాయి. తెచ్చుకుందామని లేని ఓపిక తెచ్చుకుని మెల్లగా నడిచాను.

ముందుగది కర్టెను గాలికి రెపరెపలాడుతోంది. తొలగించబోయి లోపలనుంచి ఏవో మాటలు విన్పించటంతో ఆగిపోయాను.

"నీకు వైలెట్ చీర చాలా బాగుంది సరూ!" అది ఆయన కంఠం.

కర్టెను కొద్దిగా తొలగించి చూశాను. ఇద్దరూ ఆవైపు తిరిగున్నారు. సరోజ నడుం దగ్గిర పడిన చీర మడతల్ని సరిచేస్తున్నారు ఆయన.

"ఈ చీర మీద ముత్యాలదండ వేసుకుంటే ఇంకా బాగుంటుందండీ" గారంగా అంటోంది సరోజ.

"ఓ! అలాగే రేపే కొనుక్కుందాం"

"ఎందుకండీ కొనడం. ఆవిడవి వున్నాయిగా! పైగా ఆవిడ వాటిని పెట్టుకోవడం లేదుగా" అంది నవ్వుతూ.

"ఓ యస్! దానికేం. ఈ రాణీగారు ఆజ్ఞాపించడం, ఈ సేవకుడు నెరవేర్చకపోవడమూనా!" సరోజ రెండు భుజాల మీద చేతులు వేసి దగ్గరకు తీసుకోబోయారు ఆయన.

"ఊ! వదలండి. ఆ మూడుముళ్ళూ పడ్డాకే అన్నీనూ. అయినా అంత తొందర వున్నవారు త్వరగా పెళ్లిచేసుకోరాదూ" ఈసడింపుగా అంది సరోజ.

"నాకూ తొందరగానే చేసుకోవాలని వుంది కాని...."

వారు అంటున్న మాటలను ఆ పైన వినలేకపోయాను.

ఈ భూమి బద్దలై నన్ను తనలోకి తీసుకోకూడదా! లేని ఓపిక తెచ్చుకుని తూలిపోతూన్న శరీరాన్ని ఎలాగో మంచం మీదకు చేరవేశాను.

మనుషులు ఎంత నీచంగా ప్రవర్తిస్తారు! ఒకప్పుడు నాతోనూ ఇటువంటి ప్రేమ మాటలే మాట్లాడారు ఆయన.

నేను వచ్చిన కొత్తలో "రాజీ! నువ్వు నా పూర్వజన్మ పుణ్యంకొద్దీ లభించావు. ఇంత అనుకూలవతియైన భార్య లభించడం నా అదృష్టం" అనేవారు.

ఆనాడు ఆయన మాటలు విని మురిసిపోయాను. ఇప్పుడు రోగిష్ఠి దాన్నయిపోవడంతో ఎప్పుడు చస్తానా అని చూస్తున్నారు!

ఒకసారి ఆయనకి జబ్బు చేసింది. మంచం మీద నుండి లేవలేకపోయేవారు; అన్నీ నేను దగ్గిరుండి చేయాల్సి వచ్చింది.

నేనప్పుడు విసుక్కోలేదు.

అసహ్యించుకోలేదు.

రెట్టింపు ప్రేమతో చేశాను.

ఆయన జబ్బు నయం అయ్యాక అన్నారు.

"రాజీ! నువు చేసిన సేవవల్లే నేను బ్రతికాను. నీ ఋణం ఎలా తీర్చుకోను" అని. నేను కోపంగా చూశాను.

"ఛ! ఏమిటండీ! ఆ మాటలు? మనలో మనకి ఋణాలేమిటి? అది నా ధర్మం" అని అన్నాను. "ఏమైనా నువు నాకు ప్రాణదానం చేశావు రాజీ! నీకూ నేను ఇలాగే సేవ చేస్తాను" అన్నారు నవ్వుతూ. "అయితే నాకు రోగం రావాలనుకుంటున్నారా" "ఛ! ఛ! అది కాదు వూరికే అన్నాను. నువ్వెప్పుడూ ఆరోగ్యంగానే తిరగాలి నా కళ్ళ ముందు."

నిజంగా వారలా ప్రేమగా మాట్లాడి చాలా రోజులయింది.

ఆ క్షణాలు అమూల్యమైనవి. కాని అదంతా నటన మోసం అని ఇప్పుడిప్పుడే తెలుస్తోంది.

"అక్కయ్యా!"

ముఖం ఒక్కసారి గట్టిగా తుడుచుకుని ఇటు తిరిగాను.

ఎదురుగా సరోజ. వైలెట్ చీర పైన ముత్యాల గొలుసు లేదు. బహుశ నా ఎదురుగా వేసుకోవడం ఇష్టంలేదేమో!

"అక్కయ్యా! మీకెలా వుంది?" తియ్యగా అడుగుతోంది.

ఇటువంటి పయోముఖ విషకుంభాలంటే నాకు ఎలర్జీ.

"ఎలా వుందక్కయ్యా!" మళ్ళీ అడిగింది సరోజ. అడిగేది నా రోగం గూర్చి కాదేమో! తన

చీర గురించి అయిఉంటుంది!

"చాలా బాగుంది" కటువుగా సమాధానం చెప్పాను. సరోజ అదేమీ పట్టించుకున్నట్టు లేదు.

"అక్కయ్యా! బావగారు సినిమాకి రమ్మని బ్రతిమాలుతున్నారు. నాకైతే మిమ్మల్నిలా వదిలి వెళ్ళాలని లేదు. కాని ఆయన వినడం లేదు."

ఏం నటన? వీళ్ళిద్దరికీ నటనలో బిరుదులు ఇవ్వవచ్చు. కసిగా పళ్ళు నూరుకున్నాను.

"సరోజా" ఆయన గొంతే అది. "వెడుతున్నా అక్కయ్యా! నీకేమన్నా కావాలంటే రావులమ్మ నడుగు" అంటూ వయ్యారంగా నడుచుకుంటూ వెళ్ళింది సరోజ మా వారితో.

*

సరోజ మా అత్తగారివైపు బంధువు. అడపాదడపా మా ఇంటికి వచ్చి వుంటూవుండేది. సరోజకి తల్లి లేదు. కొన్నాళ్ళకి తండ్రి కూడా పోయాడు. ఏదో కొద్ది ఆస్తి వుంది. సరోజ అన్నదమ్ములందరూ వున్న ఆస్తిని పంచుకున్నారు. సరోజ ఒంటరిదయింది. అన్నదమ్ములందరూ సరోజ విషయమే పట్టించుకోలేదు.

సరోజ ఒక రోజు వురుము లేని వర్షంలా ఏడుస్తూ మా ఇంటికి వచ్చింది.

కళ్ళల్లో ప్రాణాలున్నాయి. తిండి తిని ఎన్నాళ్ళో అయినట్లుగా వుంది. మా అత్తగారు అప్పుడు లేరు. కూతురి పురిటికి వెళ్ళారు. సరోజ నా కాళ్ళ మీద పడి భోరుమంది.

"అక్కయ్యా! మీరే దిక్కు. అందరూ నన్ను తరిమేశారు. మీరు ఆశ్రయమిస్తారని కోటంత ఆశతో వచ్చాను. నన్ను పొమ్మనకండి మీ ఇంట్లో పని మనిషిగానైనా వుంటాను. మీరే నన్ను రక్షించాలి."

సహజంగా నా మనసు జాలిది. కష్టాల్లో వున్న సరోజను చూడగానే కరిగిపోయాను. లేవనెత్తి ఆమె కన్నీటిని తుడిచి ఆమెకు ఆశ్రయమిచ్చాను.

శవాకారంలో మా ఇంటికి వచ్చిన సరోజ రోజు రోజుకీ ఆరోగ్యవంతురాలై బొద్దుగా, అందంగా తయారయింది.

నేను మాత్రం రోజురోజుకీ క్షీణిస్తున్నాను. సరోజ తన తళుకు బెళుకులతో నా భర్తని తన వైపు ఆకర్షించుకుంటోంది. ఈ ఇంట్లో తన స్థానాన్ని గట్టి చేసుకుంటోంది.

పాలు తాగిన రొమ్మునే గుద్దేవాళ్ళకి ఏ శిక్ష వేయాలి?

భగవంతుడనేవాడుంటే తప్పకుండా వీళ్ళకి శిక్ష పడుతుంది.

"అమ్మగారూ! పడుకున్నారా!" రావులమ్మ వచ్చింది.

"లేదే! నువ్వు అన్నం తిన్నావా!"

"తిన్నానండీ"

"ఎదురింటి కెళ్ళి పద్మను ఒక్కసారి ఇలా పిలుచుకు వస్తావా" అన్నాను.

రావులమ్మ వెళ్ళి అయిదు నిమిషాల్లో తిరిగి వచ్చింది.

"అమ్మగారూ! పద్మమ్మగారు ఎక్కడికో పోయినారంట. రాగానే పంపుతామన్నారు." అని రావులమ్మ అక్కడే కూర్చుంది ఏదో చెప్పబోతోందని గ్రహించాను.

"అమ్మగారూ! సరోజమ్మ భలే ఆడదండీ! అయ్యగార్ని ఇట్టే బుట్టలో వేసింది. ఇద్దరూ ఎలా నవ్వుకుంటూ పోతున్నారో చూశారామ్మా."

పనిమనిషితో ఇంటి విషయాలు మాట్లాడటం నాకిష్టం వుండదు. వాళ్ళు ఇలాంటి విషయాల్ని గూర్చి ఉన్నవీ, లేనివీ కల్పించి ప్రచారం చేస్తుంటారు, మనం ఒకటంటే పది చెప్తారు. కాని అలా మాట్లాడవద్దని రావులమ్మతో చెప్పలేను! అదే నన్ను కాస్త ఆదుకునేది.

"మీరు మంచోరు కాబట్టి అలా చూస్తూ వూరుకున్నారు. మరొకరైతేనా — అయినా మీకు జబ్బు నయం కాదా! మళ్ళీ ఇదివరలా తిరగరా! అయ్యగారు ఇంతలోనే అలా మారిపోవాలా!




1. హిందూ దేశ చరిత్రలో క్రీ. పూ. 327–326 సంవత్సరాలకు గల ప్రాముఖ్యత ఏమిటి?
2. ప్రపంచంలో నేటికీ అక్కడక్కడ అగ్నిపర్వతాలు వున్నాయి. మన దేశంలో ఒకప్పుడు దక్కను పీఠభూమి అగ్నిపర్వతమయం అనేవారు. అయితే ఇప్పుడు మన దేశంలో అగ్నిపర్వతాలు వున్నాయా? ఉంటే అవి ఎక్కడున్నాయో చెప్పగలరా?
3. మన దేశంలో కల్లా అతి ప్రాచీనమైన పర్వతశ్రేణి ఏది?
4. టిరాప్ జిల్లా ఏ రాష్ట్రంలో వుంది? అది ఈ మధ్య వార్తలలో కెక్కడానికి గల కారణమేమిటి?
5. ప్రపంచంలో కల్లా అత్యధికంగా వర్షం కురిసే ప్రాంతం చిరపుంజి అని మీకు తెలుసు. మరి ఈ చిరపుంజి పీఠభూమి ఏ కొండ మీద వున్నదో చెప్పగలరా?
6. మన దేశంలో ఏ ప్రదేశాన్ని 'లాండ్ ఆఫ్ సన్‌రైజ్' లేక 'సూర్యుడు ఉదయించే భూమి' అని అంటారు?
7. 'బోర్న్‌ఫ్రీ' నవలా రచయిత్రి పేరేమిటి? ఆమె గురించి ఈ మధ్య పత్రికలలో పడడానికి గల కారణమేమిటి?
8. సాహిత్యంలో నోబెల్ బహుమతి పొందిన బ్రిటిష్ ప్రధాని ఎవరు?
9. ప్రపంచంలో కల్లా అత్యంత వేగంతో ప్రయాణం చేసి రికార్డు నెలకొల్పిన విద్యుత్ రైలు ఏ దేశానికి చెందినది? దాని వేగమెంత?
10. జెట్ ఇంజన్ కనుగొన్నది ఎవరు?

[సమాధానాలు ఈ సంచికలోనే వున్నాయి. వెతికి మీ సమాధానాలతో సరిపోతాయేమో పోల్చి చూసుకోండి]

అయినా ఈ మగాళ్లు ఎప్పుడూ ఇంతేనండి.''

రావులమ్మ అంటున్న మాటలు నాకు వినా లన్పించడం లేదు.

ఈ మాటలన్నీ నా మనస్సును బాధించేవే! అంటే పరోక్షంగా నన్ను మృత్యువు దగ్గరకు చేర్చేవి!

"ఆ సరోజమ్మ పెట్టే కూడు తినకేకుండా వున్నానమ్మా! ఒకటే విసుగు. మళ్ళీ మీరు లచ్చిందేవిలా ఎప్పుడు కళకళలాడుతూ తిరుగు తారో ''....

లచ్చిందేవి!....నా మనస్సులో ఏదో జ్ఞాపకం కదలాడింది.

*

"ఒరేయ్! మనింట్లో లక్ష్మి తల్లి పుట్టిందిరా'' బామ్మ ఎప్పుడూ నన్ను చూసి అనేది. రాజ్య లక్ష్మిగా నేను పెరిగాను. నేను పుట్టిన తర్వాత నాన్న వ్యాపారం బాగా అభివృద్ధి చెందిందట.

ఇద్దరు మగపిల్లల తర్వాత పుట్టిన నేను ఎంతో గారాబంగా పెరిగాను. నేను ఏం కోరినా వెంటనే వచ్చి ఒళ్లో వాలుతుండేది.

నేను పెద్దదాన్ని అవగానే బామ్మ రోజూ సాధించేది నాన్నను—

"ఒరేయ్! అమ్మాయికి పెళ్ళి చెయ్యరా'' అంటూ. ఆవిడ మాకు వరసకి మాత్రమే బామ్మ. అయినా మేమంటే ఎంతో ఇష్టం. కాని నాకు అప్పుడే చేసుకోవాలని లేదు.

"నేను బాగా చదువుకోవాలి. ఎన్నో డిగ్రీలు సంపాదించాలి. ఎంతో పెద్ద ఉద్యోగం చెయ్యాలి'' నా ఊహలు ఇలా సాగుతుండేవి.

"నాన్నా నేను చదువుకుంటాను'' అని నాన్నతో చెప్పాను. నాన్న నా కోర్కెని ఆమో దించారు.

వాళ్ల పిన్నితో మాత్రం "సంబంధాలు చూస్తూనే వున్నానే కుదరటం లేదు'' అంటూ ఏవో సాకులు చెప్పేవారు నాన్న.

పెద్దన్నయ్య ఎం.ఏ ప్యాసయి కాలేజీ లెక్చరరు వుద్యోగం సంపాదించాడు. రెండో అన్నయ్య ఇంజనీరింగు మూడో సంవత్సరంలో వున్నాడు.

ఆ యేడే నేను కాలేజీలో మొదటి డిగ్రీలో చేరాను. నా చదువుకి ఆటంకంగా కన్పించిన బామ్మ పోయి రెండేళ్లయింది. ఆవిడలేని కొరత నన్ను చాలా రోజులు బాధించింది. నా చదువుకి అడ్డు చెప్పిందనే కోపమేగానీ బామ్మంటే నాకు ఎప్పుడూ ప్రేమే. నా డిగ్రీ అయ్యేవరకూ నాన్న పెళ్ళి సంగతి ఎత్తనన్నారు.

ఆ సంవత్సరమే నా జీవితంలో అనుకోని సంఘటన జరిగింది.

"ఆంటీ''—

ఆ పిలుపుతో జ్ఞాపకాల ఊయలలో వూగుతున్న నేనూ, నిద్రపోతున్న రావులమ్మా వులిక్కిపడ్డాము. తల తిప్పి చూశాను.

ఎదురుగా పద్మ.

"కూచో పద్మా! రావులమ్మా నువ్వెళ్ళి వరం డాలో పడుకో'' అన్నాను.

రావులమ్మ లేచి వెళ్ళింది. పద్మ నా ఎదురుగా వున్న కుర్చీలో కూర్చుంది.

"ఆంటీ నీకెలా వుంది?'' పద్మ చేతితో నన్ను తడుముతూ అంది.

"ఏదో, ఇలా వున్నానమ్మా!''

"రోజు రోజుకి చిక్కిపోతున్నావు ఆంటీ! మందులు సరిగ్గా వేసుకోవడం లేదా?''

"వేసుకుంటున్నానమ్మా! నా రోగానికేంలే! నేను బ్రతికున్నంత కాలమూ అవి వుండేవే'' అన్నాను నవ్వుతూ.

"ఏమో ఆంటీ! నిన్ను చూస్తుంటే దిగులేస్తూ వుంటుంది. పూర్వం ఎంత చక్కగా వుండేదానివి.''

గతాన్ని గుర్తు చేస్తే నా గుండెల్లో మంట. ఈ కాస్సేపైనా మనస్సుని ఆలోచనల నుంచి తప్పించాలి!

"పద్మా! మా అమ్మకు ఉత్తరం రాశావా!''

"రాశాను ఆంటీ:''

"అవునూ! ఇందాక రావులమ్మని పంపితే ఎక్కడికో వెళ్లావన్నారు ఎక్కడికి వెళ్లావు పద్మా?''

సిగ్గుపడింది పద్మ.

"మోహన్‌రావు రమ్మన్నారు. ఇద్దరం అలా కాస్సేపు తిరిగొచ్చాం'' అంది.

ఎంత అమాయకురాలు.

ఆ వెధవ ఎలా మోసం చేస్తున్నాడో? మోహన్ చూపులు ఎంత కన్నింగ్‌గా వుంటాయి. మనిషిని నిలువునా ముంచేసే చూపులు. పెదవులపై ఎప్పుడూ చిరునవ్వు వెలుగుతూ వుంటుంది. దాంతోనే ఎదుటి వాళ్ళని సమ్మోహపరుస్తున్నాడు!

"ఇంతకీ పెళ్లెప్పుడంటాడు పద్మా'' కొద్దిగా కోపంగానే అన్నాను.

"అప్పుడే ఎక్కడ ఆంటీ! మొదటి భార్యకి విడాకులివ్వాలిగా'' అంది.

నేను తెల్లబోయాను. ఇన్ని రోజుల నుంచీ మోహనరావుకి పెళ్లయినట్టుగా పద్మకు తెలీదేమో అనుకున్నాను. పద్మ తెలిసే వివాహం చేసుకోవా లనుకుంటోందన్నమాట.

"పద్మా! మోహన్‌కి వేరొకరితో ఇదివరకే వివాహం జరిగిందా'', అని అడిగాను ఏమీ తెలియనట్టు.

"జరిగింది ఆంటీ! కాని ఆవిడంటే మోహన్‌కి ఇష్టం లేదట. పెద్దవాళ్ళు బలవంతంగా చేశారుట. ప్చ్. పాపం! ఆ అమ్మాయి ఏం చదువుకోలేదుట. అందంగా కూడా ఉండదట. అందుకే ఆ అమ్మా యికి విడాకులిచ్చి నన్ను చేసుకోవాలనుకుంటు న్నారు. అదీకాక మా మనసులు కూడా కలిశాయి.''

ఎంతో తేలికగా నిర్లిప్తంగా చెప్పుతున్న పద్మ



రోజా పువ్వు వాడకుండా రేపటి వరకు నిలువ వుండాలంటే — ఒక చిట్కా వుంది! పువ్వు మధ్యన ఒక చుక్క కొబ్బరినూనె వేయడం!



రాత్రి పడుకోబోయే ముందు కళ్ళకు మంచి రకం ఆముదం రాస్తే కళ్ళు, కళకళలాడుతూ వుంటాయి. కనుబొమ్మలకు రాస్తే, పల్చగా వుంటే వెంట్రుకలు పెరిగి అందంగా అగుపిస్తాయి.

పడుకోబోయే ముందు పెదవులకు నెయ్యి రాసి తెల్లవారి లేస్తూనే, వేడి నీటితో కడిగితే పెదవులు మెరుస్తుంటాయి.

ప్రతి రోజూ స్నానం చేయబోయే ముందు ఒక చంచా పాల మీగడలో కొన్ని చుక్కలు నిమ్మ రసం వేసి, రెండింటిని బాగా కలిపి ముఖానికి, చేతులకి పట్టించి, తరువాత సీకాయ పొడితో రుద్దుకొంటే శరీరానికి కొత్త కాంతి ప్రవేశిస్తుంది.

—కె. జి. సరళకుమారి

మాటలను నిర్ఘాంతపోయి విన్నాను.

"పద్మా! ఒకవేళ ఆ అమ్మాయి విడాకు లివ్వకపోతే?" అన్నాను.

పద్మ కోపంగా నా వంక చూసింది.

"ఎందుకివ్వదూ! ఆయన ప్లీడరు దగ్గిరికి వెళ్లారు. ఆ ప్లీడరు ఏవో సలహాలు చెప్పాట్ట. ఆ అమ్మాయి మంచిదికాదని, రోగాలున్నాయని ఏవేవో నిరూపిస్తారట కోర్టులో. అప్పుడు ఎవడికోసం వస్తాయి విడాకులు? ఏది ఏమైనా మేము జీవితాంతం కలిసుంటామని ప్రమాణాలు చేసుకున్నాం ఆంటీ!"

పద్మ ఎంతో అమాయకంగా చెప్పుతోంది.

చిన్నతనంలో పరికిణీలు వేసుకుని గంతులు వేసుకుంటూ తిరిగే పద్మే నా కళ్లముందు మెదిలింది. నాలుగు సినిమాలు చూసి, నవల్సు చదివి ఏవేవో మాటలు వల్లిస్తోంది. ఈ అమాయకపు పిల్లలు ఆధునిక నాగరికత పేరిట చెలామణి అవుతున్న కృత్రిమపు పద్మవ్యూహంలో చిక్కుకుపోతున్నారు.

వీరికి విముక్తి ఎప్పుడో? ఆయినా ఆ మోహన్ దుర్మార్గుడు, రాక్షసుడు—

"సరోజ కనిపించదేం ఆంటీ!"

"సరోజా మీ అంకుల్ సినిమాకి వెళ్ళారు పద్మా" ఏడ్వలేక నవ్వుతూ అన్నాను.

"నిజంగానా"

"ఆ! ఇంకో విషయం చెప్పనా! మీ అంకుల్ సరోజని పెళ్లి చేసుకోబోతున్నారు."

పద్మ ఆశ్చర్యంగా కళ్లు వెడల్పు చేసుకుని చూసింది.

"అదెలా సాధ్యం ఆంటీ! నువ్వుండగానేనా!"

నవ్వాను.

"నేను బ్రతికున్నా చచ్చినవాళ్ళతో సమానమేగా! ఆయనకేం ఉపయోగంగా వున్నాననీ? పైగా ఇలా మంచంలో పడి వున్నాను."

"ఇది చాలా అన్యాయం ఆంటీ! నీకు ఏదో జబ్బుచేస్తే మాత్రం ఇక తగ్గదా! మళ్ళీ మామూలు మనిషివి కాలేవా?"

"ఏమో పద్మా! అదెప్పటి సంగతో కదా! ప్రస్తుతం ఆయనకి నేనంటే పరమ అసహ్యంగా వుంది. మగవాళ్ళు కదా! వాళ్ళకి పెళ్ళంటే చొక్కా మార్చినట్లుగా వుంటుంది."

పద్మ ముఖం ఎర్రగా చేసుకుని "నీలాటి వాళ్ళు అలా మెత్త మెత్తగా వుంచే మగవాళ్ళు ఇలాగే అన్యాయాలు చేస్తుంటారు. అయినా నువ్వు విడాకులివ్వకు ఆంటీ!" అని అన్నది.

పద్మని చూసి మనసులో నవ్వుకున్నాను.

"ఎలాగైనా తీసుకుంటారమ్మా! మోహన్ అనుసరించబోయే దారే వుంది కదా! నా మీద కూడా అటువంటి తప్పుడు రాతలే రాస్తారు" అన్నాను.

పద్మ చప్పున తగ్గి, "నువ్వూ, ఆవిడా ఒకటి ఎలా అవుతారు?" అన్నది నెమ్మదిగా.

"ఎందుక్కాదు పద్మా! ఇద్దరమూ ఆడవాళ్ళమేగా. ఇద్దరికి జరుగుతున్న అన్యాయం ఒక్కటేగా. నువ్వు చెప్పావే స్త్రీలు మెత్తగా వూరుకుంటున్నారని దానిక్కారణం తెలుసా? స్త్రీయే స్త్రీకి శత్రువవుతోంది. సాటి ఆడదానికి అన్యాయం చెయ్యడానికి ఆడదే పూనుకుంటోంది."

పద్మ మాట్లాడలేదు.

"పద్మా! నువ్వు ప్రేమించడం తప్పని ఎవ్వరూ అనరు. ప్రేమ పునాదిరాయిగా సంఘం నిర్మించబడాలి. కాని నువ్వు ఇప్పుడు చేయబోయే పనిని నిర్మలంగా ఆలోచించి చూడు. నువ్వు ఒక వివాహితుడిని పెళ్ళాడబోతున్నావు."

"అవును ఆంటీ! మోహన్‌రావుగారిని మనసారా ప్రేమించాను" అంది పద్మ.

"కాని పద్మా! నీ సుఖం కోసం నువ్వు ఆయన్ని చేబడితే సాటి ఆడకూతురైన జయ నీ పాదాల కింద పడి నశించిపోతుంది. ఇది నువ్వు ఆలోచించావా!"

"కానీ........"

"నన్ను చెప్పనీ పద్మా! నీ ఆంటీకి అన్యాయం జరగబోతోందని విచారిస్తున్నావు. జయ కూడా నాలాటిదే. నువ్వు సరోజని అసహ్యించుకుంటున్నావు. జయ కూడా నిన్ను అలాగే అసహ్యించుకుంటుంది! అయినా పద్మా! నీకేం తక్కువ ఒకసారి పెళ్ళయినవాడిని చేసుకోవడానికి? నీకు తెలీదేమో అతనికి చదువుకున్న స్త్రీలంటే ఏమంత మంచి అభిప్రాయం లేదు. నిన్ను పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాడంటే అది నీమీది ప్రేమతో కాదు! అది కేవలం మోహం. ఆ మోజు తీరాక—"



నిష్ఠల రాధిక

కుమారి నిష్ఠల రాధికా కృష్ణాజీ తన నాల్గవ యేట నుంచీ నృత్యం నేర్చుకుంటోంది. హైదరాబాద్‌లోని న్యూ కేజీ అప్పర్ ప్రైమరీ స్కూలులో 7వ తరగతి చదువుతున్న ఈ పన్నెండేళ్ళ బాలిక ఇప్పటి వరకు ఎన్నో నాట్య ప్రదర్శనలిచ్చింది. కొన్ని బహుమతులు గెల్చుకుంది కూడా. తాను విడిగానేకాక, చెల్లెళ్ళు అనుపమ, యామినీలతో కూడా కలిసి నాట్య ప్రదర్శనలు ఇస్తున్నది.

రాధికతల్లి శ్రీమతి శారద హైదరాబాద్ సంగీత నృత్య కళాశాలలో గాత్రం నేర్పే ఉపాధ్యాయిని. తండ్రి ఎన్. వి. కృష్ణాజీ నాటకరంగంలో ప్రఖ్యాతి వహించినవారు. రాధిక, తన చెల్లెళ్ళతో పాటు, హైదరాబాద్ సంగీత నృత్య కళాశాలలో అధ్యాపకురాలైన శ్రీమతి ఉమా రామారావు వద్ద శిక్షణ పొందుతోంది.

—మృణాళిని

# వీటిలో మీ వ్యక్తిత్వాన్ని చూపించేది ఏది?




# ఆ 'పాయిజ్'ని మీకు మీరే ఎంచుకోండి

**సమ్మోహింపజేసేది. అలౌకికమైనది. ఉవ్విళ్ళూరించేది. రోమాంచితమైనది. వాటిలో ఓ సువాసన మీకోసం, మీరు మనసుపడేదది!**

**పాయిజ్ షాంతెల్**

తాజాగా, ఉత్తేజంగా, హిమాన్ని చుంబించిన మొగ్గలు. అడవి పూల, వెంటాడే ఆ అనుభూతి. వెంటే నిలిచి కదలాడే మీకోసం కూర్చిన ఆ సుగంధం. షాంతేల్, మరుపురాని సుగంధం. దానిని అలుముకున్న సుందరిలాగే.

**పాయిజ్ ఓ-ద-జాస్మిన్**

తాజాగా అప్పుడే విరిసిన మల్లెల చెండులా మత్తెక్కించేది, ఉత్తేజపరిచేది.

**పాయిజ్ స్ప్రే పెర్ఫ్యూమ్**

చొరవైన, కల్పించే మూడు సువాసనలలో, మీ వ్యక్తిత్వాన్ని పట్టి పట్టి చూపించేది. మస్క్! మిస్టిక్! కోలోన్!

**పాయిజ్ ఓ-ద-లవాండ్**

లవండర్ జల్లు - మృదువుగా, సుతిమెత్తగా, తియ్యగా, కలలాగ.

**పాయిజ్ ఓ-ద-వెటివర్**

వెటివర్ యొక్క దోచేసే సుగంధం, ఉత్సాహం, ఉల్లాసం, అన్ని దీన్లో.

మీ వ్యక్తిత్వాన్ని పోగొట్టుకోకండి.

# పాయిజ్

హేండ్ కర్చీఫ్ పెర్ఫ్యూమ్స్.

మార్కెట్ చేసేవారు: రాలీస్ ఇండియా లిమిటెడ్

ULKA-PP-3 TEL

దగ్గ రావడంతో ఆగాను. 'ఆంటీ!' అంటూ భయంగా చూసింది పద్మ. 'పద్మా' అంటూ ఆప్యాయంగా పద్మ చేతిని నా చేతిలోకి తీసుకుని "నువ్వు నా కూతురిలాటిదానివి పద్మా! నువ్వు నా కళ్ళ ముందే ఊబిలోకి కూరుకుపోతుంటే నేను చూస్తూ వూరుకోలేను."

"ఆంటీ! ఏమిటో నాకంతా అయోమయంగా వుంది" అని అంది.

"పద్మా! ఇందాక అతని భార్య జయ నా దగ్గిరికి వచ్చింది. ఆ అమ్మాయి బి. యే ప్యాసయింది. చాలా అందంగా వుంది. తన భర్త విషయం చెప్పి ఎలాగైనా ఈ పెళ్ళి ఆపుచెయ్యమని వేడుకుంది. జయ విషయంలో మోహనరావు చెప్పిన విషయాలన్నీ అబద్ధం పద్మా! నా మాట నమ్ము" — అన్నాను.

"నిజంగానా ఆంటీ! ఆ అమ్మాయి బి. యే ప్యాసయిందా! ఏమీ చదువుకోలేదని చెప్పాడే మోహన్!"

"చూశావా పద్మా! అతను చేస్తున్న మోసం. చిత్రం ఏమిటంటే ఆడవాళ్లు ఎంత చదువుకున్నా, ఎన్ని ఉద్యోగాలు చేస్తున్నా పురుషుని మాయ మాటలకు లొంగిపోతూనే వున్నారు. అది బలహీనతో, అమాయకత్వమో! నిన్న ఆ అమ్మాయిని ప్రేమించాడు. ఇవ్వాళ నిన్ను. రేపింకొకరిని. ఇలా అతని రాక్షసత్వం సాగుతూనే వుంటుంది—"

ఆవేశంతో నా గొంతు వణికింది. "ఆంటీ! నన్ను క్షమించు ఆంటీ! అతని మాయ మాటలను గుడ్డిగా నమ్మి మోసపోయాను." పద్మ కళ్లల్లో నీళ్ళు తిరుగుతున్నాయి.

వాటిని తుడుస్తూ నేను పద్మని దగ్గిరికి తీసుకుని గుండెలకి హత్తుకున్నాను.

"పద్మా! ఈ సంఘంలో మెలిగేటప్పుడు జాగ్రత్తగా వుండాలి. అందరి మాటలూ నమ్మకూడదమ్మా. పోనీలే అయిందేదో అయింది. ఇక ముందు ఇటువంటి పొరపాట్లు చేయకు. ఈలోపు మీ అమ్మగారికి చెప్పి చక్కటి అబ్బాయిని చూసి తొందర్లోనే మూడు ముళ్ళూ వేయించమని చెబుతాను" నవ్వాను.

"ఛీ! పో! ఆంటీ!" అంది పద్మ సిగ్గుపడుతూ.

"ఏం? ఈ ఆంటీ కోరిక తీర్చవా – నువ్వు తొందరగా పెళ్లి చేసుకుని నీ భర్తతో నా కళ్ళ ముందు నిలబడాలి. ఇదేనమ్మా నా చివరి కోరిక" నా గొంతు మూగవోయింది.

"ఏం! మాటలవి ఆంటీ!" మందలింపుగా అంది పద్మ.

నేను వెంటనే నవ్వేస్తూ—

"ఏదో అలా వచ్చేసిందిలే. ఇప్పటికైనా నా మాటలను నమ్ముతావా పద్మా!"

పద్మ నిర్మలంగా నవ్వింది.

"ఆంటీ! మీరు నాకు జ్ఞానోదయాన్ని కలిగించారు. ఇంక ఆ మోహన్ ముఖమే చూడను. జయగార్ని ఒక్కసారి కలుసుకుని క్షమాపణ కోరుకుంటాను" అంది.

"ఊఁ! చెబుదువులే" అన్నాను.

పద్మ లేచి నుంచుని నా చేతులు పట్టుకుని—

"ఆంటీ! మీ మేలు నా జన్మలో మరిచిపోలేను. వస్తా ఆంటీ" అని అన్నది.

"సరే" అన్నాను.

పద్మ వెళ్ళిపోయింది.

అమ్మయ్య! ఎలాగైతేనేం ఈ సమస్య పరిష్కారం అయింది. నా మనస్సు తేలిక పడింది. మాట నిలబెట్టుకున్నాను. ఇంక నాకు ఏమైనా ఫర్వాలేదు.

ఈ ఆలోచనతో నా మనస్సు ఝల్లుమంది.

అంటే.... అంటే నేను చచ్చిపోతానా?

ఇందాక పద్మతో మాట్లాడుతూ కూడా ఇలాగే 'నా చివరి కోరిక' అన్నాను.

ఎందుకలా అన్నాను?

నేను తొందర్లోనే చచ్చిపోతానని నా ఆత్మకి తెలిసిందా!

వివేకానందుడు అంటాడు—

"మనస్సు దేనినైతే గాఢంగా కోరుకుంటుందో అదే జరిగితీరుతుంది" అని. అయితే నా మనస్సులో నా అంతరాంతరాలలో నేను చచ్చిపోతాననే అభిప్రాయముందా?—

అదే అనాలోచితంగా బయటికి వచ్చిందా?

మళ్ళీ మృత్యువుని తలచుకోగానే నా శరీరమంతా చల్లబడినట్లయింది.

మళ్ళీ మనసంతా పిచ్చిగా తయారయింది.

ఏవేవో ఆలోచనలు, ఏవేవో శంకలు.

అప్పటి వరకూ మామూలుగా వున్న మనస్సులో ఏదో భయం, దిగులు ప్రవేశించాయి.

కనిపించని వ్యక్తుల మీద కసి, ద్వేషం. ఈ ప్రపంచాన్నే మింగేయాలన్నంత కోపం.

గుండెలు పగిలేలా ఏడ్వాలనిపించే దుఃఖం.

కాని ఏదీ చెయ్యలేని అశక్తత.

నన్ను ఇలా బాధపెడ్తున్నదెవరు? ఒంటరిగా వుండటం చూసి నన్ను కాస్త కాస్త తినేసే ఈ ఆలోచనలేమిటి?

నేను బ్రతికుండగానే నాకు నరకాన్ని చూపిస్తున్నది ఎవరు?

మృత్యువా?

ఒకవేళ నేను చనిపోతే నరకానికి పోతానా? స్వర్గానికి పోతానా?

మత విశ్వాసం ప్రకారం పునర్జన్మ ఉన్నదనుకుంటే — మరో జన్మ ఎత్తాలి.

అప్పుడు ఎక్కడ పుడ్తానో? ఈ జన్మలో మంచిపన్లు చేస్తే మరుజన్మ మంచిది వస్తుందట.

నేను ఏ ఏ మంచిపనులు చేశాను?

పద్మ జీవితాన్ని రక్షించాను. తోటి స్త్రీ కాపురాన్ని నిలబెట్టాను. నాకు తెలిసినంతవరకూ చెడ్డవి, ఎదుటివాళ్ళకు బాధ కలిగించేవి ఏవీ చెయ్యలేదు.

అవును చెయ్యలేదు.

'అబద్ధం'—

ఎవరో గది అదిరిపోయేట్టు అరిచినట్లనిపించింది.

చుట్టూ చూశాను.

ఎవరూ లేరు.

నా మనసే నన్ను ప్రశ్నిస్తోంది.

'నువ్వెవరికీ అన్యాయం చెయ్యలేదా?'

నేనెవరికీ అన్యాయం చెయ్యలేదు.

గుర్తు తెచ్చుకో.... నా మనస్సు నన్ను నిలదీస్తోంది. హృదయపు లోతుల్లో ఏవో, ఏవేవో జ్ఞాపకాలు కదలి, చెదరి, ఆకృతి చెందడానికి ఆరాట పడుతున్నాయి.

ఒక్కసారి నీ బావను గురించి ఆలోచించు!

నీవల్లనేగదా నీ బావ అందరికీ దూరమై, తను ఒంటరివాడై, అవిటివాడై.... జీవితంలో ఏవీ మిగలక....

ఆశలు పెంచి, నమ్మించి మోసం చేసి.... అవును! నేను మోసం చేశాను నా బావను కాదని – పెద్దవాళ్ల పట్టుదలలకు లొంగిపోయాను లొంగిపోయి....

మనస్సు పొరల్లో ఏవేవో జ్ఞాపకాలు!

[సశేషం]



# మొక్కజొన్నలతో వంటలు

## మసాలా వడలు

కావలసిన పదార్థాలు: 2 కప్పుల మొక్కజొన్న గింజలు, 2 పెద్ద ఉల్లిపాయలు, 4 పచ్చిమిరపకాయలు, చిన్న అల్లంముక్క, 4 లవంగాలు, 2 ముక్కలు దాల్చినచెక్క, 150 గ్రాముల నూనె, కొంచెం ఉప్పు.

తయారు చేయవలసిన విధానం: రేపు వడలు చేస్తామనగా ముందు రోజు రాత్రి మొక్కజొన్న గింజలను బాగా కడిగి మంచినీళ్ళలో నానబెట్టి ఉంచాలి. తరువాత రోజు ముందుగా అల్లం, పచ్చిమిరపకాయలు లవంగాలు, దాల్చినచెక్క మెత్తగా నూరి ఉంచుకోవాలి. ఉల్లిపాయలను నిలువుగా, సన్నంగా తరిగిపెట్టుకోవాలి. మొక్కజొన్నలను నీళ్ళలోనుండి తీసి, పూర్తిగా నీళ్ళను కారనిచ్చి రోటిలో వేసి రుబ్బాలి. రుబ్బేటప్పుడు నీళ్ళు అసలు జల్లకూడదు. పిండి గట్టిగా వుండాలి. పిండి బాగా నలిగిన తరువాత ముందుగా నూరి వుంచుకొన్న మసాలా ముద్ద, తగినంత వుప్పు, వుల్లిపాయ ముక్కలు వేసి రెండు, మూడుసార్లు రుబ్బి తీసి వేయాలి. పొయ్యి మీద బాణలిపెట్టి నూనె పోసి బాగా కాగనివ్వాలి. తరువాత అరచేతిలో ఒక్క చిన్న ప్లాస్టిక్ కాగితం పెట్టుకొని ఈ పిండిని చిన్న వుండగా చేసి పలుచగా వడలాగ తట్టి నెమ్మదిగా తీసి నూనెలో వేయాలి. ఒక్కొక్కసారికి 4, లేక 5 వడలు వేయవచ్చును. వడలు ఎర్రగా వేగిన తరువాత తీసి పళ్ళెంలో పెట్టుకోవాలి. ఘుమ ఘుమలాడే ఈ మసాలా వడలు వేడి మీద తింటే కరకరలాడుతూ చాలా రుచిగా వుంటాయి. ఈ వడలు నూనెను ఎక్కువగా పీల్చుకోవు. అందుచేత నూనె ఎక్కువ ఖర్చు కాదు.

—ఎన్. సి. సుభద్రా శ్రీరామ్, నెల్లూరు

## హల్వా

కావలసిన పదార్థాలు: 4 మొక్కజొన్న కండెలు, $\frac{1}{3}$ కిలో పంచదార, తగినంత నెయ్యి, ఏలకులు, జీడిపప్పు.

తయారు చేసే విధానం: నాలుగు మొక్కజొన్న కండెలు తీసుకోవాలి. మొక్కజొన్న కండెలు కాల్చకుండా అంటే పచ్చిగింజలు ఒలవాలి. ఆ గింజలను నీటిలో ఒక గిన్నెలో వేసి ఒక గంటసేపు నానపెట్టాలి. ఆ నానిన మొక్కజొన్న గింజలను రుబ్బురోలులో వేసి రుబ్బాలి. ఆ మొక్కజొన్న గింజలలో నుంచి పాలు వస్తాయి. నాలుగు మొక్కజొన్న కండెల గింజలకు $\frac{1}{3}$ కిలో పంచదారా పడుతుంది. మొక్కజొన్న గింజలపాలు పంచదారా కలిపి స్టవ్ మీద పెట్టి స్టీల్ గిన్నెలో వేయించాలి. అది దగ్గర పడ్డాక దానిపై నెయ్యి వెయ్యాలి. జీడిపప్పు, ఏలకలు పొడి వేసి కలియబెట్టి దాన్ని స్టౌవ్ మీద నుంచి దించి ఈ హల్వాని ఒక పళ్ళెంలో వేసి ముక్కలు క్రింద కోసుకోవాలి.

—ఎన్. పద్మబాలు, హైద్రాబాదు

## పేలాలు లడ్లు

కావలసిన పదార్థాలు: 1 కిలో మొక్కజొన్నలు, $\frac{1}{2}$ కిలో బెల్లం.

తయారుచేసే విధానం: మొక్కజొన్నలను పేలాలుగా వేయించడానికి ముందుగా, కొన్ని గంటలుసేపు నీళ్ళలో నానబెట్టిన తరువాత, ఎండలో ఎండబెట్టాలి. తరువాత పొడి ఇసుకను బాణలి మీద పెట్టి ఇసుకను వేడిగా చేస్తూ మొక్కజొన్నలను పేలాలుగా వేయించాలి.

ఇట్లా వేయించుకొన్న మొక్కజొన్న పేలాలను, విడిగా పెట్టుకొని, బెల్లంను లేత పాకంగా పట్టాలి. తరువాత పేలాలను ఆ పాకంలో కలపాలి. బెల్లం పాకం, పేలాలు కలిపిన మిశ్రమమును వేడి మీదుగానే నీటిలో తడిసిన చేతితోగాని, లేక పిండిగాని పట్టుకొని, మనకు కావలసిన సైజులో వుండలుగా చేసుకోవాలి. ఇవి చాలా రుచిగాను, చాలా రోజులు నిలవ వుంటాయి.

—పి. సుశీలా శివరామ్, తిరుపతి

## బూందీ లడ్డూ

కావలసిన పదార్థాలు: 250 గ్రాములు మొక్కజొన్నపిండి; 100 గ్రాములు శనగపిండి; అరకిలో పంచదార; పది ఏలకులు; జీడిపప్పు, కిస్‌మిస్‌లు తగినన్ని; అరకిలో నెయ్యి.

తయారుచేసే విధానం: మొక్కజొన్న పిండినీ, శనగపిండినీ బూందీ కట్టుకునేందుకు అనువుగా కలిపి పెట్టుకోవాలి.

బాణలిలో నెయ్యి పోసి నెయ్యి వేడయిన తర్వాత పై మిశ్రమాన్ని బూందీ చట్రం సహాయంతో నేతిలో విడిచి బూందీ తయారు చేసుకోవాలి.

ఏలకులను వలిచి గుండ కొట్టుకుని పెట్టుకోవాలి. జీడిపప్పును నేతిలో వేయించి పెట్టుకోవాలి.

పంచదార లేతపాకం పట్టి, దాంట్లో ఏలకుల పొడి కలపాలి.

బూందీని పాకంలో పోస్తూ బాగా కలిసేలా కలిపి కిస్‌మిస్, జీడిపప్పులను వేసి బాగా కలిపి పెట్టుకోవాలి.

ఇష్టమైన సైజులో లడ్డూలు కట్టుకోవచ్చు.

—డాక్టర్ లక్ష్మి ఎన్. ఎం. శ్రీరాం ఖమ్మం

## నిబంధనలు

'వనిత మాటల కొలువు'లో స్త్రీలు మాత్రమే పాల్గొనాలి. ఈ సంచికలో ఉన్న కూపను పూర్తి చేసి కవర్లో పెట్టి 'వనిత మాటల కొలువు-58' చందమామ బిల్డింగ్స్, మద్రాసు – 600 026 చిరునామాకు ఏప్రిల్ (80) 30వ తేదీ లోగా చేరేలా పంపాలి. ఆ కవర్లో మాటల కొలువు కూపను తప్ప మరేదీ ఉండకూడదు. ఒక కవర్లో ఒక్క ఎంట్రీయే ఉండాలి. గళ్ళలో వేసే అక్షరాలు శుభ్రంగా, తెలిసేలా ఉండాలి. కొట్టివేతలూ దిద్దుబాట్లూ ఉండకూడదు. దీని సమాధానం, ఫలితాలూ 1980 జూన్ సంచికలో ప్రచురింపబడతాయి. మా దగ్గర గల సమాధానంతో సరిపోయే సమాధానం పంపినవారికి రూ. 150 లు బహుమతిగా పంపుతాము. సరైన సమాధానం పంపేవారు ఒకరికంటె ఎక్కువమంది గనక ఉంటే, బహుమతి మొత్తం సమానంగా పంచబడుతుంది. దీనికి సంబంధించిన ప్రతి విషయంలోనూ 'వనిత' నిర్వాహకవర్గానిదే తుది నిర్ణయం. ఈ విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరపబడవు.

### ఆధారములు - అడ్డము

1. చూపరికం లాంటి సందేహం
2. రాజుగారి భార్య
3. గ్రామం కంటె పెద్దది
4. పాడియైధర చెల్లునది
5. తిరగవేసి, మధ్యలో పూర్ణానుస్వారం వుంచితే ఒక భాష
6. సేవకుడైనా సరే, చివరికి గుడికావాలి
7. రోగాన్ని తగ్గించేది తిరగబడింది
8. రేఖ
9. ఎక్కువ శోభ - అని అర్థం
10. ఈ 'కళ' గురించి మీరు 'వనిత'లో చదివారు
11. గుర్రమూ కావచ్చు; పక్షీ కావచ్చు
12. అందకపోతే కాళ్ల-అందితే ?
13. సూర్యుడు

### ఆధారములు - నిలువు

1. ఆరు కంటె తక్కువ
2. గజిబిజిగా వున్న జన సమ్మర్దం
8. అక్షరాల్ని సరిగ్గా సర్దితే, జయించాలన్న కోరిక- తెలుస్తుంది
9. ఆహా! అంతులేని సౌరభ్యము!
14. నీరు గలది
15. ఓర్వలేనితనం కాబట్టి, అలా అటూ ఇటూ అయిపోయింది
16. దేవిలేని లక్ష్మీదేవి
17. తన కొడుకుకు అక్క
18. వల్లకాటి పులుగు
19. శాస్త్రము తిరగబడినది
20. సంస్కృత పద్యాన్ని ఏమంటారు ?
21. రాక్షసత్వం గల స్త్రీ
22. సప్త స్వరాలలో వరస స్వరాలు



# వార్తావనిత



ప్రఖ్యాత రచయిత్రి డాక్టర్ సి. ఆనందారామం 1980 సంవత్సరపు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమతి పొందారు. ఆమె రాసిన 'తుపాను' నవలకు ఈ బహుమతి లభించింది. తెలుగులో డాక్టరేట్ పట్టం పొందిన శ్రీమతి ఆనందారామం ఇంతవరకూ సుమారు పాతిక నవలలూ, వందకు పైగా కథలూ రాశారు. 1962లో వెలువడిన 'సంపెగ పొదలు' తరువాత ఆమె మారే కాలంలో మారని విలువలు, అజ్ఞాత బంధాలు, మమతల కోవెల, చీకటి కదుపున కాంతి, ఆనందనిలయం, మబ్బు విడిపోయింది, ఇదే నేను కోరేది, తుపాను వంటి పలు నవలలు రాశారు. 'దశావతారములు' పేరిట ఆమె ఒక కథల సంపుటి వెలువరచారు. డాక్టర్ ఆనందారామం 'జీవితం', 'జ్యోతి' అనే రెండు చలనచిత్రాలకు కూడా కథలు రాసారు.

హైద్రాబాదులో సరోజినీనాయుడు శత జయంత్యుత్సవాల సందర్భంగా జరిపిన వ్యాస రచన పోటీలో గెలుపొందిన బాలికకు సమాచార శాఖా మంత్రి శ్రీమతి సరోజినీ పుల్లారెడ్డి బహుమతి ఇస్తున్న దృశ్యం.

—మల్లిడి కనకరత్నం





మద్రాసులోని రాణి సీతై హాలులో మార్చి 6వ తేదీన ప్రఖ్యాత నిర్మాత – దర్శకుడు శ్రీ ఎల్. వి. ప్రసాద్ మనుమరాళ్లు, ప్రసాద్ లాబొరేటరీ అధినేత శ్రీ ఎ. రమేష్ కుమార్తెలు అయిన కుమారి రాధ, కుమారి రమ 'భరతనాట్య అరంగేట్రం' ప్రదర్శన ఇచ్చారు. ఆనాటి సభకు న్యాయమూర్తి ఎస్. మోహన్ అధ్యక్షత వహించారు. డాక్టర్ వై. నాయుడమ్మ ముఖ్య అతిథిగా విచ్చేశారు.

న్యూఢిల్లీలో ఇటీవల భారత శిశు సంక్షేమ శాఖ వారిచే ధైర్యసాహసాలు ప్రదర్శించిన బాలలకై నిర్దేశించబడిన 'నేషనల్ బ్రేవరీ అవార్డు' (1979) కుమారి జి. సంధ్యకు లభించింది. ఫిబ్రవరి 18, 1978 న మూడు సంవత్సరాల కిశోర్ అనే బాలుని నీటి ప్రమాదం నుంచి రక్షించినందుకు ఈ బహుమతి లభించింది. ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి సంధ్యకు ఈ బహుమతిని అందజేశారు. ఆంధ్రప్రదేశ్‌కు చెందిన బాలికలలో ఇటువంటి బహుమతి పొందిన ప్రథమురాలు కుమారి సంధ్య కావడం విశేషం!



కాకినాడలో ఇటీవల 'టెలికమ్ విమెన్స్ ఆర్గనైజేషన్' పేరిట మహిళామండలి ఏర్పడింది. న్యూఢిల్లీలోని తంతి తపాలాశాఖ స్త్రీల కేంద్ర సమాఖ్యకి అనుబంధంగా ఏర్పడిన ఈ మండలికి అధ్యక్షురాలుగా జి. విజయలక్ష్మి, కార్యదర్శిగా సి. హెచ్. బి. టి. సుందరి ఎన్నికయ్యారు. ఆంధ్రప్రదేశ్ టెలికమ్యూనికేషన్స్ జనరల్ మేనేజర్ సతీమణి, హైద్రాబాద్ సర్కిల్ అధ్యక్షురాలు అయిన శ్రీమతి మణి చౌదరి సభ్యులకు తమ సమాఖ్య లక్ష్యాల గురించి వివరించారు.





వినోదయాత్రా ఉత్సవాల సందర్భంగా విజయవాడ శాంతి థియేటర్‌లో ఫిబ్రవరి 10వ తేదీన ఆంధ్రప్రదేశ్ ఫిలింటాలెంట్స్ అకాడమీ ఆధ్వర్యాన జరిగిన అందాలరాణి పోటీలో 'మిస్ ఆంధ్రప్రదేశ్ 1980'గా విజయవాడకు చెందిన కుమారి మోహిని ఎన్నికయ్యారు. రెండవ స్థానం కుమారి అంజలి నాయుడు (మద్రాసు)కు, మూడవ స్థానం కుమారి ప్రమీలారాణి (విజయవాడ)కు లభించింది. కుమారి మోహినికి వినోదయాత్ర శాఖామంత్రిణి శ్రీమతి రోడా మిస్త్రీ 'స్వర్ణ కిరీటం' బహూకరించారు.

—మీరా



మద్రాసు ఎస్. ఐ. ఇ. టి స్త్రీల కళాశాలలోని ఉపాధ్యాయినులకూ, యాజమాన్యానికి మధ్య ఇటీవల ఏర్పడిన వివాదం వల్ల రెండేళ్లపాటు కళాశాలను మూసివేస్తున్నట్లుగా యాజమాన్యంవారు ప్రకటించారు. గత ఆగస్టు నెలలో తమ ఫీజులు తగ్గించాలని విద్యార్థినులు, జీతాలు యూనివర్శిటీ గ్రాంట్స్ కమిషన్ నిర్ణయం మేరకు ఇవ్వాలని ఉపాధ్యాయినులు, తదితర సిబ్బంది సమ్మె చేశారు. ఆ తరువాత జరిగిన ఒప్పందం ప్రకారం యాజమాన్యం వ్యవహరించనందుకు నిరసనగా ఇప్పుడు ఉపాధ్యాయినులు సమ్మె పునఃప్రారంభించారు. ఐతే పరీక్షలు దగ్గరవుతూ వుండడం వల్ల విద్యార్థినుల పట్ల తమ బాధ్యత నిర్వర్తించడానికి వారు—కళాశాల ఎదుట వీధులలోని ఫుట్‌పాత్‌ల మీద పందిళ్ళు వేసి తరగతులు నిర్వహిస్తున్నారు. ప్రభుత్వం పి. జి, ఫైనల్ ఇయర్ విద్యార్థినులకు ఇతర కళాశాలల్లో ప్రత్యామ్నాయ ఏర్పాట్లు చేసింది.

రాజమండ్రి జాంపేట ఫ్రెండ్ యూనియన్, ఇన్నర్‌వీల్ ఆధ్వర్యంలో బాంబేడైయింగ్ సహకారంతో జనవరి 27న అందాల రాణి పోటీలు ఏర్పాటు చేశారు. అందాల రాణిగా ఎన్నికైన పుష్పావేత్రవతికి రజత కిరీటాన్ని అలంకరింపజేస్తున్న తూర్పు గోదావరి జిల్లా జాయింట్ కలక్టర్ సతీమణి మాలా భట్టాచార్య.








విశాఖపట్నం ఇన్నర్ వీల్ క్లబ్బుల సమిష్టి ఆధ్వర్యంలో జనవరి 19, 20 తేదీలలో ''315 - డిస్ట్రిక్టు ఇన్నర్ వీల్ కాన్ఫరెన్సు'' పోర్టు టెన్నిస్‌క్లబ్ హౌస్‌లో వైభవంగా జరిగింది. ఇండియా, శ్రీలంకలలోని అన్ని డిస్ట్రిక్టుల నుండి ఇన్నర్‌వీల్ డెలిగేట్సు వచ్చి పాల్గొనడం యీసారి డిస్ట్రిక్టు కాన్ఫరెన్సు ప్రత్యేకత !



ఇండియా, శ్రీలంక ఇన్నర్‌వీల్ క్లబ్బుల అసోసియేషన్ అధ్యక్షురాలు శ్రీమతి సరోజ్ లాల్‌వానీ జ్యోతిని వెలిగించి, సభను ప్రారంభించారు. కాన్ఫరెన్సు ఛెయిర్మన్ శ్రీమతి కమలా చిట్రా సభకు ఆహూతులైన ప్రతినిధులకు స్వాగతం పలకగా, విశాఖ నార్తు ఇన్నర్ వీల్ క్లబ్బు అధ్యక్షురాలు శ్రీమతి కనకవల్లీ రామ్‌గోపాల్ అసోసియేషన్ సభ్యురాండ్రను సభకు పరిచయం చేశారు. విశాఖ హిందూస్థాన్ షిప్‌యార్డు సంక్షేమ సంఘం అధ్యక్షురాలు శ్రీమతి విమలా ఆనందరామ్ మహాసభలో ముఖ్య అతిథిగా వ్యవహరించగా, డిస్ట్రిక్టు - 315 ఛెయిర్మన్ శ్రీమతి అన్నపూర్ణా శ్రీరామ్ (రాజమండ్రి) సభ్యురాండ్రకు మిమెంటోలను బహూకరించారు. శ్రీమతి సరోజ్ లాల్‌వానీ సూవనీర్‌ను విడుదల చేసారు. విశాఖ ఇన్నర్ వీల్ క్లబ్బు అధ్యక్షురాలు శ్రీమతి లక్ష్మి ప్రభాత్ కుమార్ వందన సమర్పణ చేశారు. — విలేకరి



భిలాయ్ ఆంధ్ర మహిళామండలి వార్షికోత్సవాల సందర్భంగా మండలి సభ్యులు 'పుష్ప ప్రదర్శన' నృత్య నాటికను ప్రదర్శించారు. ఈ నాటికకు శ్రీమతి విజయలక్ష్మి దర్శకత్వం వహించారు. మండలి అధ్యక్షురాలైన శ్రీమతి నాగూబాయ్ ఆధ్వర్యంలో ఆనాటి కార్యక్రమం వైభవంగా జరిగింది.

—ధరణి



అనంతపురం గిల్డ్ ఆఫ్ సర్వీస్ ఆధ్వర్యంలో నిర్వహింపబడుతున్న పాఠశాలలో ఐదవ క్లాసు రూముకు జిల్లా కలక్టర్ శ్రీ టి. కె. దివాన్ ప్రారంభోత్సవం చేశారు. గిల్డ్ ఆఫ్ సర్వీస్ అధ్యక్షురాలు శ్రీమతి రుక్మిణీ విశ్వమూర్తి, కార్యదర్శిని శ్రీమతి కళావతి నాగభూషణం, గిల్డ్ సభ్యులు ఈ చిత్రంలో వున్నారు.

## వార్తావనిత

లయన్స్ క్లబ్స్ ఇంటర్నేషనల్ అనుబంధ సంస్థలయిన ''లయన్ లేడీస్ ఆక్సిలియరీస్ అండ్ లయనెస్ క్లబ్బుల'' 324 – C డిస్ట్రిక్టు మహాసభ ఫిబ్రవరి మూడవ తేదీన విశాఖపట్నంలోని హొటల్ అప్సరా - కిన్నెర ఆవరణలో వైభవంగా జరిగింది. ఈ విధంగా లయన్సు మహిళలు స్వతంత్రంగా జిల్లా స్థాయిలో సమావేశం జరుపుకోవడం యిదే ప్రథమం!

డిస్ట్రిక్టు ఛెయిర్మన్ లయన్ ఎ. ఎస్. రాజా మహాసభకు అధ్యక్షత వహించగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర శిశు సంక్షేమ బోర్డు ఛెయిర్మన్ శ్రీమతి దుర్గా భవానీ భక్తవత్సల్ ముఖ్య అతిథిగా వ్యవహరించారు. లయనెస్ ఆరతి మురుగేష్ ''మాస్టర్ ఆఫ్ సెర్మనీస్ '' గా వ్యవహరించి, కార్యక్రమాన్ని నిర్వహించారు. సాయంత్రం జరిగిన సాంస్కృతిక కార్యక్రమాలలో స్థానిక విమెన్స్ కాలేజీ విద్యార్థినులు '' ఫాషన్ పెరేడ్ '' ను, పిల్లలు కూచిపూడి నాట్యాలను ప్రదర్శించారు. లయన్ లేడీస్ మంగళగౌరి, ఆకెళ్ళ సీతాదేవి జానపద గీతాలను పాడారు.

— విలేకరి



రాజమండ్రి ఇన్నర్‌వీల్ క్లబ్ సభ్యులు అధ్యక్షురాలు బి. మృదులా కమలాకర్, కార్యదర్శి కె. నిర్మలా ప్రశాంత్ కుమార్‌ల ఆధ్వర్యంలో కుష్టు రోగులకూ, వారి పిల్లలకూ బ్లాంకెట్లను పంచిపెట్టారు.



కాకినాడ నవ్యాంధ్ర మహిళామండలివారు ప్రముఖ రచయిత్రి శ్రీమతి అడవికొలను పార్వతీదేవి సాహిత్య రజతోత్సవ సందర్భంగా ఆమెను ఘనంగా సన్మానించారు.



# 4 నేరస్థుల కథలు

గౌరాపంత్ శివాని

ఈసారి నేను చూడ్డానికి వెళ్లిన జైలు మరో ప్రాంతంలోనిది. టీకంఘడ్ అనే వూరును శవాల గ్రామం అని కూడా అంటారు. ఆ పేరు ఎలా వచ్చిందో నాకు తెలియదు. కానీ ఆ జైలును చూసినప్పుడు — ఒకప్పటి జ్ఞాపకాలు నన్ను పలకరించాయి. కారణం - నా బాల్యం కొంతకాలంపాటు అక్కడే గడిచింది.

ఆ రోజుల్లో మా నాన్నగారు ఓర్ఛా మహారాజు దగ్గర హోమ్ సెక్రటరీగా పనిచేసేవారు. అందువల్ల జైళ్లశాఖ ఆయన ఆధీనంలోనే వుండేది. మా నాన్నగారు జైళ్ల నిర్వహింపబడే విధానాలలో కొన్ని సంస్కరణలు ప్రవేశపెట్టారు. అప్పట్లో అటువంటి సంస్కరణలను ప్రవేశ పెట్టడం చాలా విడ్డూరంగా చెప్పుకునేవారు. ఉదాహరణకు ఉరిశిక్ష, యావజ్జీవ కారాగారవాస శిక్ష విధింపబడిన ఖైదీలకు —— చేతులతోపాటు కాళ్ళకు కూడా ఆ కాలంలో సంకెళ్లు వేసేవారు. మా నాన్నగారు—— కాళ్ళకు సంకెళ్ళు వేసే పద్ధతిని తొలగించారు.

మా ఇంట్లో తోట పని చెయ్యడానికి అప్పుడప్పుడు బన్నీ అనే ఖైదీ వస్తూ వుండేవాడు. అతను యావజ్జీవ ఖైదీ. అతను మా యింటికి వచ్చేటప్పుడు — కాళ్ళకు సంకెళ్లు లేకపోయినా, చాలా కాలంపాటు కాలి సంకెళ్ళకు అలవాటు పడడం వల్ల కాబోలు .... ఒకొక్క అంగుళానికి ఒకో అడుగువేస్తూ వస్తుంటే ఆ నడకను నేను చాలా విచిత్రంగా చూసేదాన్ని. సంకెళ్ళ వల్ల అతని కాలి మడమలపై గాయాలు, కాళ్లపై పుళ్ళు వుండేవి.

ఒక రోజు — నేను తోటలో ఆడుకుంటూ, మధ్యలో కుతూహలం కొద్దీ అడిగాను — "బన్నీ నువ్వు మంచివాడివి కదా .... నువ్వేం తప్పు చేశావని నీకు శిక్ష వేశారు?" అని అడిగాను.

బన్నీ నన్ను చూసి, చిన్నగా నవ్వి తమాషాగా మీసాలు మెలివేస్తూ, "మా దొర మెడను గొడ్డలితో నరికేశాను!" అన్నాడు ఏదో గొప్పపని చేసినట్లుగా!

"ఎందుకలా చేశావ్?" అని అడిగాను.

బన్నీ ఏమీ చెప్పలేదు. అప్పుడు చెప్పినా సరిగ్గా అర్థం చేసుకోలేని పసివయసు నాది.

ఆ తర్వాత కొన్ని సంవత్సరాలకు నాకు బన్నీ కేసు విషయం పూర్తిగా తెలిసింది.

అతని భార్య ఒక 'తెల్లదొర' యింట్లో వంట పని చేస్తూ వుండేది. తెల్లదొర ఆమెకు ఏవో మాయమాటలు చెప్పి, లోబరచుకున్నాడు. ఈ సంగతి బన్నీకి తెలిసింది. ఐనా మొదట్లో నమ్మలేదు. ఒకరోజు మధ్యాహ్నం అకస్మాత్తుగా అతను ఆ తెల్లదొర యింటికి వెళ్లాడట. అప్పుడు బన్నీ భార్య ఆ దొరతో సరసాలాడుతూ అతనికి అన్నం తినిపిస్తూ వుందట.

ఈ దృశ్యం చూడగానే బన్నీ కాలభైరవుడే అయ్యాడు. బన్నీని చూడగానే, అతని భార్య గజగజ వణికిపోతూ, వేగంగా ఇంట్లోంచి పారిపోయింది. దొర ఏం చేద్దామా అని ఆలోచిస్తుండగానే, బన్నీ తన ఆవేశాన్ని అణచుకోలేక, అల్లంత దూరంలో కనిపించిన గొడ్డలిని తీసుకుని, ఒక్క ఉదుటున అతని మెడ మీద వేటు వేశాడు. దొర మొదలు నరికిన తరువులా కూలిపోయాడు! ఆ సమయంలో తన భార్య అక్కడే వుంటే, ఆమెను కూడా హత్యచేసి వుండేవాడే.

పోలీసులు బన్నీ మీద కేసు పెట్టారు. అందరూ అతనికి వురిశిక్ష పడుతుందనుకున్నారు. ఐతే, క్షణికావేశంలో, తనకు జరిగిన అన్యాయానికి ఏర్పడిన 'షాక్'తో, క్రోధంలో బన్నీ ఆ అఘాయిత్యం చేశాడని — న్యాయమూర్తి అతనికి యావజ్జీవ కారాగారవాస శిక్ష విధించాడు!

నాకు బాగా ఊహ తెలిసిన తర్వాత రచయిత్రిగా నాలో ఏర్పడిన కుతూహలంకొద్దీ ఆ జైల్లో నేరస్థులను చూడాలని అనుకున్నాను. అప్పుడు మా అన్నయ్య ఓర్ఛా మహారాజుకు పెర్సనల్ సెక్రటరీగా పని చేస్తున్నారు. ఐతే, ఆ జైలు సూపర్నెంటు మాత్రం మారలేదు. మా నాన్న ఉద్యోగంలో ఉన్నప్పుడు కూడా ఆయనే ఆ జైలుకు సూపర్నెంటు!

నేను, మా వదిన (అప్పటికి ఆమెకు నాలుగు నెలల క్రితమే మా అన్నయ్యతో వివాహం జరిగింది) జైలును చూస్తామంటే, మొదట ఆ సూపర్నెంటు మా మీదున్న అభిమానంతో చివాట్లు పెట్టారు — "పెద్దింటి ఆడవారు అడుగుపెట్టవలసిన స్థలం కాదిది" అంటూ. ఐనా, నా పోరుపడలేక అనుమతి మంజూరు చేశారు. ఆయన కూడా మాతో పాటే వచ్చారు — నేరస్థుల గురించి వివరించడానికి.

మేము వెళ్ళేసరికి ఖైదీలు రామాయణం చదువుతూ కనిపించారు.

సూపర్నెంటుగారు జైలు గురించి ఏవో వివరాలు చెబుతూ మధ్యలో "అవునూ....మధ్యప్రదేశ్‌కు చెందిన బందిపోటు దేశ్‌పత్ ఈ జైల్లోనే వున్నాడు. చూస్తారా?" అన్నాడు నవ్వుతూ.

నేను ఉలిక్కిపడ్డాను. ఎంచేతంటే దేశ్‌పత్ చేసిన నేరాలను ఆ రోజుల్లో కథలు కథలుగా చెప్పుకునే వారు. చాలా భయంకరమైన మనిషని, ఏ సమయంలో ఎక్కణ్ణించి వచ్చి, ఎవరిని దోచుకుని — ఎలా వెళ్లిపోతాడో ఎవరికీ అంతుబట్టేది కాదని అనుకునేవారు.

ఒకసారి 'లలితపూర్'లో గొప్ప శ్రీమంతుడైన ఒక సేట్ ఆస్తిని దోపిడీచేసి, 'దతియా' గ్రామంలో ఒక పేద అనాథ యువతికి పెళ్లి జరుగుతుంటే, తాను దోచుకున్న డబ్బును ఆ పెళ్లి మంటపంలో వధువుకు కానుకగా యిచ్చి, వెళ్లిపోయాడట. ఇలా అతను చేసిన దోపిడీలు గురించి వింతగా చెప్పుకునేవారు.

అటువంటి దేశ్‌పత్‌ను చూపిస్తాననేసరికి ముందు నేను గాభరాపడ్డాను. అప్పటికే నన్ను అతనున్న చోటికి తీసుకు వెళ్లారు సూపర్నెంటుగారు.

దేశ్‌పత్‌ను చూడగానే చాలా ఆశ్చర్యం కలిగింది. ముడతలుపడ్డ ముఖం, సగం నెరిసిన జుట్టు, ప్రశాంతమైన చూపులు —— వీటి వెనుక అన్ని ఘోరాలు చేసిన మనస్తత్వం దాగి వుండడం నాకు ఆశ్చర్యకరంగానే కనిపించింది.

అతను చేతులు జోడించి, చాలా వినయంగా తలవంచుకుని మా ముందు నిలబడ్డాడు. అతనితో మాట్లాడడానికి నాకు ధైర్యం చాలలేదు.

"సాబ్....భోజనం ఏర్పాట్లు చూసేదా?" అన్నాడు దేశ్‌పత్ సూపర్నెంటుతో. ఖైదీలకు వంట ఏర్పాట్లు చూసే బాధ్యత అతనికి యిచ్చారట.

"ఏం వంట చేయించావ్?" అన్నారు సూపర్నెంటుగారు.

"రొట్టెలు, సెనగపప్పు కూర" అన్నాడు.

"ఖైదీల ఆహారం రుచి చూస్తానన్నారు...." అని నావంక ప్రశ్నార్థకంగా చూసి, మా ఇద్దరికీ – అతనిచేత రొట్టెలు తెప్పించారు సూపర్నెంటుగారు.

అక్కడ కొంచెంసేపు వుండి, ఖైదీల గదులు అవీ చూసి, వురిశిక్ష విధింపబడిన ఖైదీలను చూస్తానని చెప్పాను. "వాళ్లు క్రూరమృగాల్లా వుంటారు. నువ్వు చూడలేవు. ఆ తర్వాత మీ అమ్మ నన్ను తిడుతుంది." అని మందలించారు ఆయన.

అయినా నేను చూస్తాననేసరికి, ఇష్టం లేక పోయినా మమ్మల్ని అక్కడకు తీసుకు వెళ్ళారు.

వాళ్లు వుంటున్న గదులు గుహల్లా చీకటిగా వున్నాయి. 'ఇందులో ఎలా వుండగలుగుతున్నారా' అని ఆశ్చర్యపోయాను నేను.

అక్కడ ఉరిశిక్షకు సిద్ధంగా ఇద్దరు ఖైదీలు వున్నారు. ఏదో ఒకరోజున జైలు సూపర్నెంటు – 'గ్రీన్ సిగ్నల్' ఇస్తారు. అంతే. వాళ్ల ప్రాణాలు గాలిలో కలిసిపోతాయి. అబ్బా....తలుచుకుంటే – చాలా దారుణంగా వుంది.

చాలాకాలం తర్వాత మళ్లీ ఆ జైల్లోకి అడుగు పెట్టగానే, ఈ జ్ఞాపకాలన్నీ ఒక్కసారిగా నన్ను ఉక్కిరి బిక్కిరి చేసేశాయి.

ఐతే, జైళ్లలో అప్పటికీ, ఇప్పటికీ చాలా మార్పులు వచ్చాయి.

అప్పట్లో నేరాలుచేసి, జైలు శిక్షను అనుభవిస్తున్న స్త్రీలు తమ ముఖాలు పరదా చాటున దాచుకునేవారు. "మా ముఖాలు చూస్తే, మేము చేసిన పాపాలు మీకూ అంటుకుంటాయి" అని సిగ్గుతో తలలు వంచుకునేవారు.

కాని, ఇప్పటి ఆడఖైదీలు అలా లేరు. ఏమాత్రం సిగ్గు, సంకోచాలు లేకుండా, నిర్భయంగా మాట్లాడుతున్నారు.

జైలు అధికారి ఒకరు నన్ను ఒక ఆడఖైదీ దగ్గరకు తీసుకు వెళ్ళారు. ఆమె పేరు జానకి.

అంటే మరో జానకి కథ అన్న మాట!

ఈమె ఒక దోపిడీదొంగకు భార్య. ఏ తండ్రి అయినా, తెలిసి, తెలిసి తన కూతుర్ని ఒక బందిపోటు దొంగకు యిచ్చి పెళ్లి చేస్తాడా?

జానకి తండ్రి మాత్రం అలా చేశాడు!

జానకి భర్త రంజిత్ – తన దొంగలముఠాతో అప్పుడప్పుడు బందిపోటు దొంగతనాలు చేసి, ప్రజలను హడలగొడుతూ వుండేవాడు. అయితే చాలామంది దొంగల్లా రహస్యస్థావరాలలో దాక్కునేవాడు కాదు. తన రౌడీ స్వభావాన్ని ప్రదర్శిస్తూ, ప్రజల మధ్యే తిరుగుతూ వుండేవాడు. జనానికి రంజిత్ మంచివాడు కాదని తెలిసినా, అతను గజదొంగ అని పోలీసులకు చెప్పడానికి సాహసించలేకపోయేవారు.

రంజిత్ మంచివాడు కాకపోయినా, తన కూతురు భోగభాగ్యాలతో తులతూగుతుందని ఆశపడి, వయసులో జానకి, రంజిత్‌లకు చాలా తేడా వున్నా కూడా లెక్కచేయకుండా, వాళ్ళిద్దరికీ పెళ్లి చేశాడు జానకి తండ్రి.

మొదట్లో రంజిత్ వ్యవహారం అంతా గందరగోళంగా వున్నా, ఆ తర్వాత జానకికి కూడా ఆ జీవితం చాలా గమ్మత్తుగా కనిపించింది.

దొంగలముఠాకు చెందినవాళ్ళు – తాము దోపిడీ చేసి తెచ్చిన వస్తువులను రంజిత్ దగ్గరకు తీసుకు వచ్చేవాళ్ళు. జానకి కూడా రంజిత్‌తోపాటు వాటినన్నిటినీ కుతూహలంగా చూసేది. బంగారు నగలైతే, వాటినన్నిటినీ కలిపి, కరిగించి-ముద్దచేసి, ఆ బంగారాన్ని అమ్మేవారు. పంపకాలన్నీ రంజిత్ అజమాయిషీలోనే జరిగేవి. దొంగలముఠావాళ్ళు రంజిత్‌ను రాజుగాను, అతని భార్యను రాణిగాను చూసుకుంటూ, గౌరవమర్యాదలతో వ్యవహరించేవారు.

జానకి దొంగసొమ్ము ద్వారా సమకూడిన భోగభాగ్యాలతో విలాసజీవితాన్ని అనుభవిస్తూ వుండేది.

ఇలా వుండగా ఒక రోజు చేసిన దోపిడీలో వచ్చిన నగలలో కళ్ళు మిరుమిట్లు గొలుపుతున్న వజ్రాలహారం ఒకటి జానకిని విపరీతంగా ఆకర్షించింది. తన భర్త అన్ని నగలతోపాటు దాన్నీ కరిగించబోతుంటే, జానకి వద్దని వారించి, ఆ వజ్రాలహారాన్ని తన దగ్గర వుంచుకుంటానని చెప్పింది. ఆ నగ వేసుకుని, బయటకు వెళ్తే ప్రమాదమని, పోలీసులు తేలికగా గుర్తు పట్టడానికి ఆస్కారం వుంటుందని, ఎంతగానో హెచ్చరించాడు రంజిత్.

అది ఎవరికంటా పడకుండా, దాన్ని తను జాగ్రత్తగా దాచుకుంటానని – ప్రాధేయపడుతూ, జానకి అడిగేసరికి, రంజిత్ కాదనలేకపోయాడు.

ఒక రోజు – జానకి, రంజిత్ సినిమా ప్రోగ్రాం వేసుకున్నారు.

జానకి ఖరీదైన దుస్తులు నగలు – వేసుకుని, టిప్‌టాప్‌గా ముస్తాబయింది. బయలుదేరబోతుండగా, ఆ వజ్రాలహారం ఆమెకు జ్ఞాపకం వచ్చింది. అది వేసుకుని, పైట కప్పుకుంటే-ఎవరు చూస్తారనుకుని, ఆ వజ్రాలహారాన్ని అలంకరించుకుంది. పైట కప్పుకోవడం వల్ల-రంజిత్ కూడా ఆ నగ జానకి వేసుకున్నట్లు తెలుసుకోలేకపోయాడు.

సినిమాహాల్లో-బాక్సుసీట్‌లో కూర్చున్న తర్వాత, తనలాగే నగలు అలంకరించుకుని వచ్చిన స్త్రీలను చూడగానే జానకిలో కాస్త అహం తలెత్తింది. తన నగలు అందరికీ తెలిసేలా కప్పుకున్న పైట కాస్త తొలగించింది.

సినిమా విరామసమయంలో జానకి మెడలో వున్న వజ్రాలహారం పలువురి దృష్టిలో పడింది. ఆమె నగపై దృష్టిని కేంద్రీకరించినవారిలో సి. ఐ. డికి సంబంధించినవాళ్ళు కూడా వుండడంతో-వ్యవహారం బెడిసికొట్టింది. సినిమా అయిపోయిన తర్వాత కారులో ఇంటికి వెళ్తున్న రంజిత్‌కు తన కారును ఎవరో వెంబడిస్తున్న అనుమానం వచ్చింది. వాళ్ళు పోలీసుశాఖకు చెందినవాళ్ళే అయివుంటారన్న నమ్మకం ఏర్పడగానే, జానకిని పరిశీలనగా చూశాడు. ఆమె మెడలో వజ్రాలహారం కనిపించింది. ఛడామడా ఆమెను తిట్టాడు. కానీ ఏం లాభం....! అప్పటికే జరగవలసింది జరిగిపోయింది!

ఎంత వేగంగా కారును పోనిచ్చి, ఎన్ని మలుపులు త్రిప్పినా, చివరికి పోలీసులకు లొంగిపోకతప్పలేదు.

జానకి ఆ వజ్రాలహారాన్ని దాచేసింది. ఐనా, పోలీసు వాళ్ల సోదా చేసేసరికి దొరికింది.

దాంతో రంజిత్ నేరాలన్నీ బయటపడ్డాయి. అతనికి కఠినకారాగారవాసశిక్ష పడింది. నేరాలలో భాగస్వామ్యం వున్నందువల్ల జానకికి కూడా కొంతకాలం పాటు శిక్ష పడింది. ఇద్దరినీ వేర్వేరు జైళ్ళలో వేశారు.

మరో రెండు నెలల్లో జానకి విడుదల అవుతుందట. ఇదీ ఆమె కథ!

"విడుదల అయిన తర్వాత ఏం చేయాలనుకుంటున్నావ్" అని అడిగాను.

"ఎనిమిదవ తరగతి వరకు చదువుకున్నాను. స్కూల్లో పంతులమ్మ ఉద్యోగమైనా నాకు దొరకక పోతుందా?" అన్నది జానకి ఎంతో నిబ్బరంతో. నాకు ఏం చెప్పాలో అర్థం కాక, అక్కణ్ణుంచి మరో జైలు గదికి బయలుదేరాను. □

## చిట్టి కథ

# నరసింహం

నరసింహారావు బాగానే చదువుకున్నాడు. కష్టపడి చిన్న ఉద్యోగం కూడా సంపాదించాడు. ఉద్యోగం వచ్చింది గదా అని పెళ్ళి చేసుకున్నాడు. పెళ్ళి జరిగిందికదా అని పిల్లలు పుట్టుకొచ్చారు. ఉద్యోగం టెంపరరీ కావడం వల్ల నాలుగేళ్ళకే ఊడి పోయింది. భార్యా పిల్లలు పర్మనెంటు కావడం వల్ల అతుక్కుపోయారు. కుటుంబపోషణ కష్టమై పోయింది. నరసింహారావుకి, ఏమీ దిక్కు తోచడం లేదు. ఇలా వుండగా ఆ వూళ్ళోకి ఒక పెద్ద సర్కసు కంపెనీ వచ్చి గుడారం వేసింది. సర్కస్ కంపెనీలో వందలకొద్దీ ఉద్యోగులుంటారని నరసింహారావుకి బాగా తెలుసు. వెళ్లి ఆ మేనేజరు గార్ని కలుసుకుని నమస్కారం పెట్టాడు "బాగా చదువుకున్నారు. విచక్షణాజ్ఞానం వున్న యువకులు. మీకు యిక్కడ ఏం పని వుంటుందండీ" అన్నాడు సర్కస్ మేనేజరు. "బాబ్బాబు, అలా అనకండి, చదువుకున్నమాట నిజమే. కావాలంటే ఆ డిగ్రీ కాగితాలతో చీపురుకట్టి మీ దేరా అంతా ఊడుస్తాను, ఎంత చిన్నదైనాసరే నాకొక ఉద్యోగం యిప్పించండి". అని ప్రాధేయపడ్డాడు నరసింహారావు. మేనేజరు కాసేపు ఆలోచించి, "మా సర్కస్‌లో మంచి ఫీట్స్ చేసే ఒక సింహం ఈ వూరు వస్తూ వుండగా, దారిలో చచ్చిపోయింది. అది లేకపోతే కష్టమే మాకు, మీరాపని చేయగలరా?" అన్నాడు. "బాబోయ్" అని నోరు వెళ్ళబెట్టాడు నరసింహం. "వేషం మాత్రమే, ఇటునుంచి మెట్లెక్కి నాలుగడుగులు ఒక సన్నటి చెక్కవంతెన మీద నడిచి అటునుంచి దిగి మళ్లీ బోనులోకి పోవడమే" అన్నాడు మేనేజరు. తప్పదనుకున్నాడు నరసింహారావు. కుటుంబపోషణ ముఖ్యం అతనికి. తొలిరోజు గడిచింది. ప్రేక్షకులు కూడా బాగానే చప్పట్లు కొడుతున్నారు. పదిహేను రూపాయలు చేతి కొచ్చాయి. పని కూడా చాలా తేలిక. చిన్నప్పుడు బళ్లో జారుడుబల్ల మెట్లెక్కి దిగినట్లే వుంది. బాగానే వుందనుకున్నాడు. మూడో రోజు ప్రదర్శనలో ఇంటి బాధల్ని గురించి ఆలోచించుకుంటూ వంతెన మీద నడుస్తూ పరధ్యానంగా అలా క్రిందికి చూశాడు. గత రెండు రోజుల్లో ఎప్పుడూ అలా చూళ్లేదు. చూసి గతుక్కుమన్నాడు. అన్నీ సింహాలే బాబోయ్, కాలుజారి క్రిందపడితే ఏమన్నా వుందా? పెద్దగా అరవలేదు. జనానికి తను అసలు సింహం కాదని తెలిస్తే పట్టుకు చావగొడతారు. క్రింద చూస్తే అడవి సింహాలు. "వెంకటేశ్వర పాహిమాం", అన్నాడు చిన్నగా. తను మనిషన్న సంగతి ఈ సింహాలకి తెలిస్తే బతకనిస్తాయా, ఓరి దేవుడా, తాను కూడా నిజం సింహం అని మిగతా సింహాలకి కూడా నమ్మకం కల్గిస్తేనే కానీ ప్రాణం దక్కదనుకున్నాడు. యింటి దగ్గర ప్రాక్టీస్ చేసిన సింహం అరుపు క్రింద సింహాలకి మాత్రమే వినిపించేంత బిగ్గరగా అరిచాడు. క్రింద నుంచి సింహాలు, మెడలు పైకెత్తి చూశాయి. "ఎందుకలా అరుస్తావ్, యిక్కడ నువ్వొక్కడివే సింహాని వనుకొంటున్నావా? యేమిటి? మేమూ సింహాలమే, యస్, వియారాల్సో లాయన్స్!" అన్నది క్రింద నుంచి ఒక ముసలి సింహం. నరసింహారావుకి కళ్ళు తిరిగినంత పనయింది!

—అబ్బూరి రాజ్యలక్ష్మిదేవి



## 1978లో....

క్యూబా రాజధాని హవానా నగరంలో పదకొండవ అంతర్జాతీయ యువజనోత్సవాలు జరిగాయి. ఆ ఉత్సవాలలో వివిధ రంగాలలో ఆరితేరిన యువతీ యువకులు ఎందరో పాల్గొన్నారు. ఒక దేశం సంస్కృతీ సంప్రదాయాలు మరొకరు తెలుసుకోవడం, ఒకరి కళలు మరొకరు నేర్చుకోవడం, అన్నిటికీ మించి వివిధ దేశాల మధ్య సామరస్యాన్ని పెంపొందింపజేయడం ఈ యువజనోత్సవాల ముఖ్యోద్దేశం.

ఆ విధంగా మన నాట్యం గురించి విదేశీయులకు తెలియజేయడానికి క్యూబాలో జరిగిన అంతర్జాతీయ యువజనోత్సవాలకు భారతదేశం తరపున ప్రతినిధిగా ఎన్నికైన వనిత -కుమారి జి. సరళ.

సరళ కూచిపూడి నృత్యంలో బాగా కృషి చేసి పేరు తెచ్చుకున్నది. కూచిపూడి నాట్య శాస్త్రంలో ఉద్దండులైన జె. సీతారామశాస్త్రి, వెంపటి చిన సత్యం, భారత కళా ప్రపూర్ణ కోరాడ నరసింహారావు, సుమతీ కౌశల్ వంటి ప్రముఖుల వద్ద ఆమె శిక్షణ పొందింది!

కుమారి సరళ తన ఎనిమిదవ ఏటినుంచే నాట్య ప్రదర్శనలు ఇస్తూ పలువురి ప్రశంసలు అందుకోవడం ఒక విశేషం. మద్రాసు, హైద్రాబాదు దూర దర్శన్ ద్వారా ఆమె నాట్యాలు ప్రదర్శింపబడ్డాయి. రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి ఎదుట నాట్య ప్రదర్శన ఇచ్చి ఆయన మెప్పు పొందింది. ఆ నాడు ఆమె చేసిన 'అర్ధనారీశ్వర' నృత్యానికి సభికులు ముగ్ధులయ్యారు.

సరళ హైద్రాబాదు సరోజినీ నాయుడు స్త్రీల కళాశాలలో బి. ఏ. చివరి సంవత్సరం చదువుతున్నది. ఒకవైపు విద్యార్ధినిగా వుంటూనే మరో వైపు 'నృత్య నికేతన్' పేరిట నాట్య పాఠశాలను

# జి. సరళ



ప్రారంభించి ఔత్సాహిక నాట్యకారిణుల కెందరికో నాట్యం నేర్పుతున్నది. అందుకు ఆమె తండ్రి శ్రీ గంటా రంగారావు ప్రోత్సాహం తోడయింది. ఆయన తాడేపల్లిగూడెంలో డిప్యూటీ తాశిల్దారుగా వున్నారు. ఇటీవల జరిగిన ఒక 'అందాల రాణి' పోటీలో కుమారి సరళ 'అందాల రాణి'గా ఎన్నిక కావడం విశేషం!

కూచిపూడి నాట్యం మధురమైన భక్తి భావానికి ప్రతీక. వల్లభాచార్యులు, జయదేవుడు వంటి కవుల రచనలలో ఈ భక్తిభావం ప్రేమ తత్వంతో మిళితమై వుంటుంది. భారతీయ నృత్యరీతులలో శృంగార రసం ప్రముఖంగా కనిపిస్తుంది. ఈ శృంగార రసంలో కూడా మన నృత్యాలలో అధికంగా ప్రేయసీ, ప్రియుల ఎడబాటునే చూపారు. ఈ ఎడబాటునే కవులు 'విరహం' అని తమ కావ్యాలలో వర్ణించారు. కలయికలో ఆనందం వుంది. విరహం వెనుక తియ్యని ఆవేదన దాగి వుంటుంది. విడివడిన ప్రేయసీప్రియులు కలుసుకుంటే – అందులో మామూలు కలయిక కన్న మధురమైన ఆనందం వుంటుంది. సరిగ్గా అటువంటిదే రాధాకృష్ణుల ప్రేమ కూడా.

"కూచిపూడి పద్ధతిలో నృత్యరీతులన్నీ కూడా చాలామటుకు రాధాకృష్ణుల ప్రేమ మీదనే అల్లబడి వున్నాయి. అందుకే నేను కూడా రాధామాధవుల ప్రణయగాథను ఆధారంగా చేసుకుని ఒక నృత్య నాటికను రూపొందించాను. 'రాధా మాధవీయం' పేరిట ప్రదర్శింపబడుతున్న ఈ నృత్యనాటిక ప్రేక్షకుల ఆదరణ చూరగొని బాగా విజయవంతమవడంతో నా కృషికి తగ్గ ఫలితం లభించింది. ఇటువంటి నృత్యనాటికలు మరికొన్ని రూపొందించాలనీ, వాటిని మన దేశంలోనేకాక విదేశాలలో కూడా ప్రదర్శించాలని వుంది" అంటూ తన ఆశయాన్ని వ్యక్తం చేసింది కుమారి సరళ. □

# సమస్యలూ సలహాలూ

నిర్వహణ: కమలా వసంత కుమార్

టి. జె.

నా వయస్సు 23 సంవత్సరాలు. నాకు చిన్నతనం లోనే కాళ్ళు పని చెయ్యలేదు. ఎన్ని మందులు వాడినా, ఎంతమంది డాక్టర్లను చూసినా లాభం లేక పోయింది. నేటికీ నాది నడవలేని పరిస్థితి. నా అంగ వైకల్యానికి ఒక మూల బాధపడుతున్నా, చేతిపన్లు చెయ్యడం నేర్చుకున్నాను. అల్లికలు, కుట్లు, పెయింటింగ్స్ నేర్చుకున్నాను; ఇరుగు పొరుగులకు నేర్పుతున్నాను. ఇలా నా జీవితం సాగిపోతున్నా కూడా నాకు మనశ్శాంతి, తృప్తీ లేకుండా వున్నాయి. ఎంత అణచుకుందామనుకున్నా - నా దిగులును నేను అణచుకోలేకపోతున్నాను. నాకు మీరు ఎలాంటి సలహా ఇస్తారోనని ఎదురు చూస్తున్నాను.

నిజానికి మీరు ఒక విధంగా దిగులుపడడం లేదు! ఎన్నో నేర్చుకున్నారు; నేర్పుతున్నారు. మీ జీవితాన్ని పచ్చగా చేసుకుంటున్నారు. నిరంతరం దిగులు, బాధలూ వుంటే ఇవన్నీ ఎలా నేర్చుకుని వుండేవారు?...అయితే, అప్పుడప్పుడు మనసులో బాధ వేస్తుంది. అది సహజమే! కాని, ఏం చెయ్యగలం?....విధి కొందర్ని అలా చేస్తుంది. దానికి మనం కృంగిపోకూడదు. అలాంటప్పుడే, ఆ దిగులును జయించగల మనోనిబ్బరం అలవాటు చేసుకోవాలి. మీరు మంచి పత్రికలు చదవండి; పుస్తకాలు చదవండి; మీకు వున్న అభిరుచిని అభివృద్ధి చేసుకోండి. ఇంకా ఎన్నో ఎన్నో చేతిపన్లూ అవీ నేర్చుకోండి. రోజూ వీలున్నంత సేపు, అలాగే కాలక్షేపం చేస్తూ వుండండి. మీకు కావలిసిన ధైర్యాన్ని అదే అందిస్తుంది!

ఆర్.

నాకు అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళూ వున్నారు. అమ్మా నాన్నా లేరు. మెట్రిక్ వరకూ చదువుకున్నాను. మా యింట్లో అందరూ అదో రకం: ఎప్పుడూ తాగుడు మైకంలో వుంటారు. నాకు దేనికీ స్వతంత్రం లేదు. బానిసలా వుంటున్నాను. ఒకతను నాకు బాంక్‌లో వుద్యోగం ఇప్పిస్తానంటున్నాడు. ఎలాంటి ఉద్యోగం వస్తుంది? జీతం ఎంత వుంటుంది? ఈ నరకం నుంచి విడిపోయి నేను హాయిగా జీవించగలనా?

మెట్రిక్ పాసయినంత మాత్రాన బాంక్‌లో వుద్యోగం రాదు. అక్కడ ఖాళీ వున్నప్పుడు మీరు దరఖాస్తు చెయ్యాలి. బాంక్‌లో గుమస్తాగా వుద్యోగం చెయ్యాలంటే, బాంక్ పరీక్షలకి కూచోవాలి. బాంకులు వేసే ప్రకటనల్ని చూస్తూ వుండండి. ముందుగా మీ పేరు ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్‌చేంజ్‌లో రిజిస్టర్ చేసుకోండి! అంతేగాని, ఎవర్ని పడితే వాళ్ళని నమ్మేయకండి.

యస్. కె.

నా భర్త రైల్వేలో ఉద్యోగం చేసి మరణించారు. నా పెద్ద కూతురు మెట్రిక్ చదివింది. అందరూ ఆమెకు 'రైల్వేలో ఉద్యోగం వస్తుంది' అంటున్నారు. నిజంగా వస్తుందంటారా? మాది బీద కుటుంబం. అందులోనూ అది ఆడపిల్ల. ఎక్కువగా మోసం చేసే మనుషులే కనిపిస్తున్నారుగాని, నిజం చెప్పేవాళ్ళు కనిపించడం లేదు. ఏం చెయ్యాలి?

మీ భర్త ఉద్యోగంలో వుంటూ మరణించారా — లేక రిటైర్ అయ్యాక మరణించారా—మీరు సరిగ్గా తెలియజెయ్యలేదు. రిటైర్ కాక ముందు చనిపోయి వుంటే, మీ కుటుంబానికి 'పెన్షన్' వస్తుంది. మీ అమ్మాయి చదువు, అర్హతలనుబట్టి ఆమెకు తగిన ఉద్యోగం కూడా ఇవ్వడానికి అవకాశాలు వున్నాయి. ఏమైనా మీరు మధ్య వాళ్లను కాకుండా, రైల్వే అధికారులను కలుసుకుని, విషయం వివరించండి; వాళ్ళు తప్పకుండా సహాయం చేస్తారు.

యస్.

నా వయసు 33 సంవత్సరాలు. మూడేళ్ళ క్రితం నాకు పెళ్ళి జరిగింది. మా అక్కలు, బావలూ కలిసి ఒక నిరుద్యోగితో నాకు వివాహం చేశారు. పెళ్ళయిన తర్వాత నా భర్త మా దగ్గర పది మాసాలపాటు వుండి, మా బావలు చెప్పినట్టుగా ఉద్యోగం ఇప్పించలేదని, ఆయన తలిదండ్రుల దగ్గరకు వెళ్ళిపోయారు. "మీ వాళ్ళు నన్ను మోసంచేశారు. నిన్ను విడిచి పెట్టేస్తాను. విడాకులు ఇస్తాను." అని ఆయన నాకు రాస్తున్నారు. ఈ విషయాన్ని మా అక్కలూ బావలూ పట్టించుకోడం లేదు. నన్ను అక్కడికి పంపడం లేదు. మరి నన్నేం చెయ్యమంటారు?

మీరు నిరుద్యోగిని వివాహం చేసుకోడం, బాధాకరమైన విషయమే. మీ భర్తకి ఉద్యోగం లేకుండా, మీరు మీ జీవితాన్ని సవ్యంగా ఎలా గడుపుకోగలరు? అయిందేదో అయింది. అక్కల్నీ బావల్నీ నిందించకుండా, మీరు మీ భర్తని ఉద్యోగానికి గట్టిగా ప్రయత్నించమని చెప్పండి. ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్‌చేంజ్‌లో పేరు నమోదు చేసుకోమనండి. మీరు కూడా మీ చదువుకు తగ్గట్టు ఏదైనా ఉద్యోగం ప్రయత్నించండి. ఇద్దరూ కలిసి జీవిత నావను నడుపుకుంటూ రావాలిగాని, ఒకర్ని ఒకరు నిందించుకుంటూ 'విడాకులు' వరకూ రావడం మాత్రం మంచిది కాదు!

కె. యస్.

నా వయసు 16 సంవత్సరాలు. పదో తరగతి చదువుతున్నాను. నేనూ, మా క్లాసులో వున్న ఇంకో అబ్బాయి ప్రేమించుకున్నాము. ఏకాంతంగా చాలాసార్లు కలుసుకుని మాట్లాడుకున్నాము. అతను 'సెక్స్' కోరికలు కోరితే వారిస్తూ వచ్చాను. మా ప్రేమ విషయం మా వాళ్ళకి తెలియదుగాని, మా క్లాసు వాళ్ళకు తెలుసు. వాళ్ళు మమ్మల్ని అల్లరి చేయడానికి మా పేర్లు గోడల మీద రాయడంతో ఇంట్లో వాళ్ళకి తెలిసిపోయింది. నాకు చాలా అవమానంగా వుంది. పైగా అతను చంచలమైన మనిషిలా కనిపిస్తున్నాడు. ఎవర్ని చూసినా, నేను ఎంతో బాధపడిపోతున్నాను. నన్నేం చెయ్యమంటారు?

పదో క్లాసులోనే మీరు 'ప్రేమ'లో పడడం నిజంగా విచారించదగ్గ విషయం. 'గుడ్డిప్రేమ' అంటే - ఇదే. వెనకా ముందు, మంచీ చెడ్డా ఆలోచించుకోకుండా, ఇంకా సరిగా జ్ఞానం తెలియని

వయసులో 'ప్రేమ'లో పడడం, దానివల్ల బాధ పడడం–తలచుకుంటే బాధాకరంగానే వుంటుంది. నిజానికి మీది, కచ్చితమైన 'ప్రేమ' కాదు. ఏదో కాలక్షేపానికి, ఆనందంగా కలిసి, కబుర్లు చెప్పుకునే ప్రేమ. అంచేత, ఆ కథంతా మరిచిపోయి, మళ్ళీ అలా 'ప్రేమ'లో పడకుండా, బుద్ధిగా చదువుకోండి. మంచి చదువు, విచక్షణా వుంటే జీవితంలో సుస్థిరమైన స్థానం సంపాయించుకోగలుగుతారు.

**యం. జి.**

నాకు వివాహమై పదమూడేళ్ళయింది. నా వయస్సు ఇప్పుడు 28 ఏళ్లు. పెళ్ళి జరిగి ఇన్నేళ్ళయి నా మాకు పిల్లలు లేరు. నా భర్త వయసు – 45 సంవత్సరాలు. ఎందరో డాక్టర్లను చూశాము. ప్రయోజనం లేకుండా పోయింది. మాకు దాంపత్య సుఖం కూడా సరిగా లేదు. ఆయనలోనే ఏదో లోపం వున్నదని అందరూ అంటున్నారు. మా కుటుంబాల్లో మా తలిదండ్రులకు నేను ఒకతెనూ, వారి తలిదండ్రులకు ఆయన ఒక్కరూ కావడంతో, మాకు సంతానం లేదని మా పెద్దలు అల్లాడి పోతున్నారు. మా కొరతను తీర్చే సలహాను ఇవ్వగోరుతున్నాను.

**మీ ఉత్తరాన్ని బట్టి చూస్తే మీ భర్తకు 'నపుంసకత్వం' వున్నట్టుగా అర్థమవుతున్నది. ఆ విషయం మీకుగాని, మీ భర్తకుగాని ముందుగానే ఎందుకు అర్థమవలేదో, ఆశ్చర్యంగానే వున్నది. ఏమైనా, కంగారు పడవలసిన అవసరం ఏమీలేదు. మీరు ఎలాగూ పెద్ద పట్నంలోనే వున్నారు కాబట్టి, పెద్ద ఆసుపత్రిలో వుండే 'సైకియాట్రిస్ట్'ను సంప్రతించండి. వాళ్లు మీకు తగిన సలహా ఇవ్వగలుగుతారు.**

**ఆర్. ఆర్.**

నాకు వివాహమై తొమ్మిది సంవత్సరాలైంది. ముగ్గురు పిల్లలు. అయితే, పెళ్ళయింది లగాయతు నేటివరకూ కూడా నేను మానసికంగా ఎలాంటి సౌఖ్యానికీ నోచుకోలేదు. దానికి కారణం - నా మీద నా భర్తకు ఏదో అనుమానం! అయనకి చెప్పకుండా ఎక్కడికీ వెళ్ళను; ఎవరితోనూ మాట్లాడను. అయినా, ఆయన ఎందుకని నన్ను తొలినుంచి హింసిస్తూ, బాధలు పెడుతున్నారో అర్థం కావడం లేదు. ఎప్పటికప్పుడు చచ్చిపోవాలని అనిపిస్తూ వుంటుంది. కాని, పిల్లలను చూడగానే ఆ ఉద్దేశం మారిపోతూ వుంటుంది. ఏమైనా సుఖానికీ, శాంతికీ నేను నోచుకోడం లేదు. నా సమస్యకు పరిష్కారం ఏమిటి?

ఒక వ్యక్తి, తొమ్మిదేళ్ళుగా మిమ్మల్ని అనవసరంగా బాధిస్తూ వుంటే, మీరు ఇంతకాలం ఎలా సహించగలిగారు? - ముందే మీరు మేల్కొనవలసింది. ఏమైనా మీ సమస్య బాధాకరమైనదే. **తోటి** మనుషుల మీద గౌరవం, ప్రేమ లేని వాళ్ళతో కలిసి వుండడం అన్యాయమే. మీరు న్యాయస్థానం ద్వారా వెళ్ళి 'విడాకులు'కు అర్థిస్తానని మీ భర్తతో గట్టిగా చెప్పి చూడండి. పైగా, అలాంటి తండ్రులవల్ల పిల్లలకూ ఎంతో కీడు వాటిల్లుతుంది. తండ్రిని, అతని ప్రవర్తననూ చూసి వాళ్ళు సవ్యంగా పెరగరు; పెరగలేరు. అలాంటి వాతావరణం నుంచి, ముఖ్యంగా పిల్లల్ని తప్పించాలి.

**డి. ఆర్.**

నాకు వివాహమై నాలుగేళ్ళయింది. ఇద్దరు సంతానం. మావారు నాతో బాగానే వుంటారు. కాని, మా వివాహానికి ముందు, ఆయనకు ఇంకొక ఆమెతో సంబంధం వుండేదిట. ఆయనే చెప్పారు. అప్పుడు నేనేమీ పెద్దగా పట్టించుకోలేదు. అయితే, సంవత్సరం కిందట మళ్ళీ ఇంకొక ఆమెతో సంబంధం పెట్టుకున్నారు. తన బలహీనతకు క్షమాపణ చెప్పుకున్నా కూడా - నాకేమిటో దిగులుగానూ బాధగానూ వుంటున్నది. 'శీలం చెడిపోయిన భర్తతో చేరి, నేనూ చెడిపోయానే' అని నిరంతరం బాధ పడుతూ వుంటాను. ఆయనకి ఎలాంటి బాధ లేకపోయినా, నాకు మాత్రం చాలా బాధగా వుంది. నాకు మీరు ఎలాంటి సలహా ఇస్తారు?

మీ భర్త అవిశ్వాసానికి మీరు పడే బాధను ఎవరైనా ఊహించుకోగలరు. తాను అక్రమ సంబంధాలను పెంపొందించుకొని, మిమ్మల్ని బాధించడం విచారకరం. అయితే, ఆయన ఉన్న నిజాన్ని మీతో చెప్పి, క్షమాపణ అడగడం కొంతవరకూ హర్షించదగ్గ విషయమే. అంటే, కొంతవరకూ మీరు అంటే గౌరవం, ప్రేమా వున్నాయన్న మాట. అంచేత, ఆయనతో సావకాశంగా కూర్చుని మీరు ఎంత బాధపడుతున్నారో వివరించండి. ఆయనను మీరు ఎలా క్షమించగలిగారో, చెప్పండి. మీ మనసునూ మిమ్మల్నీ అర్థం చేసుకోమనండి. మీ వైవాహిక జీవితంలో 'చిచ్చు' రగిల్చే పనులు మానమనీ, నిదానంగా, శాంతంగా చెప్పండి. మీరు కూడా మనసు మరల్చుకుని, సుఖ సంసారం సాగించండి. □

**లోకజ్ఞానం - సమాధానాలు**

1. అలెగ్జాండర్ మన దేశం మీదకి క్రీ. పూ. 327-326 లో దండయాత్ర చేశాడు.
2. మన దేశంలో నేటికీ అగ్నిపర్వతం ఉన్నది. ఐతే దక్కన్ పీఠ భూమిలో కాదు. నికోబార్ దీవులలోని బారెన్ దీవిలో. ఈ మధ్యలో 18వ శతాబ్ది తొలి రోజుల్లో మాత్రమే ఈ అగ్నిపర్వతం ఒకసారి అగ్నిజ్వాలలని విరజిమ్మింది. అప్పటి నుంచి అణిగి మణిగి వున్న ఈ అగ్నిపర్వతపు దీవిలో ఇప్పటికీ ఆ క్రేటర్ గోడలు వున్నాయి.
3. ఆరావళి పర్వతశ్రేణి
4. అరుణాచల్ ప్రదేశ్‌లో, పెట్రోలియం నూనె, గ్యాస్ అక్కడ వున్నట్లు కనుగొనబడింది.
5. ఈశాన్య పర్వత సానువులలోని ఖాసీ కొండల మీద వుంది.
6. అరుణాచల్‌ప్రదేశ్‌ను.
7. జాయ్ ఆడామ్‌సన్. క్రూర మృగాలంటే ఇష్టపడే జాయ్ ఆడామ్‌సన్ వాటి నెన్నటినో పెంచింది. కాని ఈ మధ్య ఒక సింహం వాతబడి మరణించింది.
8. విన్‌స్టన్ చర్చిల్. 1953 లో.
9. ఫ్రాన్స్‌కు చెందినది. మార్చి 28-29, 1955 నాడు గంటకి 329 కిలో మీటర్ల వేగంతో (112 టన్నుల బరువుతో సహా) నడిచి, రికార్డు నెలకొల్పింది. జపాన్‌లోని 'న్యూ టొకైడో'- 512 కిలో మీటర్ల దూరం గల టోక్యో—ఒసాకా నగరాల మధ్య గంటకి 160 కిలో మీటర్ల వేగంతో ప్రయాణం చేస్తున్నది. త్వరలో ఈ వేగం గంటకి 250 కిలో మీటర్లకి చేరుకోగలదని అంచనా వేస్తున్నారు.
10. సర్ ఫ్రాంక్ విటిల్. ఇంగ్లండు దేశస్థుడు. 1937 లో కనుగొన్నాడు. జెట్ ఇంజన్‌తో మొట్టమొదటి విమానయానం ఆగస్టు 27 1939 న జరిగింది.

హైద్రాబాదులోని నెహ్రూ జువలాజికల్ పార్కు చూసిన వారు చరిత్రపూర్వం నాటి అక్కడి రాక్షస జంతువుల శిల్పాలను తప్ప కుండా చూసే వుంటారు. అవి రాతి చెక్క డాలు అయితే—ఈ వర్ణచిత్రాల్లో కనిపిస్తున్న 'జంతువు' చెట్టు కొమ్మమీద చిత్రిక పట్టినది. అంతే తేడా చెక్క మీద ఇంత చక్కగా ఈ 'డైనొసారస్' అనే రాక్షస జంతువును చెక్కిన వనిత - శ్రీమతి కృష్ణాదత్.

ఆమె భర్త రైల్వేలో ఉన్నతోద్యోగి కావడంతో అక్కడి గార్డన్ రీచ్ ప్రాంతంలో ఒక పెద్ద ఉద్యానవనంగల బంగళాలో నివసిస్తున్నారు. శ్రీమతి కృష్ణా దత్‌కి అక్కడ పడివున్న చెట్టుకొమ్మలు చూడగానే తమ ఉద్యానవనం అందానికి తోడ్పడే అలంకరణ వస్తువులు తయారు చేయాలనే కోరిక కలిగింది. కాని అవి విలక్షణంగానూ, అందరినీ ఆకట్టుకునేటట్టు గానూ వుండాలని ఆమె భావించారు. వేలాది సంవత్సరాల క్రితం భూమి మీద సంచ రించిన రాక్షస జంతువుల గురించి ఆమెకు స్ఫురించింది. తనదంటూ ఒక ప్రత్యేకమైన బాణీలో కొంత ఊహాశక్తిని జోడించి ఆ రాక్షస జంతువుల ఆకారాన్ని చెట్టు కొమ్మల మీద చెక్కడం ప్రారంభించారు ఆమె. ఈ రెండవ చిత్రంలో కనిపిస్తున్నది—డాంటే రాసిన 'డివైన్ కామెడీ'లో వర్ణింప బడిన 'అధోలోకానికి' ప్రతిరూపం. వంకర టింకరగా వున్న చెట్టు కొమ్మ మీద ఈ 'ప్రతిమ' చెక్కడానికి అమెకు ఆర్నెల్లు పట్టింది.

'ఇవి ఆ ఉద్యానవనానికి విశిష్టతను చేకూర్చి పెట్టాయి' అని వాటిని చూసిన పలువురు శ్రీమతి కృష్ణాదత్‌ను మెచ్చు కున్నారు. ఇవేకాక ఇటువంటి కోవకు చెందిన 'చెక్క శిల్పాల'ను మరికొన్నిటిని కూడా ఆమె రూపొందించారు. □

## మరో రథం ముగ్గు

మొదటి చిత్రంలో చూపినట్లుగా ఏ వరుసకి ఆ వరుసలో లెక్క ప్రకారం (ముగ్గు సైజుని బట్టి) × గుర్తులు పెట్టుకోవాలి. వేయబోయే ముగ్గు సైజుని బట్టి వరుసగా × గుర్తు పెట్టుకున్నాక — ఒక గుర్తు నుంచి మరో గుర్తుకు రెండవ చిత్రంలో చూపినట్లుగా గొలుసు కట్టులా కలుపుకోవాలి. ఇలా అన్ని వరుసలలోని × మార్కులని ఒకదానితో మరొకదానిని కలిపి ముగ్గు పూర్తి చెయ్యాలి. రథ చక్రాలకు కూడా × గుర్తులను చక్రం ఆకారంలో వేసి ముగ్గులోలా కలిపి వేసుకోవాలి. ఈ × గుర్తులను వరుస క్రమంలో పెట్టుకోవడంలో శ్రద్ధ చూపిస్తే ఈ ముగ్గు సులభంగా వేసుకోవచ్చును.

—కొనకళ్ల తేజస్కుమారి, రాజమండ్రి


1


2



# సంస్కృత పాఠమాల 16

సంస్కృతమున సుబంత శబ్దములందున్న పుంలింగ, స్త్రీలింగ, నపుంసకలింగ శబ్దములలో పుం, స్త్రీ, లింగశబ్దముల పరిణామములను, (భిన్నభిన్న విభక్తులతో, భిన్నభిన్న వచనములలో) ముందు పాఠములలో తెలిసికొన్నాము.

ఇప్పుడిక కొన్ని నపుంసక శబ్దముల పరిణామములను గమనింతము.

నపుంసక లింగినః శబ్దాః **अथनपुंसक लिगिनः शब्दाः** నపుంసక లింగ శబ్దములు

అకారాన్తః నపుంసకలింగః అజరశబ్దః (అజరమనగా ముసలితనము)

**अकारान्तः नपुंसक लिगः अजर शब्दः** అకారాంతము నపుంసక లింగము అజరశబ్దము.

| | ఏకవచనము | ద్వివచనము | బహువచనము | |
|---|---|---|---|---|
| **प्रथमा** | అజరమ్ | అజరే, అజరసి | అజరాణి, అజరాంసి | ప్రథమావిభక్తి |
| **द्वितीया** | అజరమ్, అజరసమ్ | అజరే, అజరసి | అజరాణి, అజరాంసి | ద్వితీయావిభక్తి |
| **तृतीया** | అజరేణ, అజరసా | అజరాభ్యామ్ | అజరైః | తృతీయావిభక్తి |
| **चतुर्थी** | అజరాయ, అజరసే | అజరాభ్యామ్ | అజరేభ్యః | చతుర్థీవిభక్తి |
| **पञ्चमी** | అజరాత్, అజరసః | అజరాభ్యామ్ | అజరేభ్యః | పంచమీవిభక్తి |
| **षष्ठी** | అజరస్య, అజరసః | అజరయోః, అజరసోః | అజరాణామ్, అజరసామ్ | షష్ఠీవిభక్తి |
| **सप्तमी** | అజరే, అజరసి | అజరయోః, అజరసోః | అజరేషు | సప్తమీవిభక్తి |
| **संबोधनम्** | హే అజర | హే అజరే, హే అజరసి | హే అజరాణి, హే అజరాంసి | సంబోధనా |

ఇకారాన్తః నపుంసక లింగః వారి శబ్దః ఇకారాంత నపుంసక లింగము వారి శబ్దము **इकान्तः नपुंसक लिगः वारि शब्दः**

వారి = జలము

| | ఏకవచనము | ద్వివచనము | బహువచనము | |
|---|---|---|---|---|
| **प्रथमा** | వారి | వారిణీ | వారిణి | ప్రథమావిభక్తి |
| **द्वितीया** | వారి | వారిణీ | వారిణి | ద్వితీయావిభక్తి |
| **तृतीया** | వారిణా | వారిభ్యామ్ | వారిభిః | తృతీయావిభక్తి |
| **चतुर्थी** | వారిణే | వారిభ్యామ్ | వారిభ్యః | చతుర్థీవిభక్తి |
| **पञ्चमी** | వారిణః | వారిభ్యామ్ | వారిభ్యః | పంచమీవిభక్తి |
| **षष्ठी** | వారిణః | వారిణోః | వారిణామ్ | షష్ఠీవిభక్తి |
| **सप्तमी** | వారిణి | వారిణోః | వారిషు | సప్తమీవిభక్తి |
| **संबोधनम्** | హే వారే, హే వారి | హే వారిణీ | హే వారీణి | సంబోధన |

ఏవం శుచి, సుధి ఇత్యాదయః—ఇదే విధముగా శుచి, సుధి మొదలగు శబ్దములు (ఇకారాంత నపుసంకలింగ శబ్దములు).

ఉకారాంత నపుంసకలింగములు మధు, వస్తు, అశ్రు, వసు అనునవి (గురు—విశేషణ పదము) మొదలగునవి; తకారాంతములైన నపుంసకలింగములు—జగత్, యకృత్, శకృత్—మహత్ మొదలగునవి; ఋకారాంతములైన "కర్తృ" మొదలగునవి; సకారాంత నపుంసక శబ్దములు పయస్, యశస్, తమస్, నభస్, రక్షస్, మనస్, ధనుస్ మొదలగునవి; నకారాంత నపుంసక లింగములైన నామన్ హేమన్, వ్యోమన్, ప్రేమన్ చర్మన్, వర్మన్ జన్మన్ మొదలగు శబ్దములు—జాగ్రత్తగా పరిశీలింపవలసినవి. ఈ శబ్దముల పరిణామములను శబ్దమంజరి మొదలగు గ్రంథములనుండి గ్రహింపవలెను.

[సంస్కృత పాఠాల మీద సందేహాలున్నవారు—'వనిత'కు రాసి తెలుసుకోవచ్చును]



# ఎవరిది తప్పు?

శిరిపురపు సీతాలక్ష్మీనాయుడు

అనగా అనగా ఓ రాజారావు. అతను పెద్ద దేశానికి రాజు కాదు గాని....ఓ పెద్ద గవర్నమెంట్ ఆఫీసులో ఓ చిన్న గుమస్తా.

అతనికి ఏడుగురు భార్యలు, ఏడుపదుల డెబ్బయిమంది సంతానమూ లేరు గాని .... ఓ లక్షణమైన భార్య (సావిత్రి), సలక్షణమైన ఇద్దరు పిల్లలు.... (చిన్న + చంటి) వున్నారు.

రాజారావు చాలా జాగ్రత్తయిన మనిషి అని - ఆఫీసులోను, అతని అద్దె ఇంటి చుట్టుప్రక్కలున్న వాళ్ళు, వాళ్లింటి పాల మనిషి, చాకలి, ఖాతాకొట్టు షావుకారు అనుకుంటుంటారు. అతను ఇద్దరు పిల్లల తరువాత ఆపరేషన్ చేయించుకొన్నప్పుడు కూడా వాళ్లంతా ఆ మాట మరోసారి అనుకున్నారు. సరే! ఈ అనుకోవటాలు వదిలేసి మన కథకొస్తే....మన కథకి కావలసినవాళ్లు.... రాజారావు ఆఫీసువాళ్లు పాలమనిషి, ఖాతాకొట్టు షావుకారు కాదు ..., కేవలం రాజారావు భార్య సావిత్రి, రాజారావు, వాళ్ల ఇద్దరి సంతానం. పెద్దోడు చిన్న (వయస్సు 3 సంవత్సరాలు). చిన్న పిల్ల చంటి (వయస్సు సంవత్సరం పైన రెండు సంవత్సరాలలోపు).

ఇక కథకొస్తే.......

*

వరండాలోని మంచం మీద అడ్డంగా పడుకొని

ఆకాశంలోని మబ్బులవైపు చూస్తూ ఏదో తనలో తానే గొణుక్కుంటున్నాడు చిన్న. వాడి పసి ముఖంలో ఏదో అస్పష్టమైన బాధ.

ఇంటిలో నుంచి నవ్వులు వాడికి వినిపిస్తున్నాయి. ఇంటిలో మంచం మీద కూర్చొని ఒడిలో చంటిని కూర్చుండబెట్టుకొని ఆడుకుంటున్నాడు రాజారావు. చంటిది తన ముక్కు గిల్లుతుంటే తను పులిలా గాండ్రు గాండ్రు మంటున్నాడు. దానికి చంటిది జడుచుకున్నట్లు కళ్లు మూసి పకపకా నవ్వుతూంది. నేలమీద కూర్చొని మంచం మీద ఒక చేయి పెట్టి దానిని ఒత్తుగా తలవాల్చి ఆ వినోదాన్నంతా పెద్ద కళ్ళతో చూస్తూంది సావిత్రి. భర్త పులి వేషానికి కూతురు నవ్వులకు ఆమె ఉండి ఉండీ నవ్వుతూంది.

బయట చిన్న ఆ నవ్వుల శ్రుతి పెరుగుతున్న కొద్దీ అసహనంగా అటూ ఇటూ కదులుతున్నాడు.

ఆ వెనుక ఉండలేక లేచి ఇంటిలోని కెళ్ళాడు.

చంటిదాని వినోదంలోపడి వీడి రాకనే గుర్తించలేదెవరూ.

ఈసారి కాస్త గట్టిగానే గిల్లినట్లుంది చంటి.

రాజారావు పులివేషం మానేసి ముక్కు పట్టుకొని బాధగా మూల్గాడు.

ఆ అవస్థ చూసి గట్టిగా నవ్వింది సావిత్రి.

చిన్న తను కూడా నవ్వాడు.

అప్పుడు చూసింది సావిత్రి. చిన్నను తన దగ్గరకు పిల్చుకొని "చంటీ! అన్నిగాడిని గిల్లమ్మా" అని చిన్న ముక్కు చంటికి అందించింది.

అది పరమానందంగా గిల్లింది.

ముక్కు వదిలేసి "భలే! భలే" అని చప్పట్లు కొడుతూ నవ్వాడు రాజారావు. సావిత్రి నవ్వింది.

చిన్నకు ముక్కు నొప్పిగా వున్నా నవ్వాడు.

ఆ ప్రోత్సాహంతో మరోసారి గిల్లింది చంటి.

సావిత్రి రాజారావులు మరోసారి నవ్వారు. చిన్న నవ్వలేదు. ముక్కు తడుముకున్నాడు బాధగా.

మూడోసారి గిల్లింది చంటి. మూడోసారీ నవ్వారు సావిత్రి, రాజారావు. చిన్న ముక్కుపట్టుకొని 'అమ్మ అని అరిచాడు బాధగా.

మరోసారి గిల్లబోయింది చంటి. విసురుగా ఆ చేతులను తోసేసాడు చిన్న. ఆ ఊపుకు వెల్లకిలా పడింది చంటి. పడటమేంటి – ఆరున్నొక్క రాగమెత్తుకుంది.

"వెధవా! అలాగేరా తోసేస్తావు? కొత్తే బుర్ర వాచిపోను." చెయ్యెత్తి చిన్నను కొట్టబోయాడు రాజారావు.

ప్రక్కకు లాగేసి చిన్నను దగ్గరకు తీసుకొంది సావిత్రి, 'ఎందుకురా తోసేశావు చూడు చంటి ఎలా ఏడుస్తుందో' లాలనగా అంది.

"మరి నా..ము....ము....ముక్కు గిల్లలేదేం" ఉక్రోషంగా అన్నాడు చంటి.

"ము....ము....వెధవకి నత్తొకటి. నీకంటే చిన్నదనుకొన్నావా పెద్దదనుకున్నావా! కొండ ముచ్చు వెధవా. పో" తోసివేశాడు రాజారావు.

"పె....పెద్దదే" అనేసి నిరసనగా అక్కడ నుంచి వెళ్ళిపోయి బయట వరండా మీద మంచంపై పడుకున్నాడు చిన్న.

ఆ వెనుక తండ్రి చేత తల్లిచేత బోలెడు బ్రతిమాలించుకొని, నానా వేషాలు వేయించి చూసుకొని ఆ వెనుక ఏడుపు ఆపింది చంటి. మళ్లీ వాళ్ళు ముగ్గురూ ముక్కు గిల్లటం పులివేషం ఆటలో పడిపోయారు.

వాళ్ళ నవ్వులు బయట మంచం మీద పడుకొన్న చిన్నకు వినిపిస్తూనే వున్నాయి. వాడు మంచంలోకి తల దూర్చేసి ఏడుస్తున్నాడు నిశ్శబ్దంగా.

*

ఆఫీసు నుంచి ఇంటిలోని కడుగుపెట్టగానే రాజారావుకు కనిపించిన దృశ్యం ద్వారానికి ప్రక్కనే పడుకొని దొర్లుతూ ఏడుస్తున్న చిన్న. రాజారావుని చూడగానే వాడు మరింత స్వరం పెంచేసి మరింత ఉధృతంగా దొర్లటం మొదలు పెట్టాడు.

"ఏంరా! ఏం! ఎందుకేడుస్తున్నావ్!"

సమాధానంగా మరింత ఏడుపు....మరింత దొర్లటమూ.

"వాడినేం అడక్కండి! వొట్టి అల్లరి వెధవ. ఉదయంనుంచి ఒకటే ఏడుపు. ఏడవనీయండి! అబ్బా! బుర్ర పిచ్చెక్కెత్తించేస్తున్నాడు" ఏడుస్తున్న చిన్నకి కాస్తంత దూరంలో కూర్చొని చంటికి పాలు పడుతున్న సావిత్రి అంది.

"ఇంతకీ ఏం జరిగింది."

లుంగీ కట్టుకుంటూ అడిగాడు రాజారావు.

"ఏముంది! పాత పాటే! దీనికి పాలు పడుతుంటే వాడికీ కావాలని వచ్చాడు. వద్దంటే ఏడుపు. రండి అన్నం తిందురు."

వంటింటి లోనికి వెళ్ళిపోయింది చంటిని తీసు



## చోడవరపు సత్యవతీదేవి

తెలుగునాట పద్య కవిత్వానికి కాలదోషం పట్టిందని పద్య కవిత్వం చదివే దిక్కులేకుండా పోతున్నదని ఎందరో వాపోతున్నారు. అందులో నేడు నవలలు, కథలు రాసే వనితలే అధికంగా కనిపిస్తున్నారు కాని కవిత్వం చెప్పే వనితలు కరువయ్యారు. అటువంటివారు అక్కడక్కడా వున్నా వారిలో ఏ ఒకరిద్దరో తప్ప తక్కినవారు పైకి రాలేక మరుగున పడిపోయారు. వారిలో శ్రీమతి చోడవరపు సత్యవతీదేవి ఒకరు.

1910 అక్టోబరు 9న మచిలీపట్నంలో జన్మించిన సత్యవతీదేవి స్వయంకృషితో మాతృభాషలోనే కాక హిందీలో కూడా పాండిత్యం సంపాయించారు. 1921లో చోడవరపు రాఘవాచారితో ఆమె వివాహం జరిగింది. 1935లో వారి జీవితాలను విషాదమయం చేస్తూ వారి పిల్లలిద్దరూ మరణించారు. ఆ దుఃఖం మరవడానికి, భర్త ప్రోత్సాహంతో ఆమె కవితా వ్యాసంగం చేపట్టారు. విశ్వనాథ సత్యనారాయణ గారి ప్రోత్సాహంతో 'తొలకరి జల్లు' అనే ఖండ కావ్యాన్ని రచించారు. అప్పటినుంచి అనేక రచనలు చేశారు. వాటిల్లో పేర్కొనదగినవి– 'పల్నాటి మాంచాల', 'మల్లికార్జున శతకము' మొదలైనవి. సుమధురమైన కవనపాటవం గల ఈ కవయిత్రి రాసిన అనేక రచనలు అముద్రితాలుగా వున్నాయి. కవయిత్రుల రచనలకి నేడు కాలదోషం పట్టిందనడానికి ఇంతకన్న నిదర్శనం ఏం కావాలి!

—ఈ. వి. రాజ్యలక్ష్మిదేవి

# డాక్టర్ నివేదిత



లండన్ విశ్వవిద్యాలయంలో ఎలక్ట్రాన్ మైక్రోస్కోప్‌లో కృషిచేసిన ఏకైక వనిత - భారతీయ వనిత కావడం - అందులోనూ తెలుగు వనిత కావడం-విశేషం. అటువంటి ఘనమైన విశేషాన్ని సాధించిన వనిత-శ్రీమతి నివేదిత మల్లెల.

నివేదిత గుంటూరు జిల్లాలోని తురుమెళ్ళ గ్రామంలో జన్మించారు. వరంగల్ ఆర్ట్స్ అండ్ సైన్సు కళాశాల ద్వారా బి.ఎస్సి, ఎన్‌టమాలజీలో విక్రమ్ విశ్వవిద్యాలయం ద్వారా ఎం.ఎస్సి పట్టం పొందారు. ఆ తర్వాత కొంతకాలం వరంగల్లు కాకతీయ వైద్యకళాశాలలో పేథాలజీ విభాగంలో రిసెర్చి అసిస్టెంటుగా పనిచేశారు. 1970 లో వరంగల్ సి. కె. ఎమ్. ఆర్ట్స్ అండ్ సైన్సు కళాశాలలో జువాలజీ లెక్చరర్‌గా చేరారు. ఇంగ్లండులో ఉన్నత విద్య అభ్యసించి వచ్చిన తరువాత ప్రస్తుతం ఆమె ఆ కళాశాలలోనే ఉద్యోగం చేస్తున్నారు.

శ్రీమతి నివేదిత 1973 లో తొలిసారిగా భర్త ఉద్యోగరీత్యా ఐర్లండుకు వెళ్ళారు. అప్పట్లోనే ఆమె అక్కడ రిసెర్చి సీటు కోసం ప్రయత్నించారు కాని అక్కడ సదుపాయాలు తక్కువగా వుండడం వల్ల రిసెర్చి చెయ్యడానికి తగిన అవకాశం లభించ లేదు. 1974 లో స్వదేశానికి తిరిగివచ్చారు. ఆ తరవాత రెండేళ్ళకి భర్త చదువు, ఉద్యోగ రీత్యా ఇంగ్లండు ప్రయాణమవడంతో నివేదిత కూడా ఆ దేశం వెళ్ళారు. ఈసారి ఆమె లండన్ విశ్వవిద్యాలయంలో రిసెర్చి సీటు సంపాయించారు. సాధారణంగా నాలుగేళ్ళు పట్టే ఆ పరిశోధనలు ఆమె మూడుసంవత్సరాలలోనే పూర్తిచేసి డాక్టరేటు పట్టం పొందడం మరొక విశేషం!

ఇంగ్లండులో తన అనుభవాలను ముచ్చటిస్తూ- ''అక్కడ పిల్లలకూ, పెద్దలకుమల్లేనే స్వతంత్ర భావాలు ఎక్కువ. తల్లిదండ్రులు కూడా అందుకు బాగా దోహదం చేస్తారు. పదేళ్ళ పిల్లల దగ్గర్నుండి సెలవుల్లో చిన్నచిన్న పనులు చేసి డబ్బు సంపాయిస్తారు. 15, 16 ఏళ్ళ వయసు వచ్చేసరికి తల్లిదండ్రులపై ఎటువంటివాటికీ ఆధారపడరు. చాలామంది ఎవరంతటవారు సంపాయించి చదువుకుంటారు. అక్కడి విద్యా విధానం కూడా దేశ పరిస్థితులకూ, అవసరాలకూ తగినట్లుగా వుంటుంది. మరో సుగుణమేమంటే అక్కడ ఎవరి పనులు వాళ్ళే చేసుకుంటారు. పనిమనుషులను పెట్టుకోవడమంటే చాలా ఖరీదుతో కూడిన పని. చిన్నచిన్న పనుల దగ్గర్నుంచి నామోషి పడకుండా వాళ్ళే చేసుకుంటారు. అనవసరమైన కాలక్షేపం కబుర్లతో కాలం వృథా చెయ్యరు.

''అక్కడి స్త్రీలకు స్వేచ్ఛ, సమానత్వమూ, ఆర్థిక స్వాతంత్ర్యమూ చాలా ఎక్కువ. ఇంట్లో భార్యాభర్తలు, ముఖ్యంగా యువతరం కలిసే ఇంటిపనులు చేస్తూ వుంటారు. మన దేశంలో లాగా స్త్రీలు ఈ పనులు చెయ్యాలి; పురుషులు ఈ పనులే చెయ్యాలి అనేమీలేదు. అందరూ అన్ని పనులూ చేస్తారు. మగ నర్సులు కనబడ్డట్టుగానే అక్కడ అంబులెన్స్ డ్రైవర్లలో చాలామంది ఆడవారు కనబడతారు. ఉద్యోగాలు చేసే స్త్రీలు మాత్రం పిల్లలు పుట్టిన తర్వాత ఆ పిల్లలకి ఐదారేళ్ళు వచ్చేవరకూ ఉద్యోగం మానేస్తారు. ఆ తరువాత మళ్ళా ఉద్యోగంలో చేరతారు. ఐదారేళ్ళ లోపు పిల్లల్ని వదిలి వెళ్ళడం చట్టరీత్యా నేరం. స్త్రీ, పురుషులు ఉద్యోగంలో ఉండి తమ కాళ్ళ మీద నిలబడగలిగినప్పుడే వివాహం చేసుకుంటారు. అక్కడ వరకట్నం ప్రసక్తే లేదు'' అని చెప్పారు నివేదిత.

ఆమె పరిశోధనలు జరిపిన ఎలక్ట్రాన్ మైక్రోస్కోప్‌తో మామూలు లైట్ మైక్రోస్కోప్‌తో కనిపించని వివరాలు కూడా కనిపిస్తాయి. ఈ మైక్రోస్కోప్‌తో బాక్టీరియా కంటె సూక్ష్మమైన వైరస్‌లను కూడా చూడవచ్చును. క్రిమికీటకాలలో ప్రతి కణంలోని వివరాలను క్షుణ్ణంగా పరిశీలించవచ్చును. క్రిమికీటకాలు పుట్టుక నుంచి క్రమంగా పొందే అభివృద్ధిని, కణాల మార్పులనూ పరిశీలించడంలో పరిశోధనా వ్యాసం సమర్పించి ఆమె డాక్టరేట్ పట్టం పొందారు. అదే సూత్రాన్ని ప్రాథమిక పరిశోధనగా తీసుకుని తెగులు నివారణ నుంచి కాన్సర్ వరకూ పరిశోధనలు జరపవచ్చును. 'ఈ సదుపాయాలు ప్రస్తుతం మన దేశంలో లేకపోయినా త్వరలో లభించగలవనీ, అప్పుడు తను పొందిన శిక్షణ వృథాపోకుండా తప్పకుండా ఉపయోగపడగలద'న్న ఆశాభావాన్ని వ్యక్తం చేశారు నివేదిత.

''వరంగల్లులో నేను ఉద్యోగం చేస్తున్న కళాశాలలో గానీ, విశ్వవిద్యాలయంలో గానీ పరిశోధనాశాలను స్థాపించి ఉన్నతశ్రేణిలో పరిశోధనలు జరుపుతూ, రిసెర్చి చేసేవారికి సహాయపడాలని వుంది. ఎలక్ట్రాన్ మైక్రోస్కోప్ మన దేశంలో కూడా వచ్చినప్పుడు ఆ విధానం నేర్పి అందరికీ ఉపయోగపడేటట్లు చెయ్యాలనీ వుంది'' అన్నారు డాక్టర్ నివేదిత. □

---

కొని. కాళ్ళు కడుక్కొని వంటింటివైపు వెళ్ళిపోబోతూ మరోసారి చిన్నని సముదాయించబోయాడు రాజారావు.

''ఏం కావాలి ! చెప్పు.''

''నాకు పంచదార నీల్లు కావాలి ! పంచదార నీల్లు'' అని రాగాలు తీశాడు చిన్న.

''పంచదార నీళ్ళే తెచ్చివ్వు'' భార్యని పిలిచి చెప్పాడు రాజారావు.

''వాడితోనేంటి మీరెళ్ళి అన్నం తినండి. వాడికి పాలు కావల్సొచ్చినప్పుడల్లా పంచదార నీళ్ళనే అంటాడు మీరు వెళ్ళండి.''

''పోనీ ! ఆ పంచదార నీళ్ళు ఇచ్చి చూడకూడదా !''

పంచదార నీళ్ళు కలిపి తెచ్చింది సావిత్రి.

గుణుస్తూనే అందుకొని త్రాగుతూ కన్నీళ్ళ మధ్య తల్లివైపు చూశాడు చిన్న. తల్లి చంకలోని చంటి వెక్కిరిస్తూ నవ్వినట్లనిపించింది.

అక్కడే కూర్చొని చంటికి పాలు పట్టడం మొదలెట్టింది సావిత్రి.

పంచదార నీళ్ళు త్రాగటం మానేసి తల్లివైపు చూస్తూ వుండిపోయాడు చిన్న.

అది చూసి ''ఏరా ! పాలు త్రాగుతావా'' అని అడిగింది సావిత్రి.

''ఊఁ'' అని అంత లావున వూపాడు.

త్రాగటానికి ముందు కెళ్ళబోయాడు కూడా.

"కొడితే బుర్ర వాచిపోను వెధవకి. పాలు తాగుతాడట పాలు! పెద్ద ఎద్దులా వున్నావు సిగ్గు లేదూ. వెళ్ళు నాన్నతో అన్నం తిను."

ఊహించని ఆ మాటకు తట్టుకోలేకపోయాడు చిన్న. త్రాగుతున్న గ్లాసును దూరంగా విసిరేసి క్రిందపడి ఏడుస్తూ దొర్లటం మొదలెట్టాడు.

ఈలోగా వంటింటినుంచి రాజారావు పిలిస్తే అక్కడనుంచి వెళ్ళిపోయింది సావిత్రి - చంటిని తీసుకొని చిన్నను తిడుతూనే.

కొద్దిసేపు పోయాక రాజారావు టవల్‌తో చేతులు తుడుచుకుంటూ వంటింటినుంచి ముందు గదిలో కొచ్చి గదిలో మంచం మీద పడుకొనివున్న చిన్నను చూసి ఆగిపోయాడు.

మంచం మీద పడుకొని వున్న చిన్న - తల్లి బ్రాసరీని గుండెల మీద పెట్టుకొని దాని వైపు ఆబగా చూస్తున్నాడు.

రాజారావు కొయ్యబారిపోయాడు.

కొన్ని క్షణాల తరువాత తేరుకొని "ఏంరా! ఏంచేస్తున్నావు" అని అడిగాడు.

తండ్రిని చూసి బ్రాసరీని లాగేసి "పాలు" అన్నాడు చిన్న.

*

అర్ధరాత్రి ఎందుకో మెలుకువ వచ్చింది చిన్నకు. లేచి కూర్చున్నాడు మంచం మీద. ప్రక్కన చూస్తే నాన్న లేడు. ఆ ప్రక్క మంచంవైపు చూశాడు. అక్కడ తండ్రి, తల్లి వాళ్ళ మధ్య చంటి - రాణిలా ఒక కాలు తండ్రి మీద, ఒక కాలు తల్లి మీద వేసి.

ఎందుకో తెలియదుగాని వాడికి ఏడుపొచ్చింది. గట్టిగా ఏడవాలనుకున్నాడు. వాళ్ళు లేచిపోతారేమో.

వాళ్ళ మధ్య పడుకున్న చంటిని గట్టిగా గిల్లేయాలనుకున్నాడు. కాని తండ్రి లేచి తంతాడేమో.

ఏం చెయ్యకుండా వుందామంటే - ఛ ఛ ఏం బాగాలేదు ఏదో ఒకటి చెయ్యాలి.

తిరుగుతున్న టేబుల్ ఫ్యాన్ కనిపించింది. స్విచ్ నొక్కి ఆపేశాడు. వచ్చి మంచం మీద నంగనాచిలా పడుకొండిపోయాడు.

కొన్ని నిముషాల తరువాత నాన్న, అమ్మ చంటి అందరూ లేచిపోయారు. "ఫేనెలా ఆగిపోయింది రిపేరా! కరెంట్ ఫెయిలా బెడ్‌లైట్ వెలుగుతూందే మరేమయ్యింది. దొంగ వచ్చాడా! ఎవరొచ్చుంటారు?"

బోలెడు తర్జన భర్జనలు.

అన్నీ వినిపిస్తున్నాయి చిన్నకి. వాడికి చాలా ఆనందంగా వుంది. గట్టిగా నవ్వాలనిపిస్తుంది. అమ్మ నాన్నల అవస్థ చూస్తుంటే.

*

పద్మాసనం వేసేసి ఒడిలో పలక పెట్టుకొని అ ఆ లు దిద్దుతున్నాడు చిన్న. వాడి చూపు అక్షరాల మీద వున్నా మనసక్కడలేదు. ప్రక్కనే కూర్చొని బొమ్మలతో ఆడుకుంటూ అనేక శ్రుతులలో అనేక రాగాలు పాడుతూంది చంటి.

బొమ్మల మధ్య....చంటి సామంత రాజుల మధ్య రాణిలా కేరింతలు కొడుతోంది గొప్పగా. ఎన్ని బొమ్మలు....దగ్గరకెళ్ళి ఒక బొమ్మ అందుకున్నాడు.

అది కీచుమని అరిచి మీద పడి బొమ్మ లాక్కోబోయింది. దానికందకుండా బొమ్మను ఎత్తి పట్టుకున్నాడు. మరోసారి బొమ్మను లాక్కోడానికి ప్రయత్నించి...లేవబోయి బోర్లా పడిపోయింది. ముక్కు నేలకు గ్రుద్దుకొని వాచిపోయింది. దాని అరుపులకి ఇంటిలోనుంచి రాజారావు, సావిత్రి పరుగెత్తుకొచ్చారు.

విషయం అడక్కుండా తెలుసుకోకుండా.... చిన్నను పట్టుకొని ఎడాపెడా వాయించేశాడు రాజారావు. సావిత్రి కొడుకును ప్రక్కకు లాగేసింది.... భర్తకు అందకుండా.

అన్ని దెబ్బలు తగిలినా ఏడవలేదు....చిన్న.

వాడి మనసులో ఏం భావాలు చెలరేగుతున్నాయో గాని....వాడి ముఖం మాత్రం గంభీరంగా వుంది. ఎవరు విసిరేశారోగాని, ఆ సాయంత్రానికి చంటి బొమ్మలన్నీ కాలువలో పడి వున్నాయి.

కామెంటరీ వింటూ రేడియో దగ్గర కూర్చున్నాడు రాజారావు. గవాస్కర్ 96 దగ్గర అరగంట నుంచి వున్నాడు. సెంచరీ చేస్తాడా చెయ్యడా.. చేస్తాడా! మిస్ అవుతాడా....

రాజారావు చెవి రేడియో కంటుకుపోయింది.

చిన్న వచ్చాడు....కొద్దిసేపు నిల్చున్నాడు.... తండ్రి తనవైపు చూస్తాడనుకున్నాడు....చూడలేదు.

"నాకు జ....జ్వరము డాకటరు దగ్గిరికి తీసుకెళ్ళు" వినిపించుకోలేదు రాజారావు. మరోసారి చెప్పాడు చిన్న. లాభం లేకపోయింది. దగ్గరకొచ్చి తండ్రి భుజం పట్టుకొని కుదిపి చెప్పాడు.

అంతలో రేడియోలో గోల....అవుటయ్యేడో తెలియదు. సెంచరీ పూర్తి చేశాడో తెలియదు....

"డాకటరు దగ్గరకు తీసుకెళ్లు ..." అరిచాడు చిన్న.

"పో! పో! రాస్కెల్" త్రోసేశాడు కొడుకుని. చిన్న ఆ వూపుకు క్రింద పడిపోయాడు. తన గొడవలో వుండిపోయాడు రాజారావు.

చిన్న లేచాడు. తండ్రి వైపు నిరసనగా చూసి ఇంటిలోనికెళ్లాడు. వంటపనిలో వుండి సావిత్రి వాడిని చూడలేదు. బయటికొచ్చి వరండాలో కూర్చున్నాడు.

పడిపోయేటప్పుడు మోచేయి నేలకు రాసుకుపోయినట్లుంది. చర్మం కొంచెం వూడింది. మంటగా వుంది. ఎటునుంచి వచ్చిందో చంటి దగ్గర కొచ్చింది. తల ప్రక్కకు త్రిప్పుకున్నాడు చిన్న. అది ఊరుకోక గిల్లింది. ఊరుకున్నాడు....మరోసారి గిల్లింది. ఈసారి మోచేతి మీద చర్మం ఊడిపోయిన చోట గిల్లింది.

"అమ్మా...." అని బాధగా మూలిగి.... మెలికలు తిరిగిపోయాడు చిన్న. అది చూసి చప్పట్లు కొడుతూ నవ్వసాగింది చంటి. ఉక్రోషంతో గట్టిగా త్రోసేశాడు వెళ్ళి. ప్రక్కనున్న సైకిలు మీద పడింది. తల మీద దెబ్బ తగిలింది....కీచుమంది. ఇంటిలోనుంచి పరుగెత్తుకొచ్చాడు రాజారావు. తల నుంచి రక్తం కారుతున్న కూతుర్ని చూశాడు. "ఏంరా ఏం చేశావు ..." కాల్చేసినట్లు కొడుకుని చూస్తూ అడిగాడు.

"నన్ను గిల్లింది! తోసేశాను!" ఉక్రోషంగా చెప్పాడు.

"రాస్కెల్! రోజు రోజుకి నీ ఆగడం మించిపోతూంది. చంపేస్తాను...." అని మీదికి వెళ్ళబోయాడు రాజారావు.

చుట్టూ చూశాడు చిన్న. దగ్గరలో పలక కనిపించింది. అది చేత్తో అందుకొని కసిగా తండ్రికేసి విసిరికొట్టి....ఒక్కదూకున వీధిలోనికి పారిపోయాడు చిన్న. □

గత 15 సంవత్సరాలుగా ఆకాశవాణి హైదరాబాదు కేంద్రం నుంచి ప్రాంతీయ వార్తలను చదవడం ద్వారా ప్రజలకు సన్నిహితులైన వారిలో కుమారి మాడపాటి సత్యవతి ఒకరు. ప్రస్తుతం ఈమె ఆకాశవాణి - హైదరాబాద్ కేంద్రం వార్తా విభాగంలో అసిస్టెంట్ న్యూస్ ఎడిటర్‌గా పని చేస్తున్నారు. మన రాష్ట్రంలో ఆకాశవాణి వార్తా విభాగంలో ఎడిటర్ వృత్తి నిర్వహిస్తున్న ఏకైక వనిత కుమారి సత్యవతి కావడం విశేషం.

మాడపాటి సత్యవతిగారు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఎం. ఏ. (తెలుగు) పట్టం పొందారు. చదువుకునే రోజుల్నించి రాజకీయాల్లో ఆసక్తి కనబరచేవారు. వార్తలు చదివేవారికి సమకాలీన రాజకీయాలపట్ల అవగాహన వుండడం చాలా అవసరం. అటువంటి సదవగాహన సత్యవతిగారికి చిన్ననాటి నుంచీ వుండేది. చినతాతగారు మాడపాటి హనుమంతరావుగారు, తండ్రి మాడపాటి రామచంద్రరావుగారు రాజకీయ, సాంఘిక రంగాల్లో ప్రత్యేకంగా కృషిచేసి వుండడం కూడా ఈమెకు రాజకీయాల్లో అభినివేశం కలగడానికి దోహదం చేసాయి.

కాలేజీలో చదివే రోజుల్నించి ఈమె రేడియో కార్యక్రమాలను అభిమానించేవారు. ఆ కార్యక్రమాల్లో తాను కూడా పాల్గొనాలనే ఆసక్తి కలిగింది. చదువు ముగిసిన తర్వాత 1965 - 66 ప్రాంతాల్లో ఆకాశవాణి - వార్తా విభాగంలో న్యూస్ రీడర్‌గా చేరారు.



# ఎమ్. సత్యవతి

ప్రజలకు వార్తలనందించే సాధనాలు ప్రధానంగా రెండు - పత్రికలు, రేడియో. కానీ ఈ రెండింటిలోనూ వార్తలను తెలిపే పద్ధతిలో ఎంతో తేడా వుంది. అందుకే మనవారిలో పత్రికా భాష, రేడియో వార్తల భాష అని ప్రత్యేకంగా రెండు వర్గాలు కూడా ఏర్పడ్డాయి. ఈ రెండురకాల వార్తాప్రసార సాధనాలకూ ప్రధానంగా వున్న భేదమేమిటని ప్రశ్నించినపుడు ఆమె ఇలా అన్నారు —

"పత్రిక భాషకంటె రేడియో వార్తల భాష సూటిగా, సులభగ్రాహ్యంగా వుండాలి. ఎందుకంటే పత్రికలో ప్రచురింపబడిన వార్త ఒకసారికి అర్థం కాకపోతే, మళ్ళీ చదువుకోవచ్చు. రేడియోలో ఆ సౌకర్యం లేదు. విన్న వెంటనే అర్థమయ్యేలా వుండడం రేడియో వార్తల మొదటి లక్షణం. అందుకే రేడియో కోసం వార్తలను అనువదిస్తున్నప్పుడు మన పాండిత్యాన్ని ప్రదర్శించకూడదు. దీర్ఘ సమాసాలూ, క్లిష్టమైన వాక్య నిర్మాణం, అలంకారాలూ - ఇవన్నీ రేడియో వార్తలను మెరుగుపరచడానికి బదులు, అగమ్యగోచరంగా చేయవచ్చు. పత్రికా రచనలో కొంతవరకు ఆలంకారిక భాష నుపయోగించడానికి వీలుంటుంది. ఈ రెండింటికీ వున్న భేదం చాలా సూక్ష్మమైనదైనప్పటికీ చాలా ముఖ్యమైంది.

"వార్తలు చదివేవారు ఉచ్చారణపట్ల శ్రద్ధ వహించాలి. ఉచ్చారణ స్పష్టంగా, దోష రహితంగా ఉన్నప్పుడే వార్తలను అర్థవంతంగా చదవగలరు. మామూలు సంభాషణల్లో ఎవరి అలవాటును బట్టి వారు కొన్ని పదాలు వింతగా పలకడం, కొన్ని శబ్దాలు మింగేయడం వంటివి చేస్తూంటారు. కానీ ఆలాంటి అలవాట్లు, వార్తలు చదివేటప్పుడు కూడా నిగ్రహించుకోలేకపోతే, పొరబాట్లే అవుతాయి. అంతేకాకుండా, వార్తలను గంభీరంగా చదవాలి. మరీ నాటకీయంగా గానీ, మరీ పేలవంగా గానీ చదివితే అంత బాగుండదు" అన్నారు సత్యవతి.

—మృణాళిని



ప్రతి పట్టణంలోనూ అక్కడక్కడ మహిళా సంఘాలు ఏర్పడి తమకు తోచిన విధంగా స్త్రీ సేవా కార్యక్రమాలను నడుపుతున్నాయి. మద్రాసు నగరంలో స్త్రీ పురుషుల సమానత్వం కోసం; స్త్రీలలో నూతన చైతన్యం కల్గించడానికి కృషి చేస్తున్న సంస్థ – తమిళనాడు ప్రజాస్వామ్య మహిళా సమాఖ్య.

అంతర్జాతీయ మహిళల దినమైన మార్చి 8న ప్రపంచంలోని ముఖ్య నగరాలలో సభలు, ఊరేగింపులు జరిగాయి. ఈ సందర్భంగా మార్చి పదవ తేదీన ప్రజాస్వామ్య స్త్రీ సమాఖ్య కూడా మద్రాసులో ఊరేగింపు జరిపింది.

పురుష ఆధిక్యతకు, వరకట్నానికి వ్యతిరేకంగా నినాదాలు చేసిన ఈ ఊరేగింపులో నిమిషానికి నిమిషం పెరిగిపోతున్న ధరల పట్ల తీవ్ర ఆందోళన వ్యక్తం చేయబడింది. మంత్రాలకు చింతకాయలు రాలవనీ – శుష్క వాగ్దానాల వల్ల, సరిగ్గా అమలు జరగని చట్టాల వల్ల ధరలను అదుపు చేయడం అసాధ్యమనీ – ధరలను అదుపు చేయాలంటే నిత్యావసర వస్తువుల అమ్మకాలను పూర్తిగా ప్రభుత్వమే చేపట్టాలనీ ఈ సమాఖ్య సూచించింది.

స్త్రీలపట్ల జరుగుతున్న అన్యాయాలను ముఖ్యంగా ఇటీవల మధురా పోలీస్ స్టేషన్‌లో స్త్రీలపై జరిగిన అత్యాచారాల మీద సుప్రీమ్ కోర్టు ఇచ్చిన తీర్పును తీవ్రంగా ఖండించిన ఈ వనితల ఊరేగింపులో కొందరు యువకులు కూడా పాల్గొనడం చెప్పుకోదగ్గ విశేషం!



టి. జాహ్నవి సుమన్ (ఏలూరు) పుట్టిన తేదీ: 20-4-79 తల్లి పేరు: టి. లక్ష్మీదేవి

ఈ నెల పుట్టిన రోజులు గల శిశువుల్లో- ఏడాది పిల్లల గ్రూపులో టి. జాహ్నవి సుమన్; రెండేళ్ల పిల్లల గ్రూపులో జి. జయశేఖర్‌రెడ్డి 'పుట్టిన రోజు బహుమతుల'కు ఎన్నికైనారు. ఈసారి మూడవ గ్రూపులో ఏ మాత్రం సంతృప్తికరమైన ఫొటోలు రానందున ఏడాది, రెండేళ్ళ వారిని మాత్రం ఎన్నిక చేయడం జరిగింది. మొత్తం అన్ని గ్రూపులలోనూ ఆరోగ్యంగా కనిపించే మరో ముగ్గుర్ని ఎన్నిక చేసి విడిగా ప్రచురిస్తున్నాము. మే సంచికలోని ఈ శీర్షికకు ఫొటోలు పంపేవారు - వివరాలతో సహా (ఫొటో తీయించిన తేదీ ముఖ్యంగా వుండాలి. ఫొటో వెనుక పెన్సిల్‌తో వివరాలు రాయాలి. ఫొటోలు 'క్వార్టర్' సైజుకు తక్కువ సైజులో వుండకూడదు. తిప్పి పంపడానికి తగినన్ని తపాలా బిళ్లలు గల కవరు జతపరచాలి.) ఏప్రిల్ 5వ తేదీ లోగా మాకు చేరేలా పంపగోరుతున్నాము.



జి. జయశేఖర్‌రెడ్డి (హైదరాబాదు) పుట్టిన తేదీ: 5-4-78 తల్లి పేరు: అరుణ పద్మ






ఆర్. అశోక్ (విశాఖపట్నం) పుట్టిన తేదీ: 25-4-79 తల్లి పేరు: ఆర్. లక్ష్మీరాంప్రసాద్



డి. సరోజ (శ్రీకాకుళం) పుట్టిన తేదీ: 18-4-77 తల్లి పేరు: డి. పద్మావతి



ఎమ్. సంజీవ్‌కుమార్ (హైదరాబాదు) పుట్టిన తేదీ: 1-4-79 తల్లి పేరు: ఎమ్. కుమార్ప్రసాద్





Edited & Published by B. Viswanatha Reddi for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) & Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., Madras-600 026.